Madras Government Oriental Manuscripts Series No. 18.






# సకలనీతికథానిధానము

ఎఱ్ఱయ ప్రణీతము

# SAKALA-NĪTI-KATHĀ-NIDHĀNAMU

BY

ERRAYYA

*Edited by*

T. CHANDRASEKHARAN M.A., L.T.,
*Curator,*
*Government Oriental Manuscripts Library, Madras*
*and the Staff of the Library.*

**Under the orders of the Government of Madras.**

**1951**

**Price Rs. 4-10-0**

# PREFACE

Telegu literature abounds in didactic fable represented by *Pañcatantra*, Prose romances represented by *Kādambarī*, *Daśakumāracarita*, stories after the manner of *Tōtināma*, *Alaflaila* represented by *Śuka Saptati* and *Haṁsaviṁśati* and tales of wonder like *Vikramārka Kathās*. *Sakalanītikathā Nidhānamu*, a *Prabhandha* in five *Āśvāsas* belongs to this type. This is a clever anthology emboxing not only the stories of *Bṛihatkathā*, *Kādambarī* but also some stories relating to the kings of *Kaliyuaga*. Translations of many popular sanskrit verses are also found in the work.

## AUTHOR AND DATE

The author of this work is *Errayya*, son of *Kūchanāmātya*. He belongs to *Śrīvatsa Gōtra*." *Aṣṭabhāṣā Kavitā pravīṇa* " and " *Navaghaṇṭā Suratrāṇa* " are his titles. A Telugu rendering of *Ratirahasya* of *Kōkkoka* by *Erraya* is a very popular book in the Telugu country. *Purāṇa Sāra* which is attributed to the same author (Vide Text page 4 verse18) is not extant. The present work was dedicated to Lord *Śrī Veṅkaṭeśvara* at the royal command of *Kunṭamukkula Pina Bhairavamantri*. *Mallamantri* the dedicatee of *Ratirahasya* was the paternal uncle of *Pina Bhairava Mantri*. The fact that *Bhairava mantri* and *Mallamantri* ruled over *Koṇḍapalli* and *Vinukoṇḍa* respectively in the later half of the 15th century confirms that the present author *Erraya* must have flourished at the same time in *Koṇḍavīḍu*, ***Krishna District.***

## STYLE

The restrictions of grammar and rhetoric are a little slackened in this work without in any way effecting the grace and dalicacy of the book. The work is moulded in *Drākṣhā Pāka*. The free use of *Ktvārthaka Sandhi* (Compounds) is found in many of the works that were produced in that age.

## MATERIAL FOR PRINTING

Three manuscripts D. No 857, 858 and 859 are available—in the Government Oriental Manuscripts Library. D. Nos. 857 and 858 are incomplete paper manuscripts and D. 859 is a continuation of D. No 857. D. No. 859 is a palam-leaf manuscript from which the other three were copied. The press copy is prepared with the help of the three manuscripts. There are no other copies available to compare and collate.

My thanks are due to Sri T. L. Narasimha Rao, B. Sc., Telugu Pandit of this Library, for preparing the press copy and correcting the proofs. I have to thank also the Rathnam Press for printing this work in the best manner possible.

Govt. Oriental Manuscripts Library, Madras,
Dated 10-12-1951.

T. CHANDRASEKHARAN.



# మున్నుడి

నీతిబోధకములగు గ్రంథములు తెలుఁగువాఙ్మయమునఁ బెక్కులు గలవు. నారాయణకవి, భానుకవి వేంకటనాథుల పంచతంత్రానువాదములు, దశకుమారచరిత్రమువంటి గద్యకావ్యముల యనువాదములు కదిరీపతి కృతమగు శుకసప్తతి, అయ్యలరాజునారాయణామాత్యుని హంసవింశతివంటికథలు విక్రమార్కగాథలు, ఇవియన్నియును నీతిబోధక వాఙ్మయమునకు చెందినవే. సకలనీతి కథానిధానముగూడ యీ శ్రేణి లోనిది. ఈకృతి ఎట్టియకవిది. ఐదాశ్వాసముల హృద్యప్రబంధము. ఇందు బృహత్కథ, దశకుమారచరిత్ర కాదంబరి మొదలగు వానిలోని కథలే కాక కలియుగరాజుల చరిత్రలుకూడ కొన్ని వర్ణింపబడినవి. అనుప్రసక్తములుగా చిన్నచిన్న నీతికథలేకాక బేతాళకథలును జొనుపబడినవి. అనేక నీతి శ్లోకములకిందు తెలుగుసేత కలదు.

## కృతికర్త - కాలము

ఈ కావ్యరచయిత ఎట్టియ శ్రీవత్సగోత్రుఁడు, కూచనామాత్య పుత్రుడు. "అష్టభాషాకవితాప్రవీణ" "నవఘంటాసురత్రాణ" అను బిరుదములు కలవాఁడు. ఈతఁడే కొక్కోక పండితకృతమగు రతిరహస్యమును దెలిఁగించెను. పురాణసారమను వేఱొకకృతి గూడ నీతఁడు రచించెనట. (ప్రథమాశ్వాసము 18 వ పద్యము చూడుడు.) అది గానరాదు. కుంటముక్కల పినభైరవమంత్రి ప్రేరణమున నీకవి యీ కృతిని శ్రీవేంకటేశ్వరస్వామి కంకితమొనర్చెను. భైరవమంత్రి పినతండ్రి మల్లమంత్రి. ఈతఁడే కొక్కోక కృతిపతి. పినభైరవమంత్రి కొండపల్లికిని, మల్లమంత్రి వినుకొండకును పదునైదవశతాబ్ది ఉత్తరభాగమున ప్రభువులుగానుండిరను చరిత్ర నిర్ణయమువలన కృతికర్త ఎట్టియ కృష్ణామండలపు కొండవీటిసీమవాసిగా ఆకాలముననే వెలసినట్లు తేలుచున్నది.

## కవిత్వము

ఈయనరచనలో క్త్వార్థకసంధులు మొదలైన లక్షణాతిక్రమ ణము లటనట గానవచ్చుచున్నవి. నాటి కావ్యములు పెక్కిటి యందివి సామాన్యములే గాన గుణసహితమగు నిట్టి కావ్యమందవి యంతగాఁ బరిగణనీయములుగావు. వివిధములగు కథల సంకలనమైన యీ కావ్యమునందలి యీతని కథనవైఖరియును, శైలియును, యాయా రస భావములకు పరిపోషకములుగా నమరి విసువుపుట్టింపనివియై మనోహరముగా నున్నవి.

## సంస్కరణము

దీని ముద్రణమునకు ప్రాచ్యలిఖితపుస్తకాగారమునన్న ప్రతులే యాధారములు. D-Nos. 857, 858, 859 కలవి మూఁడు ప్రతులు కలవు. D-No. 857 కాగితపుఁబ్రతిని ఆదినుండి చతుర్థాశ్వాసమునఁ గొంతవఱకుఁ గలదు. D-No. 858 కాగితపుఁబ్రతిలో దీని తర్వాతి భాగముగలదు. మూడవదియగు D-No. 859 తాళపత్ర ప్రతి, వీని మాతృక. గ్రంథపాతములెక్కువగా నేర్పడినవి. అచ్చటచ్చట శైథిల్య ములుగూడగలవు. సాధ్యమైనంతవఱకు సంస్కరింపఁబడినది. గ్రంథ పాతములులక్షణదోషములు సందిగ్ధపాఠములుమున్నగునవి ప్రశ్నార్థకాది చిహ్నములతో సూచింపబడినవి.

దీనిని ముద్రణమునకు సిద్ధపఱిచి ప్రూఫులనుజూచిన శ్రీతాడూరి లక్ష్మీనరసింహారావు బి. ఎస్. సి. గారు, లైబ్రరీ పండితులు సంస్మరణీ యులు. దీని ముద్రణమునఁదగు శ్రద్ధఁగైకొని మేలుగ రూపెత్తించిన "రత్నం" ముద్రణాలయమువారికిఁ గృతజ్ఞతాభివందనములు.

టి. చంద్రశేఖరన్

# గ్రంథ విషయములు

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము



---

సూచన : 1. పంచమాశ్వాసమున 257 వ పుటనుండి 272 వ పుట వఱకు పుటసంఖ్య 200 కు మాఱు 300 గ దొరలినది.

2. 251, 253 పుటలలో 5 వ యాశ్వాసమునకు బదులు 4 వ యాశ్వాసమని దొరలినది.

---

శ్రీ

# సకలనీతి కథా నిధానము

## ఎఱ్ఱయ ప్రణీతము



శ్రీలలనాధినాథుఁ డతసీకుసుమాంచితమూర్తి యష్టది
క్పాలకిరీటరత్నరుచిభాసి పదాబ్జుఁడు మిత్రసర్వభూ
పాలుని గుంటముల్లపినభైరవపాత్రుని నేలు సత్కృపా
లోలుఁడు వేంకటేశ్వరుఁడు లోకములెప్పుడుఁ బ్రోచుగావుతన్. 1

ఉ. గోత్రతనూభవోరు కుచకుంభపటీర సుగంధివక్షుఁడ
క్షిత్రయశోభి శంకరుఁడు శ్రీకరు గంగయభైరవపాత్రునిన్
బాత్రవరేణ్యు నేలు శశిభాసికిరీటుఁడు, బ్రోచు గాత లో
కత్రయవాసులన్ సకలకాలము వాంఛిత భవ్యసిద్ధులన్. 2

ఉ. బ్రహ్మమయుండు భారతికిఁ బ్రాణసఖుండు పదాంబుజాశ్రిత
బ్రహ్మ మునీశ్వరుండు [1]సితపంకజమందిరుఁ డప్పరాశర
బ్రహ్మకులాధినాథుఁబినభైరవునిన్ మహశాస్త్రశేఖరున్
బ్రహ్మముగాఁగ నేలు వరభావుఁడు లోకముఁబ్రోచుగావుతన్. 3

ఉ. కొక్కెకౌ వాహనంబు తలకుంగుసుమంబుబెళ్వేతచందురుం
డొక్కటి యట్టిపంతము సముజ్జ్వలమై వెలుగొందుమూర్తిచే
మ్రొక్కినవారి కిష్టఫలముల్ గృపసేయు గణేశ్వరుండు సొం
పెక్కఁగఁ బిన్నబయ్యన హృదీశుఁడు మర్త్యులఁ బ్రోచుగావుతన్. 4

---

1. రగ.

2. ఒక్కటి గ్రంథపాఠము.

క. వాల్మీకిఁ దలఁతు నపగత
కల్మషరఘురామ కావ్యఘటకీలుం బు
ణ్యోల్మ ? విహీనుం బ్రజ్వాలి
తోల్ముకనిభనేత్రు బ్రహ్మయోగపవిత్రున్. 5

క. వేసరక గొల్తు నిగమా
భ్యాసుని శ్రీరమణపాద పంకజసేవా
వాసున్ ముక్తి ? పురపద
వీసంచరదృష్టివాసు వేదవ్యాసున్. 6

క. భారవిని గాళిదాసున్
చోరున్ జయదేవు మాఘు సూర్యకవీంద్రున్
పేరెన్నికగల సంస్కృత
సారకవీశ్వరులఁ దలఁతు సజ్జన ఫణితిన్. 7

చ. వినుతి యొనర్తు నాంధ్రసుకవీంద్రులనన్నయభట్టుఁ దిక్కయ
జ్వను నమరేశ్వరుం బెదలువాడమహాత్ముని మారనార్యు నా
చనసుతు సోము భాస్కరుని జక్కయను[1] గవిసార్వభౌమునిన్
వనరుహపుత్రసన్నిభుల వర్ణిత కావ్యకళావిధిజ్ఞులన్. 8

ఉ. నూతనశబ్దబంధములు నోటికి శక్యముగాక బొంతగా
బూతులుగూయు కైవడిని పాఁచి కవిత్వములల్లి వాడలన్
గూఁతలు గూయు దుష్కవులకున్ వశమే కరఁగింప నీటిపై
వ్రాతలుపోలె బోవు కవివైఖరులున్ విలసిల్ల నేర్పునే. 9

క. సుకవులు చెప్పిన కవితా
నికరములు శిలాక్షరములనిలుకడ గాంచున్
కుకవులు చెప్పినకవితా
నికరములు జలాక్షరముల నీచతఁ బఱఁగున్. 10

---

1. చెన్నయుని అని పాఠాంతరము.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును బురాతనకవీశ్వరుల నమస్కారంబును గుకవితిరస్కారంబును నాచరించి యొక్క విచిత్ర కథా ప్రబంధంబు విరచింపఁదలంచి తన్మాతృకార్చనా [1]పరాయణుం డనై యున్న సమయంబున. 11

సీ. ప్రభవించె నేవీటి పర్వతాగ్రంబున
నరిగిరీశ్వరుఁడు శ్రీనాయకుండు
వసియించె నేవీటివర్ణితసాలాంత
రమున మూలస్థాన రాజమౌళి
యుదయించె నేవీటి యుత్తరాశాతట
భూమణీకృతనింబ పుట్టలమ్మ
వరియించె నేవీటివలదిశాకోణంబు
నందు గుబ్బటల మైలారమూర్తి

తే. వినుతిగాంచిరి యేవీటి విప్రరాజ
వైశ్యశూద్రాది బహువిధ వర్ణసమితి
యట్టిపురరత్నమొప్పు భవ్యాంబుజాత
మండితామరతరువల్లి కొండపల్లి. 12

క. ఇటువంటికొండపల్లి
పుటభేదనమంత్రిమకుటభూషణమరి(రా)
కృటకవిభేదనఘటనో
ద్భటుఁడగు [2]కుటముక్కపిన్న భైరవుఁడొప్పున్. 13

క. వనితాజనకం దర్పుఁడు
ఘనదాన ఘనాఘనంబు కమనీయవిభా
దినకరుఁడు కుంటముక్కుల
శివభైరవమల్లమంత్రి పృథుతరకీర్తిన్. 14

---

1. తన్మాతృకాసేవనా.
2. పుట భేదనమంత్రి మకుట భూషణమరిరా ట్కటక విభేదన ఘటనోద్భటుఁడగు.

క. గురుశేఖరప్రభావుఁడు
తిరుమలయాచార్యుఁ డాత్మదేశికుఁడన సు
స్థిరకీర్తి సప్తసంతతి
పరుఁడగు వినభైరవుండు ప్రతిదివసమునన్. 15

చ. సరసకవీంద్రులున్ విబుధసంఘము నాప్తులు నిష్టభృత్యులున్
గరణులు వందిమాగధులు దత్త్వవిధిజ్ఞులు రాయబారులున్
సరవి భజింప బూర్వనరనాథకథల్ వినువేడ్కమానసం
బురహమునందుఁ దోఁచుటయు మున్ను ననుం బిలువంగఁబంచినన్. 16

క. ఏనును దన్మంత్రీశ్వరు
నానతి నాస్థానమునకు నరిగి మనోజ్ఞా
సీనుఁడనై యున్నను[1] బహు
మానముతోఁ జూచి మంత్రిమణి యిట్లనియెన్. 17

సీ. శ్రీవత్సగోత్రవారిధి పూర్ణశీతాంశుఁ
డగు కూచిమంత్రికి నాత్మజుఁడవు
వివిధాష్టభాషాకవిత్వవాచాప్రౌఢిఁ
బూర్వకవీంద్రులఁ బోలినాఁడ
వఖిలపురాణేతిహాస కావ్యస్మృతి
చయము రచించిన చారుమతివి
మాపిన తండ్రైన మల్లమంత్రికిని గా
కోకంబు చెప్పిన కోవిదుఁడవు.

తే. రసికులభినుతిసేయఁ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టిప్రౌఢ
వట్లుగావున నొకటి నిన్నడుగఁ దలఁచి
యిచ్చటికి బిల్వబంచితి నెఱ్ఱనార్య ! 18

1. సీనుఁడనైన నను—మనుపాఠముగూడ గన్పించుచున్నది.

క. భావమునఁదోఁచె గలియుగ
పావనభూపాలకథలు బంధురకావ్య
శ్రీవెలయ నంధ్రభాషను
గావింపఁగవలయు సుప్రకాశత నాకున్. 19

క. జపితుని సద్వ్రతశీలుని
తపసిఁ బతివ్రతను భోగి త్యాగిన్ శూరున్
నృపతినిఁ దలఁచినఁ దడవిన
నపవర్గఫలంబు లబ్బునందురు విబుధుల్. 20

తే. అట్లుగావున దొల్లిఁటి యవనిపతుల
కథలు పెక్కులు వింటిసత్కవులవలనఁ
గలియుగఖ్యాతలేంద్రులకథలు వినఁగ
వలయు రచియింపు మంధ్రకావ్యంబుగాఁగ. 21

క. మాకిష్టదైవమగు నా
శ్రీకాంతుఁడు వేంకటాద్రిశిఖరావాసుం
డాకృష్ణున కర్పణముగ
నీ కవితకథానిధాన మిమ్ము సద్భక్తిన్. 22

వ. అని కర్పూరతాంబూల కనకాభరణాంబరాదులొసంగి యనిపిన యాత్మగృహంబున కరుగుదెంచి యొక్క శుభముహూర్తంబునం గృతిచెప్పనుద్యోగించి, 23

ఉ. హేమము కమ్మదావుల వహించుట జాతిలతాంతసౌరభం
బామని సోఁడుముట్టుట కళాశ్రయ కామినియాట యిక్షువం
గామితమైన సత్ఫలము గల్గుటగాదె తలంచిచూచినన్
నామృదుకావ్యకన్య కధినాథుఁడు వేంకటభర్తయౌటకున్. 24

వ. అని తలంచి మదీయసకల నీతికథానిధానంబున కధీశ్వరుండైన శ్రీవేంకటాచలేశ్వరు మహిమ షష్ఠ్యంతవిధంబున వినుతించెద. 25

సీ. ఆదికాలమున నారాయణాచలమను
నామంబు దాల్చెనే నగవరంబు
త్రేతాయుగంబున శ్వేతాచలంబను
ప్రఖ్యాతిగాంచె నే పర్వతంబు
ద్వాపరంబున శేషధాత్రిధరంబను
పొగడికగాంచె నే భూధరంబు
కలియుగవేళ వేంకటశైలమను పేరు
ధరియించె నే వసుధాధరంబు

దేశభాషల నే గిరి తిరుమలనగ
కోరికలనిచ్చు జనుల, కే కొండ తేదు
గరుడనామంబు దాల్చె నే గిరులరాజు
తగదె ప్రస్తుతిసేయ నయ్యగకులేంద్రు. 26

వ. అట్టి వేంకటాచలాధీశ్వరుండు, 27

సీ. శరభశార్దూల కేసరిమృగంబుల వేఁట
లాడుచో చెంచులగూడి యాడు
వాసంత విభవోత్సవంబుల సతులతో
దెప్పలఁగోనేటఁ దేలి యాడు
కలితకన్యా మాసకల్యాణ దర్శనా
మర్త్యమర్త్యులతోడ మాటలాడు
సతతసేవాసమాగత దేశికులు చూడ
తేరెక్కి పురవీధిఁ దిరిగి యాడు

కొలుచువారికి గొలువంగఁదలఁపు గలిగి
వచ్చువారికిఁ గోరినవరములిచ్చి
యాదరంబున ముచ్చటలాడువాఁడు
నగుచు వేంకటశైలరమాధవుఁడు. 28

—: పద్యాంతములు :—

క. ఈ దృశమహిమాస్పదునకు
వేదాంతశిఖాప్రదీప్త విద్యామణికిన్
శ్రీదయితాకుచఘుసృణా
మోదాయితవక్షునకును మునిరక్షునకున్ 29

క. కోనేటి సలిలకేళీ
మానితసరసానురాగ మదమానవతీ
సూనశరక్రీడాసం
ధానవిలాసునకుఁ ద్రిజగదావాసునకున్ 30

క. పాపవినాశనతీర్థ
వ్యాపార నిదర్శితాఘవారణలీలా
టోపఘనగండశైల
స్థాపితవేంకటగిరీంద్ర సదనస్థితికిన్. 31

క. మహనీయ విభవభైరవ
మహాపాత్ర మనోంబుజాత మందిరున కురో
విహితేందిరునకు నమితా
మహాముఖ ? సురతతికి దానమానసగతికిన్. 32

క. ఆకాశవాహినీజల
శీకర భవశిశిరపవన శిథిలితలక్ష్మీ
భూకామినీరతిశ్రమ
జాకల్ప స్వేదబిందు సంసిక్తునకున్. 33

క. నవరసభావ విశేషో
ద్భవరచనాచిత్రమధుర బంధురకావ్యా
స్తవవచనామృతలహరీ
కవితానాథునకు శ్రీజగన్నాథునకున్. 34

వ. దండప్రణామంబులు సమర్పించి తాను రచియింపంబూనిన సకల
నీతి కథానిధానంబునకు నుపక్రమం బెట్టినవిధ. 35

ఉ. సారస పత్ర నేత్రుఁడు ప్రసన్నతనొంది స్వకీయమందిర
ద్వారముగాఁచి యుండ బలిదైత్యవరుండు రసాతలంబు దు
ర్వారత నేలె నాగపుర వల్లభమానససంచరప్రతా
పోరు భుజాప్రవృత్తిని మహోగ్ర శరాసనబాణ హస్తుఁడై. 36

ఉత్సాహ :
నాగలోకమిట్లు దైత్యనాథుఁ డేలుచుండియున్
యాగమద్భుతంబుగా మురారి గూర్చి సేయుచో
భోగపతిని తీర్థమాడఁ బోయియంతనారదుం
డాగరిష్ఠు యజ్ఞశీలు నట్లు చూడవచ్చెడున్. 37

వ. అర్ఘ్యాది విధులంబూజించి తోడ్కొని తెచ్చి యుచితపీఠంబున
నుపవిష్టుం జేసి కరపుటఘటిత నిటలుండై వినయోక్తుల నిట్లనియె. 38

ఆ. బ్రహ్మతనయ ! నీదు రాకకు గతమేమి
యద్భుతంబువోడమె నాత్మననిన
సకలలోకములును జరియించి నిను జూడ
వచ్చినాఁడ దైత్యవర బలీంద్ర. 39

క. మీవాకిట్లో గతియుని
యావనమాలియును హరుఁడు ననవరతంబున్
నీవాకిలియును నీసుతు
నావాసము గాచియుందు రట్టె మహాత్మా. 40

ఆ. అనిన బ్రహ్మమునికి నబ్బలిదైత్యేంద్రుఁ
డనియె గలియుగంబునందుఁ బుడమి
జనుల వర్తనంబు జనపాలచరితంబు
వినఁగ వలయు ననిన మునియుఁ బలికె. 41

ఆ. దానభోగశౌర్య ధైర్య ధర్మాచార
సాహసప్రతాప సత్యనీతి
బుద్ధి కపటగతులు భూలోకజనులకు
గలిగియుండు నెపుడు గలియుగమున. 42

వ. అట్లుగావున నేతద్వృత్తంబులు దెలుపు భూత భవిష్యద్వర్తమాన
కథలు కలవవి యథాక్రమంబున నెఱిగించెద. 43

ఉ. పాండుకుమారవిక్రముఁడు భాగవతప్రియకారియై భవా
ఖండలమూర్తి యర్థిజనకామిత దాయిసమస్తధారుణీ
మండలమెల్ల నేలె రఘుమానవనాథుని భంగిశూరతన్
దాంశమ చక్రవర్తి రిపుదుర్మద దానవ చక్రవర్తియై. ? 44

క. అతఁడొక్కనాఁడు మృగయా
రతుఁడై గహనమునసత్త్వరాసులవెంటన్
గుతుకమున దిరిగి పొంతటి
కుతలధరంబెత్త నుగ్ర కోలంబంతన్. 45

ఉ. అగ్రమునందు దోఁచిననృపాగ్రణికార్ముకమెక్కువెట్టియు
త్యుగ్రనిశాతబాణము మహోద్ధతినేసిన నవ్వరాహమా
నిగ్రహవిగ్రహంబునకు నిల్వకయాగ్రహవృత్తిఁబారి ని
ర్వ్యగ్రతనొంది నాక కుహరంబునడిగ్గియదృశ్యమాటయ్యెన్. 46

తోటకము :

ధరణీశ్వరుడాస్థలిద్రవ్వగన
క్కిరిరత్నమునంతనె గెలిగతిన్
హరియూపముదాల్చి నరాధిపతిన్
కరముద్భుతచిత్తుని జెప్పెదురన్. 47

క. ప్రత్యక్షంబై కేశవుఁ
డత్యాదరణమున బలికె నచ్యుతునీశుఁ
నిత్యుని నను గనుగొనుమా
యత్యుత్తమమైన ఫలములందెదవనిన౯. 48

వ. సర్వాంగాలింగితోర్వీతలంబగు దండప్రణామంబర్పించి యిట్లని
స్తుతియించె. 49

చామరము :

నమో గదాబ్జశంఖచక్రనవ్యబాహుపంకజా !
నమః కృపాకటాక్షలబ్ధనాకరాజ్యవైభవా !
నమస్సమస్తలోక పాలన ప్రశస్తమానసా !
నమో రమాధరాంగనాధి నాథ ! వేంకటేశ్వరా ! 50

క. అని వినుతించి రమేశ్వరు
ననుమతినచ్చోటఁగర్చురాకల్పునికే
తనసౌధసాలగోపుర
ఘనవిశ్రుతమంటపములుఁ గట్టించి తగ౯. 51

మత్తకోకిల :

మత్తకోకిలకీరనిస్వనమండితక్షితిజాలియున్
నృత్తగీతకళాప్రవీణవనేరుహాస్యటనేత్రలుఁ
హాత్తిసేవకయోనర్చుదాసులునాదియైనని యోగముఁ
చిత్తసంభవుతండ్రి కర్పణచేసె భక్తిదలిర్పగ౯. 52

ఆ. కటమనంగశాపకాష్ఠంబు వెంబన
దహనవామముయ్యెద్రవిడభాష
బాపకటము వెంబఘస్మంబు సేయుట
వేంకటాద్రియనఁగ వెలసెఁ బేరు. 53

చ. కటములు శేవురింపదెలిగన్నుల వాడుదయింపబాదసం
ఘటననలంగ గోరికలుగాంచెదమంచును దీర్ఘయాత్రకై
యిటునటులేఁగనేల నరులెట్టియఘాత్ముల కైన గల్గు వేం
కటమనుపేరు జిహ్వాతుదిగాపురముండినముక్తిసంపదల్. 54

వ. ఇవ్విధంబున వేంకటాధీశ్వరుండు తొండమ చక్రవర్తికి నభీష్ట
వరంబులొసంగుచు నతనిసేవగైకొనుచుండె నింక శ్రీశైల ప్రశం
సయు, విక్రమార్కాదిరాజచరిత్రంబులును వినుపించెదనని యిట్ల
నియె. 55

సీ. ప్రవహించు నేయద్రిపర్యంకమునఁ బాప
దళనోత్తరంగ పాతాళగంగ
వసియించు నేయద్రి వక్షోరుహాన్యస్త
బంధురప్రాలంబభ్రమరికాంబ
విహరించునేయద్రి వివిధపిశాచకం
ఠీరవుండగు బొబ్బభైరవుండు
చరియించు నేయద్రిజనులను గావంగ
వీరమూర్తి ప్రతాప విజయమూర్తి

తే. పర్వతాఖ్య ద్విజన్మతపః ప్రభావ
లబ్ధవరదానమస్త కాలయగిరీశ
పాదసంచార పావనప్రస్తరంబు
ప్రస్తుతింపగ దగదె శ్రీపర్వతంబు. 56

క. శిలలెల్లను లింగంబులు
పొలమెల్లను బరుసవేది భూరుహావల్లుల్
సెలయేరులెల్ల సురనది
లిల శ్రీగిరిమహిమదెలియ నెవ్వండెఱుఁగున్. 57

క. కాశిపురిలోన బ్రాణ
క్లేశము బొందింపవలగు కేదారజల
ప్రాశనము జేయవలవదు
శ్రీశైలముజూచినపుడె చేకురు ముక్తుల్. 58

క. తలయేరువట్టి శ్రీగిరి
తలయంపిగబడిన జనవితానంబులకున్
తలయేరు వాయదెప్పుడు
తలలేరినపేరు నొడల దడబడుచుండున్. 59

తే. అట్టిశ్రీగిరి చేరువన చలమొకటి
యాద్యమైయుండు చంద్రగుప్తాఖ్యమగుచు
నట్టిగిరియేలు చంద్రవంశాబ్ధి భవుడు.
చంద్రగుప్తుండునా నొక్కజనవరుండు. 60

మాలిని :
ఆనరనాయకు మోహపు బుత్రి సితాంబుజ లోచనచంద్రికనా
మానిని మాన సుగంధిసమంచిత మత్తకరిప్రతియాన కళా
నూనవిలాసిని చంపకనాస వినూత్నవిభూషణ నిత్యమును
ద్యానవనంబునకుంజని మల్లెలదండల నర్చనసేయు శివున్. 61

క. ఈగతి నాబాలామణి
శ్రీగిరిపై శివుని బూజసేయగ నంతన్
నాగవిభూషణు డయ్యెల
నాగకుఁ బ్రత్యక్షమయ్యె నగజాయుతుఁడై. 62

వ. అక్కామినికోరినయట్ల మల్లెవిరులం బూజించుటంజేశిమల్లికయను నభిధానంబునొసగి యాత్మనామంబు [1]మల్లికార్జునుండనియును ధరియించి తన్ను దర్శించినవారికి భోగమోక్షంబులు గృపసేయు చుండె. 63

1. మల్లికార్జునుండని ?

క. ఆరాజన్యుఁడు నొక్కఁడు
మారికయేకాని సుతుఁడు మతికల్గమిన
న్నారీరత్నంబునుఁగడు
గారవమున బెనుప గొంతకాలంబునకున్. 64

ఆ బ్రహ్మరాక్షసుండు బ్రాహ్మణపుత్రుని
బ్రహ్మచారిబలిమి బట్టి యచట
యారు నెలలదాఁక యాహార నిద్రల
నుడివి చదువుచెప్పి విడుచుటయును. 65

వ. అతం డచ్చంద్రగుప్తపురంబు చొచ్చి తత్పురోహిత బ్రాహ్మణ
మందిరముఖ శాలావేదిక పైఁబడి నిద్రాలసుండై యుండుసమ
యంబున. 66

క. భోజనసమయం బగుటయు
రాజపురోహితుఁడు భూసుర ప్రవరసుతున్
రాజిత రూపోత్కృష్టునిఁ
దేజోనిధిఁజూచి నిద్రదెలుపఁగ బంచెన్. 67

ఉ. నిద్దుర దేలి లేచి ధరణీసురపుత్రుడు నిత్యకృత్యముల్
తద్దయు జేసి భుక్తిగొని తత్సుతరాజికి నేర్చినట్టియా
విద్దెలు జెప్పుచున్ బయటి వేదికపై నుపవిష్టుడైనచో
ముద్దియ యొర్తువర్ణివరు మోహనరూపమునందు లగ్నయై. 68

క. తలవరి కూఁతుర నీకున్
వలచితి వరియింపు మనినవర్ణియు బలికెన్
లలనా! శూద్రాంగనవే
నిలాసుర బ్రహ్మచారి నెటుగాఁగూడున్. 69

ఉత్సాహ:
అనుచు ధిక్కరించుటయును నతివ మన్మథాగ్నిచే
గనలి తండ్రికెఱుఁగఁ జెప్ప కన్నకూఁతుమీఁద భ
క్తిని నృపాలు నెఱుఁగఁ జేయ క్షితివరుండు విప్రనం
దనుని జూచి యాత్మపుత్రిదానమిచ్చె వర్ణికిన్. 70

ఆ. మొదల విప్రతనయ పిదప భూపతి కూఁతు
పెండ్లియాడి వైశ్యప్రియతనూజఁ
గరముపట్టి శూద్రచరణంబు ద్రొక్కె భూ
సురతనూభవుండు వరుసతోడ. 71

వ. అంత.

ఉ. అల్లుని మల్లికారమణు నాత్మపురంబునకయ్య వంతికిన్
వల్లభుఁ జేసి శ్రీనగవనంబుననుండ దపోనిరూఢిన
య్యల్లుడు చంద్రగుప్తుఁడను నాహ్వయమున్ వహియించిభూతలం
బెల్లను నేలె నల్వురమృగేక్షణలుందను గొల్వనున్నతిన్. 72

వ. అంత నచ్చంద్రగుప్తుండు నలువురు భార్యలయందును విప్రకామి
నికి వరరుచి భట్టుండును, క్షత్రియసతికి విక్రమార్కుండును,
వైశ్యరమణికి భట్టియును,శూద్రాంగనకు భర్తృహరియును నను
కుమారులంబడసి, పూజ్యంబగు రాజ్యవిభవం బనుభవింపుచు
జరాభార పీడితుండై యొక్కనాఁడు. 73

క. తనయుల మంత్రుల ధరణీ
జనములరప్పించి శూద్రజలజాక్షికి ని
చ్చిన వరము జెప్పి యాసతి
తనయుని నాభర్తృహరిని ధరణిపుఁ జేసెఁ. 74

క. వివరియగు విక్రమార్కుని
యువరాజుం జేసి భట్టి నురుతరమంత్రి

ప్రవరుని జేయుచు వరరుచి
ధ్రువకుహితుఁడుగ బురోహితస్థితి నిలిపెన్. 75

తరల :
వరవరుండగు చంద్రగుప్తుడు నైధనంబును బొందన
వ్వరరుచిన్ వరణాశిబొమ్మన వాడునుంజన నంతనా
హరిధరాతల మేలుచుండగ నర్క నాముఁడురాజ్యమున్
మురువుసేయగభట్టి నిచ్చలు బుద్ధిచెప్పగనున్నతిన్. 76

క. ఆకాలంబున విప్రుడు
శ్రీకంఠునిగోరి తపముసేయగ హరుఁడ
స్తోక కృప జరామరణ
వ్యాకులములులేని ఫలము వరముగనీయన్. 77

ఆ. ఫలముగొనుచు నాత్మ భవనంబునకునేఁగ
భార్యజూచి యాత్మభర్తకనియె
సంపదదుగకిట్లు జరయుజావునులేని
ఫలము వరముగాఁగబడయదగునె. 78

క. ధనముగలవాఁడె పుణ్యుఁడు
ధనమేసౌభాగ్యకరము ధర్మస్థితికిఁ
ధనమేమూలము గావున
ధనహీనుఁడె మృతుఁడు ప్రాణతనుఁడై యున్నన్. 79

ఆ. పసిఁడిగలుగువాని పలుకు లుపలుకులు
పసిఁడిగలుగువాని బలిమిబలిమి
పసిఁడిగలుగువాని బలగంబుబలగంబు
పసిఁడిలేని గుణియు పాపియతఁడు. 80

క. అనిపతిదిట్టటయును దాఁ
దివనొల్లక భర్తృహరికి దెచ్చిచ్చిన న

జ్జనపతి ఫలము మహత్త్వము
విని మోహావృదేవికిచ్చె వెలఁదియుదానిన్. 81

ఆ. కోరికలరనిచ్చె గుఱ్ఱాలకాపరి
కతడు లద్దిదుడుచు నతివకిచ్చె
గొల్లకిచ్చెనదియు గొల్లయునున్ బేడ
మోసికుప్ప వేయుదాసికిచ్చె, 82

వ అదియును శూర్పపూరితంబైన గోమయంబుపై నిడుకొని తెచ్చు
సమయంబున. 83

తే. భర్తృహారివెంటవోయి యూవనమునందు
నరుగుదెంచుచునగ్గోమయంబుమీఁది
విప్రవరలబ్ధమైన యుర్వీజఫలము
గాంచి యద్దాసి నడిగి తత్క్రమము దెలిసి. 84

క. సరసిజనేత్రల శీలము
నరనాథులకృప యుగ్రూరనాగంబుల త
త్పరతయు మిథ్యావచనుల
వరములు దలపంగ నీటివ్రాతలుగావే. 85

వ. అదియునుంగాక. 86

క. మాయయునసత్య వాక్యము
గాయకమును ? కోపగుణముక్రౌర్యముశీలా
పాయముమూర్ఖత్వంబును
తోయజదళలోచనలకు దోడజనించుఁ. 87

ఉ. ఒక్కనిఁజూచు వేఱొకనినొల్లకమాటుమొగంబు పెట్టు నొం
డొక్కనిగాసచూపు మఱియొక్కనితోరమియించు వేడ్కతో
నొక్కని గౌఁగిలించు తలపొక్కనిపై నిడి కాల్మిడాలు నే
డిక్కనబట్టిచూడ సుదతీజనవర్గమునమ్మవచ్చునే. 88

వ. అని విచారించిస్వకీయ భార్యలైన త్రిశతసంఖ్యాకామినీ జనంబుల
విడిచియాత్మాగ్రజుండైన విక్రమార్కు నింబట్టంబుగట్టి భట్టిఁ
దొల్లిటియట్ల యమాత్యకృత్యంబునకుం బ్రతిష్ఠించి రాజయోగియై
యరుగుచున్న నతనిభార్యాశతత్రయంబునుజనుదెంచి యిట్లనిరి. 89

ఆ. ఏమిసేయువారమిటువలెనుముడించి
నీవుచనినపిదప నృపవరేణ్య
యనినగదుటనూలు నాకులు తాడిని
గలిగియుండునట్టికాలములును. 90

వ. విధవాత్వంబులేకుండునట్లుగ వరంబిచ్చితి బొండనిచనియె నాట
నుండియు శూద్రకులంబుగొందఱు మున్నూరనంబడి రంత. 91

స్వాగతము :
విక్రమార్కుఁడుర విక్రమమొప్పన్
శక్రులీలబురసంహరుమాడ్కిన్
చక్రిభంగిబరచక్రాధిపులన్ ?
విక్రమించి పృథివీతలమేలన్. 92

వ. అతండొక్కనాఁడు మృగయార్థంబడవికరిగి. 93

సీ. గహ్వరద్వత్సమారంహ సాహసభీమ
సింహపోతంబుల చెండి చెండి
అద్రిసన్నిభశరీరోద్రేకమదఘూర్ణ
భద్రసింధురములఁబట్టి పట్టి
దుర్దమాభీలవిధుంతు దోర్భటవక్త్ర
శార్దూలములవీఁపు చరచిచరచి
కోలాహలాభీలకాలాభ్ర సన్నాహ
కోలసమూహంబుఁ గొట్టికొట్టి

తే. శరభభల్లూకవృకముఖసత్త్వచయము
చండభుజశక్తినిలఁబెట్టి చమరిచమరి
భయదగహనాంతరంబునఁ బరచిపరచి
విక్రమార్కుఁడు కడిమిమై వేఁటలాడె. 94

వ. అంత. 95

క. కనుమరి లోహపుఁబిండం
బనలములోఁ దిగిచినీఁట నార్చినభంగిన్
దిననాథుఁ డస్తమించిన
వనరుహములనెగయు నళిరవంబు చెలఁగన్. 96

ఉ. చల్లనిగాడ్పుతో జలదసంఘము చీఁకటిగూడి భూతలం
బెల్లను నాక్రమించుటయు నీఱుపుద్రోవలు వాగువంతలున్
పల్లములిట్టునుం దలియఁజాలముగాక స్వకీయసైన్యముల్
వెల్లిసివిచ్చిపోరుటయు విక్రమసూర్యుఁడు ద్రోవదప్పినన్. 97

క. కోలమెఱుఁగప్పటికిదివె
కోలగనాసాహసాంకకు వలయపతియున్
గాలువడ నరుగుచును మహా
కాళీసదనంబుఁజొచ్చెఁ గడువేగమునన్. 98

పాదపము :

కాళికి దండుగఁగట్టినరారా
త్మేలశరీరము సీతమడంపన్ ?
కాలోకటంబికకాయము మీఁదన్
బోలగజాపుచు భూస్థలిద్రెళ్ళెన్. 99

తోటకం :

పరమేశ్వరి నిర్భయునానృపునిన్
పరికించి మహాభయ దాకృతియై

కరశూలము భీకరమై మెఱయన్
నరపాలుని ముందట నార్పులతోఁ. 100

క. ఇచ్చటికి వెఱవ కిటు డా
వచ్చితినా యెదుర బ్రతుకవచ్చునె నీకున్
జచ్చితివి లెమ్ము లెమ్మన
నచ్చండికబలికె నట్టహాసముతోడన్. 101

చ. వెఱపొకయింత లేదు గుడిజొచ్చియు నాకిరవిచ్చి వర్షముల్
వఱపినగాని పోవనన వానిసముద్ధతిచూచి యిట్లనున్
గొఱతలుగాచితిన్ వరముగోరు ఘటించెదనన్న నీకున
కక్కఱగలదేని నన్నడుగు కైకొనఁ గామిను లిచ్చుకోరికల్. 102

తే. అనినఁగానిమ్ము వరమిత్తున నెదవేని
చక్కబలికించుమని ఫాలచర్మమెత్తి
యజుఁడు వ్రాసిన లిపి పెంపుమట్లుగాక
యధికమైనను వ్రాయు నీవనినఁబలికె. 103

ఆ. బ్రహ్మ వ్రాయు నక్షరంబులు దుడువంగ
వ్రాయనైన నొరుల వశముగాదు
యీశుచేత వరము లిప్పింతురమ్మని
రాజుఁ దోడుకొనుచు రమణి యరిగె. 104

ఉ. కాళికవెంటనేఁగి కుతుకంబున భూపతిగాంచెనమ్మహా
కాళునిఁ బార్వతీకుచ సుగంధపటీర మనోజ్ఞవాసనా
లోలుని సింధురాసుర విలుంఠన నిష్ఠుర బాహువిక్రమా
భీలుని పంచ...............చండశాసనున్. 105

తే. అమ్మహాకాళునకు విక్రమార్కనృపతి
దండమొనరింప కాళి భూధవునిఁజూపి
ఉగ్ర! నాచేతి వరమితం డొల్లననియె
నీవువరమిచ్చి నన్నుమన్నింపుమనిన. 106

కవిరాజవిరాజితము :

అడుగర యేవరమైనను నిచ్చెద నర్కనృపాలక యున్నతం
డడిగె దయాకరభట్టికి నాకసహస్ర సమంబులు తేజమునన్
బుడమిభరింపగ నిమ్మని వేడిన భూతగణేశ్వరుఁ డిచ్చి చనెన్
గడుముదమొంది పురంబునకుం జనకల్యముఖంబు దయంబగుడున్ 107

క. భట్టిఁబిలిపించి రాత్రిటి
కట్టడి వినిపించనతఁడు కడువేడుకతో
నెట్టన వేవత్సరములు
గట్టిగనిచ్చితి నటంచుఁగరుణన్ బల్కెన్. 108

వ. పలికి యాక్రమంబుననే యుపాయంబూహించి సంవత్సరంబున
పూర్వార్థంబున రాజ్యంబును అపరార్థంబున వనవాసంబునుగా
నియమించుకొని రాజ్యంబుసేయుచుండ నొక్కనాఁడు. 109

క. ఒక్కదిగంబర మునినృపు
చక్కటి కడదెంచి సాహసప్రియయిటనే?
నొక్కక్రతు వాచరించెద
నక్కడికే తెమ్ము మత్సహాయత కొఱకున్. 110

చ. అనవుడు నట్లకాకయని యమ్మునివెంటను విక్రమార్క భూ
జనపతి యేఁగి యాతఁడు పిశాచమఖక్రియ నాచరింపుచున్
దనుజునిబట్టి దెమ్మన ప్రతాప భయంకరుఁ డట్లసేయ, న
మ్మనుజ భుజుండు మెచ్చిరిపు మర్దన విక్రముజూచి యిట్లనున్. 111

క. భూతలనాయక! వినునే
భేతాళుఁడనీకు నిష్టభృత్యుఁడనైనే
చేతరిదలఁచిన వచ్చెదఁ
జేతోగతినను చు నష్టసిద్ధులనిచ్చెన్. 112

వ. అవియేయ్యవి యనిన. 113

సీ. తనువు జరారోగతతిఁబీడ బొందక
కాంతిఁబొందించుట కాయసిద్ధి
అభివాంఛితార్థంబులనుకూలగతి బరి
స్పష్టంబు సేయుట భీష్టసిద్ధి
ఆడినమాట సత్యాచారసంశీల
వర్తనంబొందుట వాక్యసిద్ధి
ఉచ్చరించిన మాత్రమెచ్చి మంత్రస్ఫూర్తి
మహిమలొసంగుట మంత్రసిద్ధి
తే. రాజ్యమప్రతి గ్రహమాట రాజ్యసిద్ధి
మోహకోపంబు లుడుగుట మోక్షసిద్ధి
విక్రమోద్దామ భుజశక్తి విజయసిద్ధి
అంతరంగ ప్రమోదంబు స్వాంతసిద్ధి. 114

వ. అనిపలికి భేతాళుండడుగఁద లంచిన దిగంబర మునిప్రయోజనంబు
తీర్చిపొమ్మని తెచ్చి యమ్మునికొప్పించిన. 115

క. ముని విక్రమార్కు గనుగొని
యనియెన్నా కష్టసిద్ధులందెడి కోఱికున్
బనిచితినవివృథయయ్యెను
జనుమనినన్ సాహసాంక జనపతియనియెన్. 116

క. యతివర ! భేతాళునిచే
బ్రతిగ్రహమైనన యష్టభవ్యంబులు ని
చ్చితి నమునిని దీవించెను
క్షితిపతియును నరిగె నరిగె గిన్నరవరుఁడున్., 117

వ. కావున. 118

క. ఉపకారము నుద్యోగము
నపవాదము బాయుటయును నాశ్రితుల యెడన్
గృపఁదలచుటయును దానము
నుపమింపగరాని జనుల కుత్తమగుణముల్. 119

వ. అనవుండు. 120

మ. బలిదైతేయుఁడు నారదుంబలికె భూభాగంబునన్ విక్రమా
ర్కులసత్కీర్తులు ప్రస్తుతింతురుబుధుల్ రూపింపగా నట్టివా
రలకీర్తుల్ వినుపింపవేయన నుదారస్ఫారకీర్తిచ్ఛటా
చలితాశాశుఁడు దాని వానిగుణముల్ వర్ణింపగాశక్యమే. 121

క. వెయిమాడ లిచ్చుజూచిన
అయితంబవియిచ్చు బలుకహాసితుండై ల
క్షయొసంగు విక్రమార్కుఁడు
దయమెచ్చినకోటి యిచ్చుదగనర్థులకున్. 122

ప. అని వినిపించి మఱియు నిట్లనియె. 123

క. ఊహింప విక్రమార్కుని
సాహసము నుదారగుణము చర్చింపంగా
నాహరునకైనవశమే
బాహాబలుఁడతని వినుము బలిదైత్యేంద్రా ! 124

ఆ. సాహసాంకుఁడిట్లు జగతివృత్తాంతంబు
లరయుబంప బోయినట్టి జనము
లరసివచ్చిచెప్పి రాశ్చర్యమొకటి
చిత్రకూటనగ విచిత్రమహిమ. 125

ఉ. చెప్పినవిక్రమార్కనృపశేఖరుఁ డగ్గిరి చూచువేడ్క దా
నప్పుడయేగి యందుల శివాలయునైకట భూమియందు బా
రప్పలు పాపకర్మతనువంటిన కాటుకవర్ణ మాటయున్
జొప్పగ పుణ్యునిం దనువు సోఁకినదుగ్ధము తొటచూచుచున్. 126

క. ఆతటమున నొకవిప్రుఁడు
శీతసుఫలహోమమొకటి చేయుచునుండెన్
భూతలనాథుఁడడగ్గరి
యాతని నీవేల ప్రేల్చెదని యడుగుటయున్. 127

వ. ఆతండిట్లనియె. 128

క. శతహోయనంబు లయ్యెను
క్షితివర యీరీతి ప్రేల్చి సేయుదుదుర్గా
ప్రతిష్ఠ యుండుట పర్వత
సుతయును ననుచాలుననక చూచుచునుండెన్. 129

ఆ. అనిననతని నడుగుమని యొక్కమాలూర
ఫలము తేనెఁ దోఁచి పవనసఖుని
యందు ప్రేల్చుటయును నంబిక మెచ్చక
యున్న తేజఖడ్గ ? మొకటియెత్తి[1]. 130

చ. తనతల ద్రెంచి ప్రేల్తునని తత్పరతన్ ఝళిపించు సాహసుం
గనుగొని దుర్గ హస్తమున కత్తికరంబు గ్రహించివల్దువ
ల్దనిన మహీసురోత్తము ప్రయాసము వ్యర్థముగాకయుండగో
రినవరమిమ్ము శీతలగిరి ప్రభుపుత్రిక ! యన్ననిట్లనున్. 131

తే. చిత్తశుద్ధిలేక చేసిన జపమును
తపము హోమవిధియు దానములును
దేవతార్చనములు భావింప నిష్ఫల
మట్లు గాన వలయు నాత్మశుద్ధి. 132

వ. కావున విప్రుండు శ్రద్ధాహీనుండు వీనికి నేలఫలించు నిన్ను మెచ్చితి
వరమిచ్చెద నడుగుమనిన విప్రుండుగోరిన వరంబిప్పించి యుజ్జ
యని పురంబున కరిగెనట్లు గావున. 133

1. తేతిఖడ్గ మొకటియెత్తి.

క. సాహసదానంబులలో
సాహసమే లెస్స యవని జనపాలురకుఁ
సాహసుఁడు విక్రమార్కుఁడు
సాహసమునఁగాదె సాహసాంకుండయ్యెన్. 184

వ. అనిమతియు నిట్లనియె. 185

సీ. ఉజ్జని నేలుచు నొక్కనాఁడు విక్ర
మార్కుఁడ ధ్వరము సేయంగ దలఁచి
యంభోధి నోడి తెమ్మని విప్రుబనిచిన
జని మహీదేవుండు వనధిబిలువ
పాథోధివిభుడు భూపతికి నిమ్మని తెచ్చి
మణిచతుష్టయము బ్రాహ్మణునకిచ్చి
వేర్వేఱనారత్న విధములు వివరించి
యనిపిన భూసురుం డరుగుదెంచి

తే. జలధియిచ్చిన యారత్నములును నాల్గు
విభుని ముందటనిడి వాని విధము చెప్ప
నడుగు మీకిత్తు నొకరత్న మనినద్విజుడు
పుడమినాయక మావారి నడిగివత్తు. 186

ఆ. అనుచునింటికరిగి యాలిని గొడుకును
గోడలికిని వానిగుణములెల్ల
ధనము రాజ్యములును గనక భూషణములు
నాయువును ఘటించు ననివచించి. 187

వ. ఇందులోనే రత్నం బడుగుదమనిన నిట్లనిరి. 188

క. ధనమడిగెబత్ని, కోడలు
కనకాభరణంబులడిగె, ఘనరాజ్యశ్రీ
తనయుండడిగెను, నాయువు
ననుఁగను వలెననుచు ద్విజుఁడు తలఁచిన నీతియో. 189

ఆ. నాల్గుమణుల నిట్టునల్వుర నాసించి
జగడమడచి సాహసాంకునకును
నెఱుఁగఁజెప్పిమగుడ నిచ్చిననవ్వుచు
బుచ్చుకొనక నాల్గునిచ్చి యనిపె. 140

క. తలఁప నుదారగుణంబులు
కలపురుషుఁడు ధనము తృణముగా దలఁపోయున్
ఫలియించిన మణులీఁడే
యలయకవిప్రునకు సాహసాంకుఁడు గరుణన్. 141

క. వేలుపులు వరములిత్తురు
లోలాక్షులు తమకు దార లోనగుదురమి
త్రాలిభయమందు విజయ
శ్రీలబ్బు నుదారగుణముచే మనుజులకున్. 142

వ. అనిమునీంద్రుఁడు బలీంద్రునకిట్లనియె. 143

క. పురుషార్థ మెఱుఁగవలయున్
బురుషుండది యెఱుఁగకున్న పుణ్యము దలఁగున్
పురుషార్థ మెఱుఁగనేర్చిన
పురుషుండమరులకునైన పూజ్యుఁడు కాఁడే. 144

వ. అదియెట్లనినం దొల్లి యుజ్జయినీ పురంబున గమలాకరుండను
విప్రుండు గుణవతియను భార్యయు దానును శనిత్రయోదశి
వ్రతపరాయణుఁడై ఖండ పరశువలన దేవదత్తుండను కుమారుని
వరంబుగాబడసి యతని గృహస్థుజేసి దంపతులిరువురు గాశీయాత్ర
యఱిగిన నంతనొక్కనాఁడు. 145

ఉ. విక్రమసూర్యుఁ డొక్కరుఁడు వేఁటగనేఁగి వనాంతచారణో
పక్రమభంగి నొచ్చియు పిపాసల గ్రుస్సియుదొట్రు పాటుఘా

దక్రమమంటగాఁ దెరువుదప్పు సమిత్తులు గొంచువచ్చువే
దక్రమశాలియంబువులు ధాత్రిఫలంబులు నీయదృప్తుఁడై. 146

చ. పురముపథంబుచూప జని భూసురకోటికి దానమిచ్చుచో
హరవరదత్తుఁ డాద్విజసహాయత రాజగృహంబులోనికిన్
వెరవున నేఁగి యర్కపృథ్వీపతి పుత్రునిరత్నహాటకా
భరణునిబట్టి కొంచుజని బాలకునిన్వెసదాఁచి యంతటన్. 147

క. తనయుఁడు దొడిగినమణిమయ
కనకాభరణంబులమ్మఁగాంచి తలారుల్
తనయుద్రోహుండీతం
డనివిప్రునిఁగట్టి దుఃఖయుగున్నృపునెదురన్. 148

క. నిలుపుటయు విక్రమార్కుఁడు
తల......విప్రుగాఁచి తనుగారడవిన్
మెలఁగ గని తెరువుచూపుట
తలఁచి ద్విజన్ విడువుమని యొఁదలవరి తోడన్. 149

క. ప్రాణంబుఁగల్గెనేనియు
(రాణులు) పుత్రులుధనంబు రాజ్యముగలుగున్
ప్రాణమెబంధువులోక
ప్రాణులకయి గావవలయు బ్రాణానిలముల్. 150

ఆ. అనుచు విప్రునకును (నధికధనంబిచ్చి)
యనిపె నపుడు విక్రమార్కనృపతి
చిన్నమంత మేలుచేసిన సుజనుఁడు
చెప్పరాని మేలు సేయకున్నె. 151

క. కృతమెఱుగ(కున్న)దైవము
కతఘ్నునకు నిహాముపరము నేలాకలుగున్
కృతమెఱిఁగి పుత్రహాఖుడగు
నతనిన్విడిపించె విక్రమార్కుఁడు...... 152

వ. అప్పుడు. 153

ఆ. ధరణిసురుఁడుదానుదాఁచిన నృపపుత్రు
దెచ్చియిడిన శౌర్యదినకరుండు
బ్రాహ్మణుండ విట్టిపనియేలఁ జేసితి
వనిన నీదుభావమరయననియె. 154

వ. అని చెప్పి నారద మునీశ్వరుండు బ్రహ్మరనిట్లనియె. 155

క. క్షితినాథునాజ్ఞయెవ్వం
డతిక్రమింపక చరించునాతఁడు ధరణీ
(పతిచే)బూజితుఁడగునా
గతిదప్పిననృపతిచేత గష్టతనొందుౕ. 156

వ. అది యెట్లనిన. 157

సీ. రత్నాకరా మందలి రత్నపేటికయను
పురమునఁనొక వైశ్యపుంగవుండు
మాధవుఁడనువాఁడు మాణిక్యమొక్కటి
గొనితెచ్చి విక్రమార్కునికిఁ జూపి
దీనికి వెలకోటి దీనారతతియని
చెప్పి వెండియును విచిత్రమణులు
పదియున్నవింటను పరిజనంబులఁ బంపు
కొనివచ్చుననిన నజ్జనవిభుండు

తే. సహచరునిబంప నామణిచయముగొనుచు
వచ్చుచోద్రోవనొక యేరు వారుచుండ
దాటనేరక యైదురత్నంబులొక్క
యాతశాసికి నిచ్చి వాఁడేరుదాఁటె. 158

వ. అద్దూతజనుండు కడమయైదురత్నంబులుదెచ్చి రాజునకు సమ
ర్పించి తావెచ్చపెట్టిన పంచరత్నంబుల విధంబెఱిఁగింప.... 159

క. ఆజ్ఞాభంగముచేసిన
నాజ్ఞాపింపుదురు రాజులధికులనైనన్
ప్రాజ్ఞులగువారి కవని ప
రాజ్ఞాభంగంబుసేయుట రుహంబగునే. 160

వ. అనవుండు. 161

క. (శు)నమునవచ్చెదననితా
జనినాయాజ్ఞకును వెఱచి చనుదెంచెను వీఁ
డని పంచరత్నములు (పరి)
జనునకుగృపజేసి వైశ్యజనునకునంతన్. 162

ఆ. పదునొకండుఁ గోట్లుపసిడి టంకంబులు
మణుల విలువచేసి మనుజవిభుఁడు
నూరుభవునకిచ్చె నున్నతసత్కీర్తి
సాహసాంకునకును సాటి గలరె. 163

వ. మఱియునిట్లనియె, 164

క. పరుల మనస్తాపంబే
పురుషుండణఁగించు ప్రాణములనిచ్చైనన్ ?
ధరనట్టిమనుజునకు నిహ
పరసౌఖ్యములబ్బుననుచుఁ బల్కుదురార్యుల్. 165

వ. అది యెట్లనిన. 166

సీ. ధనపాలుఁడనువైశ్య తనయుండు కాశ్మీర
జగతిగట్టించెఁ గాసారమొకటి
నదియెల్ల కాలంబు నంబుహీనంబైన
జింతింప నాకాశసీమ పలికె

నిది లక్షణములు ముప్పదిమూఁడు కలుగుభూ
(వరుని) రక్తంబున బలియొనర్చి
ననుగాని యుదకపూర్ణంబుగా దనవిని
యది సేయలేక వాఁడలమటింప
తే. చారు తెలుఁగింపవిని (సాహసాంకనృపతి)
సరసిచూడంగ నేఁగి యచ్ఛందమెఱిఁగి
కంఠరక్తంబు బలియీయ ఖడ్గమెత్త
శక్తి ప్రత్యక్షమై యందు జలము నించె. 167

క. అవ్విధము విక్రమార్కుం
డవ్వైశ్యుం డెఱుఁగకుండ నరిగె బురికిని
ట్టైవ్వండుపకృతిచేసియు
నవ్విధమెఱిఁగింపకుంట యార్యగుణంబుల్. 168

వ. అని చెప్పి విరోచనపుత్రునకు బ్రహ్మపుత్రుండిట్లనియె. 169

క. ఏ వెరవులేని మనుజుని
దైవము రక్షింపనొక్కదాతం జూపుఁ
దేవత విక్రమసూర్యుని
భూవిభునిని నడుగుమనదె పురమేలింపన్. 170

వ. అదియెట్లనిన. 171

సీ. మధుమాసమున విక్రమప్రభాకరుఁడంగ
నాయుక్తుఁడగుచు వనంబునందు
క్రీడింపనొక్కదరిద్ర విప్రుఁడువచ్చి
యనియెభూపతిజూచి యవనినాథ
చండికంగోరి నేకతవత్సరములు త
పంబు సేయంగ నయ్యంబరాత్రి
వచ్చి విక్రమసూర్య వలననీకోరిక
ఫలియించు ననిచెప్పి చనియె నన్న

ఆ. యట్లుగాన చండికాఖ్యపురంబుగా
వించి నన్నునందు విభునిజేసి
రాజచిహ్నలిచ్చిరక్షింపుమనవుండు
నట్లచేసి వాని నందునిలిపె. 172

వ. అని మఱియునిట్లనియు, 173

క. పరులకునైన నుపద్రవ
మరసి మహామతులు దమదు ప్రాణంబైనన్
కరమొసగి చక్కజేతురు
పరికింగపనిదియు నిహముఁ బరమునుఁగాదె. 174

వ. అదియెట్లనిన. 175

సీ. ఉజ్జనిపురమునవొక్క వైశ్యుఁడు ధన
దత్తనాముఁడు దానధర్మపరుఁడు
వివిధదేశద్వీప వీక్షణాసక్తుఁడై
పోవువాఁడొక మహాపురముగాంచి
యాపురిచేరువ నడవిలోభైరవు
గుడిగాంచి భక్తినక్కశికి నరిగి
భైరవుముందటఁ బడియున్న తలలు గ
బంధంబులును జూచిభయముబొంది

ఆ. మగుడివచ్చి విక్రమార్కునకును జెప్ప
సాహసాంకుడధిక సాహసమున
నచటికేగి భైరవాకృతి వీక్షించి
మను జనాధుడిట్టులని నుతించె. 176

మంగళమహాశ్రీ :-
బాహాదండవ్యూహాసమంచ ద్బహు విధచలదళి భవరుచిచెలఁగఁ
వ్యూహాపోహప్రాప్తసురస్త్రీయుతనవకలకలహాలంకృతులమరన్

ద్రోహిత్రిశేణిదుర్మదవిద్ధుఁ దురమున బటుదోర్బలమున సం
వాహంబొప్పందోలుదు లీలఁ బ్రణతులుమెలపులు భైరవవరదా! 177

వ. అని స్తుతియించి కబంధ శిరంబులదుకం జేయుమని ప్రార్థించిన నూరకున్న శాతాసినాత్మశిరంబు త్తరింపందలంచిన నద్దేవుండు ప్రత్యక్షంబై. 178

క. నరులకబంధంబులతో
శిరములుదగనంటికొనగజేసెను శివుఁడుఁ
వరము వెసంగాంచి తనపురి
కరుదెంచెను విక్రమార్కుఁడనుపమశక్తిఁ. 179

వ. ఇంకనొక్కటి వినుముని యిట్లనియె

క. ధరణీసురు కోర్కెదీర్చుట
పరమోదారులకునెల్ల భావ్యంబు సుమీ
నరభుజుని దునిమి ద్విజునకు
సరసిజముఖిఁ డెసాహసాంకుఁడుగడివిఁ. 180

వ. అదియెట్లనిన. 181

సీ. ఉజ్జయనీపురినొక్క విప్రుఁడు కమ
లాలయుఁడనువాఁడు లలితమూర్తి
క్షితిచూడనేఁగి కాంచీపురంబున నొక్క
నరమోహిననియెడునలిన ముఖని
వేశ్యవాటికలోనవీక్షించి రతిగోరి
యడిగిన దనవంక కసురయొకఁడు
వచ్చి యెవ్వరినైన వధియించుననవిని
చనుదెంచి విక్రమార్కునకుజెప్ప

తే. భూమిసురుఁగొంచు నచటికిఁబోయి యతివ
రొద్దనారాత్రి వసియుంపనుదరి యసుర
వచ్చుటయువాని వధియించి వారసతిని
భూసురునకిచ్చి చనుదెంచె బురమునకును. 182

వ. అనియుపన్యసించి వెండియు దచ్చరిత్రంబు వినుమని నారదుం
డిట్లనియె. 183

ఆ. తపముచేసియైన జపములచేసైన
పొందు ఫలముచేత భూమిజనుల
మరణరోగజరల మాన్పనుత్తములకు
నిందునందు సుఖములందగలుగు. 184

వ. అది యెట్లనిన. 185

సీ. ఉజ్జయినీపురికొక దిగంబరముని
యరుగుదెంచిన విక్రమార్కనృపతి
పిలువబంచుటయు నిస్పృహుఁడగు నమ్ముని
రాకున్న దాఁబోయి యాకపర్ది
గనుగొని మ్రొక్కి తత్కాయసిద్ధికి మెచ్చి
యతని యాయుర్భావ మడుగుటయును
యోగికిందేరు నాయుష్యంబువలసిన
జచ్చునొల్లకయున్న జావడనుచు

ఆ. నొక్కసిద్ధమంత్రముపదేశమిచ్చిన
నడవికరిగి దానచట వేల్ప
భవుడుమెచ్చిమొక్క ఫలమిచ్చియిది తిను
మరణరుజలు నీకు మానుననుచు. 186

వ. ఉపదేశించి శివుండనిపినం బురంబునకరుగునప్పుడు. 187

క. కాయంబు కుష్ఠరోగా
పాయంబున ముచ్చిముచ్చి పడుచును విప్రుం
డాయధిపతికెదురైనను[1]
నాయనకదియిచ్చి విక్రమార్కుండనియెన్. 188

క. ఫలమారగింపునీకుం
గలరోగములెల్లనుడిగి కాయంబు మహో
జ్వలమగుచునిలుచు ననవుడు
ఫలభుక్తిని ద్విజుఁడు రోగబాధలఁ బాసెన్. 189

వ. ఇంక నొక్కకథవినుమని యిట్లనియె. 190

ఆ. మ్లేచ్ఛమనుజుఁడైన మెచ్చిన ఫలమిచ్చు
టేమియరుదు దలపనెంచిచూడ
సాహసాంకు మెచ్చు జను భోజ ద్వాదశ
గ్రామభూమిసురలగాఁచెగాదె. 191

వ. అది యెట్లనిన. 192

క. వనవాస మూఁడు నెలలును
జనపాలన మూఁడు నెలలు జరుపుట తనకుం
బనియైన విక్రమార్కుఁడు
చనియెన్ వనమునకు దగ్రసాహస వృత్తిన్. 193

తరువోజ :—

ఆరీతిజని విక్రమార్కుఁడు భీక
రాటవీస్థలినొక్కయవనీరుహాంబు
చేరియుండంగ దచ్ఛిఖరాగ్రమున
గూళ్లుజేసి సుఖించు పక్షిపుంజంబు ?

1. డోయయ్యె నాకునిమ్మన

ఊరులు దిరుగుచో నొక్కచోనురుల
గానొడ్డిన బడి యాయురులుద్రెంచి
కారుణ్యమున దమ్ముగాఁచిన ద్విజుని
రక్కసుండు భక్షముచేయుకట్ట యనుచు[1]. 194

వ. తమదుఃఖంబు జెప్పు పలుకులు విని విక్రమార్కుఁ డవ్విప్రుం జంపు రక్కసుకడకుంజని యెదురనిలిచి యేతదగ్రహార బాడబుని వరుసకై వచ్చితి భక్షింపుమనిన మెచ్చియతండిట్లనియె. 195

క. వరమడుగుమనిన ద్వాదశ
వరభూసురవరుల భుక్తివలదని యడుగన్
వరదుడయిగాచె విప్రుల
నరపతియును సరిగె నాత్మనగరంబునకున్. 196

వ. ఇంకనొక్కటివచించెదనని యప్పురమభాగవతుండిట్లనియె. 197

క. మగతనముగలుగు పురుషుఁడు
మగువలుఁగుయ్యిడిన నరసిమాన్పగవలదా
జగతి నొకవిప్రసతికై
తెగిచంపడె దనుజుశౌర్య దినకరుఁడాజిన్. 198

వ. అదియెట్లనిన. 199

సీ. ఉజ్జయినీపురి నూరుజుఁడొక్కఁడు
మణిభద్రుఁడనెడు నామంబువాఁడు
నిర్ధనుండై పడి నిలువంగనేరక
పరదేశములవెంటఁ దిరిగి తిరిగి
మధురాపురీ బహిర్మ్యాలూరవనమున
దైత్యుచేబడి యొక్కతరుణికూయ
వినివచ్చి విక్రమార్కునకు జెప్పిన విని
వానితోఁగూడ నవ్వనముజొచ్చి

1. 194వ పద్యము సరిగాలేదు. ఉన్నదియున్నట్లుగానే ప్రకటించితిమి.

తే. రాత్రియగుటయు నొక ఘోరరాక్షసుండు
బాధపెట్టంగ నొకసతి బాతరింప
వానివధియించి యవ్విప్రవనితగావ
నతివ యిట్లని సాహసాంకుతోడ. 200

క. పతినేమొరంగి యిటులుప
పతులన్ భోగింపనాకు పతియలిగిట్లీ
దితిజునిచే బడుమనుచును
పతినన్ను శపింపనిట్టి పాటులువచ్చెన్. 201

క. పరపురుషుల నాశించిన
తరుణులకునునిందవచ్చు ధర్మముదప్పున్
విరసమున ను భయకులజులు
పరిహరణముచేతురంత పాపము(తగులున్). 202

వ. అట్లుగావున రాక్షసబాధమాన్పి నన్నురక్షించితివి గావున తన్ని క్షిప్తధనంబుగ్రైకొనుమని చూపిన నదితన వెంటవచ్చు వైశ్యున కిచ్చి పురంబునకరిగె, నిదియుంగాకొక్క విచిత్రంబు వినుమని యిట్లనియె. 203

క. ధనహీనుని బోషించుట
ఘనులకు నదిసైజగుణముకామాంధుని ని
ర్ధనుని ధనమిచ్చిమనుపడె
యనుపమసత్కీర్తి సాహసాంకుఁడు గడిమిన్. 204

వ. అదియెట్లనిన. 205

సీ. వనవాసమనుపేరజని విక్రమార్కుఁడు
దీపించుచంద్రవతీపురమున
వీటదరిద్రుండు విప్రుండు ధనములే
దని దుఃఖమునుబొఁద విని మహేశు

డట యింద్రకీలాద్రి నష్టభైరవులకు
నష్టాంగరక్తంబు ? తర్పణం......
......................
.........................

ఆ. నచటికరిగి చెప్పినటువలెనే చేసి
మెచ్చి దేవియిచ్చు మేటిధన...
...........................
......గెబురికి సాహసాంకనృపతి. 206

వ. మఱియునొక్క వినోదంబువినుము 207

క. దైవిక మానుషములలో
దైవికమేయధిక మంద్రుతజ్ఞులు వినుమా
దైవికమె...............
.......................... 208

సీ. దేశంబు చూడ నాదిత్యనాముండొగి
యొక్కకారడవిలో నున్ననొక్క
యవధూత
యీరంపు పడవులని పెలతిరిగెడ
నన్నదైవిక మిట్టులడదిరుగ
దైవికమునగా............
.....................
.......................

తే. ...వినుపింతుననుచునయ్యతికి ననిరె
రాజ్యమును బాసిద్రవిడ భూరాజ్యవిభుఁడు
పత్నియు.....................
[illegible]......... 209

క. వృషమునసున్నయేవురు
యక్షులుదమలోన మాటల......
..................
......యారాజ్యంబుగలుగునది యెట్లనినన్. 210

సీ. ఈతడువోయిన యీనాకపు...
దగిలించుకొనిపోయి తత్పురమున
సామంతులొకొ క ర్తమ సామజంబునకొక్క
పూదండ యిచ్చి యప్పురము
..................
కధిపతిచేయు బొమ్మని యక్షు
పట్టణము పొంతనొక శిలాపట్టమునను
కూరుచుండంగ నాభద్రకుంజ....
బెట్టుటయువాఁడు బాలించె పృథివియెల్ల

తే. అది సహింపక వీఁడొక్కయాగఁడీఁడు
యవనియేలెదుననుచు సైన్యములతోడఁ
గడిమిమెయివచ్చి పురికి ముట్టడముసేయ
యక్షులను జింతనము సేయ నాక్షణంబ. 211

క. ఆయక్షవరులున్నపునకు
రాయిడిసేయుటయు నాత్మరణముననురుమై
పోయిరిలధాతువాడఁపు[1]
మాయలఁ జెడకున్న యట్టిమనుజులు గలరే. 212

వ. అని దైవికప్రధానంబైన యితిహాసంబుచెప్పిన విక్రమార్కునకు మెచ్చి ప్రతిదివసంబును ధనంబుగురియు, చంద్రకాంత లింగంబు నొసంగియరిగె. సాహసాంకుఁడునుం బురంబున కరుగుచు నాలింగంబు నొక్కదరిద్ర విప్రునకిచ్చి చనియె, తదనంతరవృత్తాంతంబు వినుమని యిట్లనియె. 213

1. పోయిరిధాతుర్వాదఁపు

క. ధనమును విద్యయుశౌర్యము
తనకుంగలదనుచు వృద్ధతములనుదాగై
కొనక వెసధిక్కరించిన
దనుజుండై బుట్టునిదియ తథ్యమునుమ్మీ. 214

వ. అదియెట్లనిన. 215

సీ. దేశంబుజూడ నాదిత్యాంకుడరుగుచు
నగ్రహారంబొకటంతఁ గాంచి
యందులనొక విప్రనందను నొక(క్రోలు)
మొసలిపట్టినదని మొఱ్ఱవెట్ట
విక్రమార్కుండదివిని నక్రమునుజంపి
విప్రునివిడిపింప విప్రుఁడనియె
తపమున బడసినదైవ విమానంబు
నీకిత్తుగొనుమన్న నృపవరుఁడు

తే. ఉపకృతికినింకఁ బ్రతికారమొల్లననిన
నతడు ప్రార్థించియిచ్చిన నందికొనుచు
పురమునకుబోవ నడవినాసురుఁడొకండు
వేడుటయునిచ్చెవాఁడును వెడలె దివికి. 216

వ. వాఁడును విద్యాగర్వంబునం బెద్దల ధిక్కరించిన పాపంబుననిట్లైతి ముక్తుండనైతిననుచుం జనియె, విక్రమార్కుండును పురంబున కరుగుదెంచె నింకనొక్కటి వినుమని యిట్లనియె. 217

తే. దుష్టులగు స్వప్నములు...... ?
తగినదానంబుజేసిన దలుగకున్నె
విక్రమార్కుఁడు దుస్వప్నవిద్ధుఁడగుచు
దానములుజేసి యాకీడు దలఁగికొనఁడె. 218

ఉ. కాసరవాహనుండనిన కాంచినస్వప్నము కీడువాపుకో
భూసురకోటికిన్ ధనముప్రోగులుగానిడెనం...
...వైభవంబులును వచ్చును దానముచేతనట్టిచో
దోసము వాయకున్న ఖలదుర్మద ధూర్తులకైన నిమ్మహిన్. 219

వ. అనిననారదుండు బలీంద్రునకిట్లనియె. 220

క. ప్రాణసఖుడైనవానికి
ప్రాణమువెచ్చించియైన పనిదీర్పదగున్
............జునకు.........
ప్రాణమువెచ్చించి శౌర్యరవిసతినీడే. 221

వ. అదియెట్లనిన. 222

ఆ. విక్రమార్కునగరి విప్రునితనయుఁడు
.........కేఁగి వచ్చునపుడు
తెరువునందునొక్క స్త్రీ యేలుపురిఁగని
మెలఁతఁజూడబోయె మేడమీఁద. 223

ఉ. కామిని లోకమోహినినిగాంచి...భూమిను
ద్దామతగాఁగుతైలఘట తండము చూచి సిలాతలంబునన్
భామలిఖించు వర్ణముల పద్ధతులం......
రామవరించు తైలపితరంబున గూలినయట్టి సాహసున్. 224

క. అనుపద్యము ప
య్యనవప్పుడనె......కెరుగిం
చిన నా విప్రసుతుండా
తనకు సహాయముగనరిగిత తైలమునన్. 225

ఆ. మునుగబోవబట్టి......
తన్ను నేలి యాపురంబు నేలుమనిన
నన్ను వలదు విప్రవరుండను వరియింపు
మనుచును పరిచంచి......... 226

వ. అనిన బలీంద్రుండిట్లనియె. 227

ఆ. విక్రమార్కనృపతి విక్రమంబె...
....................
చెప్పుము................
మూడులక్షణ విశుద్ధుండగుట సాగివచ్చు. 228

వ. అని నారదుండు పన్యసించి మరియును వినుమని యిట్లనియె. 229

చ. అవనిచరించ...కడ్డమువచ్చియొక్క భూ
దివిజుఁడువల్కె కంచిబరదైవత ముప్పదిమూఁడుచిహ్నముల్
భువిజరియించుమా.........త్తుని కసం
భవరససిద్ధి నాకనియు బల్కెను నేవినుచుండ భూవరా. 230

ఆ. అనినసాహసాంకు డవ్విప్రుతోఁగం
............కాత్మపురము
తెంపుకొనగ బట్టిదేవతరససిద్ధి
యిచ్చెనటయు ద్విజునకిచ్చె నతడు. 231

వ మరియు......దాతృత్వంబువినుమని యిట్లనియె. 132

క. క్షితిసురుని పెండ్లిచేసిన
అతిశయమగు పుణ్యమబ్బునాతని...
....................
(...)తన్మాభవ్రువలెయనుచు నందురు అర్యుల్. 233

వ. అట్లుగావున. 234

చ. ధరణి చరించిశౌర్య............చండభూ
నుసుఁడొకఁ డేఁగుదెంచి తనసూనుని పెండిలిసేయుమన్నభూ
వరుఁడొకకోటి నిష్కములు......నిచ్చెదానబం
ధురునకు నీయరాని యతిదుష్కర వస్తువుగల్గ నేర్చునే. 235

వ. అనినమరియు నీవెఱిగిన విశే......ష్టమనిన దైత్యనాథునకు
మునినాథుం డిట్లనియె. 236

క. తలనరకబోవు వానిని
తలనరక యుండఁగా......కిక
తలపోయ నశ్వమేధపు
ఫలమందగగలుగు ననుచు పలుకుదు రార్యుల్. 237

వ. అదియెట్లనిన 238

సీ. .........బులు[1] దిరుగుచువిక్ర
జనపతియొక చూత వనమునందు
పెదవులెండగ గడుభీతులై పరత
...భేతాళాఖ్య పురమువారు
చంపవచ్చిన దప్పి చనుదెంచితిమి యన్న
సాహసమూర్తి నచ్చటికి నరిగి......
...అటమున్నవధ శిలాతటమున
జంపంగబెట్టిన వానిచేపట్టి తిగిచి

తే. రక్తమాంసము నాశరీరమున గలదు
బలిగజేయఁడు తన్నని పల్కునపుడు
పూజయొనరించి పూజరి బోదివిపట్టి
దినకరునిజూపి పల్కె నద్దేవియపుడు. 239

1. శకదేశంబులు.

క. నీసాహసమున కలఁతి
యేసిద్ధులకైన వేఁడుమిచ్చెద ననినన్
గ్రాసంబు మానుపూజల్
చేసినమానవుని విడువు ! శుద్ధచరిత్రా. 240

వ. అనిమానుపాశనం బెన్నఁడు జేయకుమని యాపూజారి విడిపించె
నని మఱియు నారదుం డిట్లనియె. 241

క. పాయక ప్రాణముకెల్లన
పాయముగావించు క్రూరపార్థి వహింసా
ప్రాయంబు మాన్పుమంత్రికి
నాయింద్రపదంబు జేరుననిరి మహాత్ముల్. 242

వ. అనియుపన్యసించి విక్రమాదిత్యుని విచిత్రంబొక్కటి గలదు విను
మని యిట్లనియె. 243

క. అపరాధి గానివారిని
నెపమిడి దండించె నేనినిజ సుతునైనన్
రిపునిగతి దునుమ జూచుట
నృపతులకును దండనీతి నిల్పుటగాదె. 244

వ. అట్లుగావున. 245

క. మునిమాటకు విక్రమార్కుఁడు
చని దేశములెల్ల జూచుసమయమునందున్
వననిధి తటముననొకపురి
కనుగొనివసియించె నికటగహనమునందున్. 246

సీ. ఆపురవరమేలు నధిపతి సువిచారు
డనుమహీపతి కూర్మితనయుఁ డొకఁడు
జయసేనుఁడనువాఁడు హయయానుఁడై వేట
యరిగి గరితీర్థమాడ దలఁచి

తురగంబుడిగి నదీతోయంబు జొచ్చుచో
నొకవిప్రుగాంచి తానొక్కడగుట
కతనగుఱ్ఱముబట్టు ఠీవిసురయనవాఁడు
పట్టుకున్నను గళఁగొట్టుటయును

తే. పాఱఁడరుదెంచి యాసువిచారునకును
జెప్పుటయు నాత్మసుతుఁగాంచు శుద్ధయోగి
విక్రమాదిత్యునకు నదివిన్నవించి
సుతుని చెయిద్రుంచు మనద్రుంచ నతనిమీఁద 247

ఆ. హేమవృష్టి గురియు నామునికది యీయ
మునియునిచ్చె విప్రతనయునకును
కపటమునియు వాని కరమునసంధాన
కరణి మోపుటయును గరముమొలచె. 248

వ. అందున కద్భుతచిత్తులయిన భూసుర భూపతులచేత పూజితుండై
యాత్మపురంబున కరిగె. మఱియును వినుమని యిట్లనియె. 249

క. పాతకముల నణగించును
ఖ్యాతులు దిక్కులఘటించి కామితఫలముల్
చేతికిలోనగు నరునకు
భూతదయం బోలగలదె పుణ్యముధరణిన్. 250

వ. అదియెట్లనిన. 251

సీ. విక్రమార్కుఁడు భూమివీక్షింప నరుగుచో
పథగహనంబున బడియలోన
నడుమునబడి బక్కయావు చిక్కిన దయ
నెత్తెదనని పోయిమెత్తలేక

పెనఁగుచో బ్రొద్దుగ్రుంకిన బాసిపోలేక
కడుభక్తి నయ్యావు గాచియుండ
పులిమీఁదనురికిన దలగక వధియించి
పిడుగులుగాలియు బెడిదముగను

తే. వరుసమొక్కటిగురియ నప్పురుషవరుఁడు
గోవునకునడ్డముగ నిల్చి వేవుటయును
యతనిదయజూచి సురభి ప్రత్యక్షమగుచు
మనుజభాషల నృపతికిట్లనియె సురభి. 252

తే. నీదయాళుత్వసాహస నిచయమునకు
నమరపతిమెచ్చి నిన్ను నన్నరయబంపె
నట్లయరసితి యదిదృష్ట మయ్యెనీకు
వరములిచ్చెద వెద్ది నీవాంఛితంబు. 253

వ. అనుటయు. 254

క. ఉపకారపరుఁడుతాఁ బ్ర
త్యుపకారము గోరెనేని యుపకారంబా
నెపమునవొక్కటి(కొక్కటి ?)
నుపమించుటగాక యనరె యుత్తమపురుషుల్. 255

వ. అని నిజపురంబునకు జనియెనని చెప్పిమఱియును, 256

క. మాయలుపన్నియు వివధో
పాయంబులు చూపిహితము పల్కియు నానా
పాయములు జెప్పియునునర
నాయకులను......నమ్మింతురుకుజన్. 257

వ. అదియెట్లనిన విక్రమార్కుఁడొక్కనాఁడు కొలువుకూర్చున్న సమయంబున గృత్రిమ పత్నీసమేతుండై యొక్కవైంద్రజాలికుం డఱుగుదెంచి యిట్లనియె, 258

ఉ. ఇంద్రునిబంటనేను దివిజేంద్రసమానక విక్రమార్క యీ
చంద్రనిభాస్య నిల్లడిడి శక్రవిరోధులతోడ పోరని
త్రృంద్రతజేయఁబోయెద ప్రతాప భయంకర సాహసక్రమో
పేంద్ర సమగ్రవిక్రమ సమేత ?పరాక్రమ నన్నుఁజూడుమీ. 259

క. అనినగగనవీథి కెగయుచు
తనువు దిరస్కరిణి దాఁచిదర్పిత గర్జా
నినదంబు చేయుచుండగ
ననిచేసినయట్ల యయ్యె నంబరవీథిన్. 260

వ. అంత. 261

క. కరములు బదములు శిరములు
ధరపైబడునట్లు దోప తరుణియు నాత్మే
శ్వరుగూడ బోదుననవుడు
మరణము నిజమానొ కాదొమానవె యనినన్. 262

ఆ. ఉడుగకగ్నిను విడ యుఱికిన నటువలె
దలుగుటయును భటుడు గెలుపుతోడ
వచ్చినట్లువచ్చి వనిత నాకిమ్మన్న
విక్రమార్కుఁడపుడు విస్మయమున. 263

వ. భవదీయ పత్నిత్వత్క రచరణ శిరంబులు దునిసి ధరణిపై బడిన నగ్నిప్రవేశంబుచేసెననుటయు వాఁడిట్లనియె. 264

తే. ప్రాణములతోడ దేవనీపదము కొలువ
వచ్చియుండంగ మత్కాంతచచ్చుటెట్లు

గొడ్డు తనతల్లియని కన్నకొడుకుచెప్ప
మాటనిజమయ్యె నిచ్చోట మనుజనాథ. 265

దోదకం :

ఈజగమంతయు నేలుచు నాయీ
రాజముఖంబరి రంభణసేయన్
తేజముగాదిది తే నావనితన్
రాజులుగోరిన రాములులేరే. 266

వ. అనవుఁడు. 267

క. నివ్వెరపడి (జనపతియిపు)
డెవ్విధమున నిత్తు వీని యిందునిభాస్యన్
నవ్వో నిజమోయని మది
నెవ్వగచేమాటలాడ నేరకయున్నన్. 268

ఆ. అంతనింద్రజాలి యామాయలెల్లను
దలగబెట్టివచ్చి నిలుచుటయును
పాండ్యనృపతితనకు పాయనమిచ్చిన
మేటివస్తుచయము మెచ్చియిచ్చె. 269

వ. అదియునుఁగాక. 270

క. పేదలగు విప్రులడిగిన
నాదరణముతోడ నల్పమధికంబనకా
హ్లాదమున నిచ్చువాఁడె
యాదిమ దాతనుచు నుందురార్య జనంబుల్. 271

వ. ఈయుదంబు దెలుప నితిహాసంబు వినుమని యిట్లనియె. 272

సీ. ప్రథమాద్రి మణినితంబ ప్రదేశమ్మున
నొక్కపద్మాకర మొప్పుచుండు
దానిలోనొక మణిస్తంభంబు భాస్కరుఁ
డుదయింప దానును నుదయమందు
నదియు మధ్యాహ్నంబునందు సూర్యునిమోచు
ననవినియొక సిద్ధుడరుగుదెంచి
విక్రమార్కునకు నవ్విధ మెఱిగించిన
సాహసనృపతి యచ్చటికి నరిగి

తే. కంభముదయింప దానునక్కంభమెక్కి
యంబుజాతాప్త బింబంబునందుకొనిన
చండదీప్తికి నోర్చిన సాహసాంకు
మెచ్చికుండలీయుగళంబు నిచ్చియనిపె. 273

వ. అట్లు సూర్యదత్తం బైనకుండళ యుగళంబు ప్రతిదివసంబు అష్ట
బారువులు సువర్ణంబు గురియునని విన్నవాఁడుగావున నవిగైకొని
పురంబున కేతెంచునప్పుడు మార్గంబున. 274

ఆ. ఘనదరిద్ర హతినిగడుడస్సి భూసురు
డర్థమొసగుమనుచు నడుగుటయును
కుండలంబుల మహిమగొనియ్యాడి విప్రున
కిచ్చియాత్మపురికి నేఁగుదెంచె. 275

వ. అనిమఱియునిట్లనియె. 276

క. ధరణిక వగ్రహదోషము
దొరకిన తచ్ఛాంతిసేయదొడరుదురవనీ
శ్వరులు దగదైవ మానుష
చరణులచే వానగురియు చందంబునకున్, 277

వ. అదియెట్లనిన. 278

ఆ. సాహసాంకునకును సమయంబునందుబం?
చాంగమొక్క విప్రుడనునయించి
యధిప! పదియునారు నబ్దంబులీయెడ
వానగురియకుండ వగ్రహమున. 279

వ. అదియెట్లనిన. 280

క. ప్రాతఃకాలము మంచును
అతతమధ్యాహ్నవేళ నభ్రోద్భయముల్
రాతిరినిర్మల గగనము
నేతరిదోచినను నచటయేలాయుండుల్. 281

వ. ఇట్టియనావృష్టికి శాంతిచేయవలెననిన నీ రుద్రాభిషేకవారుణజ
పాదిశాంతులు సేయించినంగురియకున్న విక్రమార్కుడు. 282

క. విల్లును శరములు గొనిదివి
తల్లడపడనేసి మేఘతండము చేతన్
వెల్లువగా గురియించెను
బల్లిదులకును జేయరాని పనులునుగలవె. 283

వ. మఱియును. 284

క. క్రూరమృగ బాధలుడిపి ప్ర
జారక్షణ మాచరించు జనపాలునకున్
ధారుణి సురధేనువు నా
కారంబున గురియుచుండు గామితఫలముల్. 285

వ. అదియెట్లనిన విక్రమార్కుండు రాజ్యంబుసేయుచుండ నొక్క
నాడు. 286

మత్తకోకిల :

భిల్లుఁడొక్కఁడు వచ్చి చెప్పెను భీకరంబగు ఘృష్టిభూ
మెల్లఁద్రవ్వుచు మర్త్యులన్ వధియింప నచ్చట మానవుల్,
తల్లడించుచు బారిపోయిన ధాత్రినాయక వచ్చితిన్
పల్లెలన్ వసియింప మాకిక బాసెనేమని చెప్పుదున్. 287

తరల :

అనిన వేటకు నుత్సహించి ధరాధినాఁథుడు సింధువా
హనము నెక్కిఁత దుక్తమార్గమునందునేగి వరాహమున్
కనిరయంబున వెంటబెట్టిన గాఢ బారిధరాబిలం
బునను గృంగిన గుజ్జముండిగి పోత్రివెంటనే పోవుచున్. 288

వ. ఆభూవివరంబునడిగ్గి సాహసాంకుండు తన్మధ్యంబున భోగవతీ
పురంబుఁగాంచి భోగీంద్రునిం బొడగని నమస్కరించి. 289

(ఇక్కడ నొక పత్రము జారిపోయినది.) 290

తే. ఒసగికొని పొమ్మటన్న వాఁడోపెనన్ని
కట్టుకొనిపోవ నర్థాధి కారివచ్చి
గణిత వినుమన్న నీవును గట్టుకొన్న
వాఁడునెఱుఁగుట యదిలెస్స వలదులెఖ. 291

వ. అనిననుడుగక లెఖవినుపించిన నర్థాధికారి విశ్వాసంబునకు సంతో
షించె ననిమఱియు నిట్లనియె. 292

క. తమవంటివారు స్థితిచెడి
తమునిలువుమటంచు నడుగ తమబ్రతుకునకై
తమకించ కొసగు నరులకు
తమకింపగు ఫలములబ్బు తథ్యముసుమ్మీ. 293

వ. అవ్విధంబు వినిపించెద నని యిట్లనియె. 294

సీ. చాంద్రగుప్త క్షితీశ్వరుఁడు దేశాంతర
మహిఁగు చోతుహీన భూభరముపొంత
ఘనుఁడు త్రికాలజ్ఞుఁడను సిద్ధుబొడగని
మ్రొక్కినసనాసిద్ధ ముఖ్యుఁడనియె
నెవ్వరికిచటకిని నే తేరరాదునీ
వెట్లువచ్చితి విరీకిత్తునద్ది
యనిగంతయును దండమును గరణియుగూడ
నిచ్చితన్మహిమల నెఱుఁగజెప్ప

తే. అందికొనివచ్చు తెరువున నధిపుఁడొకఁడు
రాజ్యహీనత్వమొంది యరణ్యవీధి
దీనదశచెందితన్ను నర్థించుటయును
సిద్ధుఁడిచ్చిన యవియిచ్చి క్షితివరుండు. 295

వ. వానిమహిమ దెల్పువాఁడై యిట్లనియె. 296

తే. గంతధరియింప మేదినీ కాంతుఁడగును
కరణిమోపిన ప్రాణసంగతులుఁ గలుఁగు
దండధరుఁడైన రిపులదోర్దర్పమణఁచు
ననుచు నుపదేశమిచ్చి దానరిగె బురికి. 297

వ. మఱియొక విశేషంబు వినుమని యిట్లనియె. 298

క. సోదరులు పాళ్ళకొరకై
వాదడిచినపిన్న పెద్ద వరుసానుగతిఁ[1]
వాదడఁచి పంచిపెట్టిన
భూదేవుల వేల్పులనుచు బొగడుదురార్యుల్. 299

వ. అదియెట్లనిన. 300

---

1. పిన్న పెద్దలగుచు తమగతిఁ

సీ. విక్రమాదిత్యుండుర్వీ స్థలిపాలింప
 ....................
కాలాంతరమున బొందెడు వేలధనమెల్ల
 ధనమెల్లశయన పాదమిలకిగద
పాతినని పుచ్చు.........
 ....................
చూడనాధనంబు
 లెముకల బొగ్గులునుముకయు మన్నునై
యన్నల్లు బిందెల నున్నజు
 ......భ్రమసెమీాకు.
విన్నవింబంగవచ్చితి మన్ననవ్వి
యవ్వనెవ్వని పాలన దేదియుండ
అది.........ఁగియంత. 301

క. భూమీసురలాది గాగల
గ్రామంబుల దగవుదీర కవుడు ప్రతిష్ఠా
....................
భూమీశ్వరు నడుగనతడు పొందుగదీర్చె. 302

తే. ............కరుడు
శాలివాహను బిలువంగ జాఱుబంప
నతడురాకున్న గోపించి యర్కనృపతి
.........ర్వాడుడగుచు. 303

సీ. శాలివాహనుండు సాహసాంకుని సైన్యంబు
 విరివిగా బురము.........
గమతంద్రివాసుకి దలచిన నాప్రొద్ద
 ఫణిపతిదైత్యుల బంపుటయును

దారి..................
సాహసాంకు డొక్కశైలమునకు
దండకూశముగోరి తపముగ్రము
............కలశమియ్య

నందికొని రాగనయ్యురగాధి విచుడు
భోగిపుత్రులుగువ.........
...గుండుచని విక్రమార్కు ననుచు
బొంచుటయు వారువచ్చి దీవించియపుడు. 304

తే. అమృతకలశంబు ప్రార్థించి యడుగనీక
నించుకాలస్యమైన నీవీయకున్న
నన్యదాతను వేడెద మన్నవారి
కపటభూసుర చరితుల గాదలంచి. 305

క. నిజమువచింపుఁడు భూమి
ద్విజులవి యడుగుటయు శౌర్యదినకర! మేమా
భుజగపతి యాత్మనందను
విజయమపేక్షించి యనుప విప్రులమగుచున్. 306

వ. వచ్చినిన్నమృతంబడిగితి మనిన భూపాలుండు. 307

క. యాచకుఁడై రిపుఁడైనను
నీచాత్ముండైన పాపనిరతుండైనన్
యాచింప నర్థమీయక
త్రోచుట త్యాగులకు నధికదోసము జేయున్. 308

సీ. గువ్వకై దేహంబుగోసి పెట్టఁడె శిబి
తనమేను వలెనని దాఁచికొనెనె.
బలభేదిచేత దిత్తోలిపించుకొనె
గర్ణుడంగంబు డాచుకోనాసలేదె

..........................

......................

...................

........................

తే. దేహమస్థిరమనుచు సందేహముడిగి
యిత్తురుత్తములీ రాని విత్తమైన
....................
.................... 309

వ. అనితలంచికుహాకవిప్రులకు నమృతకలశంబిచ్చి యప్పటి కుట్ల తపం
బున వాసుకి నారాధించి తత్ప్రసాదంబున నాత్మబలంబులు ప్రాణ
ములు వడసి తనపురంబునకరిగి రాజ్యంబుచేయుచుండె మఱియొక
కథ వినుమని యిట్లనియె. 310

క. దానంబును సాహసమును
మానవుఁడేకొలది గట్టిమనసున జేయుఁ
దానాకొలదినె ఫలసం
తానంబులుగలుగు నిదియెతథ్యముసుమ్మీ. 311

వ. అదియెట్లనిన. 312

సీ. విక్రమార్కుఁడు రాజ్య విభవస్థుఁడై యుండ
కవివచ్చి వితరణ కథలలోన
కనక వర్షుండను మనుజేశ్వరుండను
దినమును దేవికి తనువువేల్చి
యర్థంబువడసిధనార్థుల దనుపుచు
వర్తించునని జెప్పివానిజూడ
నరిగియాతఁడు వేల్చువనలంబు లోదన
దేహంబు వైచిన దేవిమెచ్చి

ఆ. వరము వేడుమన్న వరదయ నృపతికిఁ
ధరువు వేల్పుకుంచ ధనములిమ్ము
అనిన నిచ్చెదేవి యతఁడును ముదమంది
యనుప విక్రమార్కుఁడరిగెఁ బురికి. 313

వ. మఱియు నొక్కవినోదంబు వినుమని యిట్లనియె. 314

క. నేమములు దలచ నొల్లరు
సామాన్యంబనరు తమకు సాగిన కొలదిన్
కామినులేకాంతఁబున
కామించిననొల్ల మనరు కాముక జనముల్. 315

వ. అదియెట్లనిన, 316

స్వాగతం:
శక్రసన్నిభుఁడు సాహసలీలా
విక్రముండు పృథివీ తలమేలన్
శుక్రనీతిమతి శుద్ధుఁడుమంత్రి
ప్రక్రముండు జనపాలకు వీఁటన్. 317

వ. శుద్ధబుద్ధి యనువాఁడు తత్తనూభవుండిచ్ఛావిహారుండనువాఁడు దుర్వృత్తుండై దేశంబుదిరుగుచు నుష్ణతీర్థంబున నుష్ణలింగంబు దర్శించి యారాత్రియక్కడ వసియించియుండ నారాత్రియందు. 318

క. శంభునిగొలువగ వచ్చిరి
రంభోర్వశులాదిగాగ రాజాననలు
జృంభకుచ కుంభసంభృత
శుంభద్దంభానుమోద శోభితలగుచున్. 319

ఆ. వచ్చియుష్ణమూర్తి నచ్చటసేవించి
పోవునపుడు మంత్రి పుత్రుజూచి
మమ్ముగూడిరమ్ము మాపురికనపోయి
చిత్తమద్భుతంబు జెందిమగుడి. 320

వ. వచ్చియవ్వార్త వినిపించిన నతనిదోకొని విక్రమార్కుం డచ్చటి
కరిగి. 321

ఉ. ఆవసుధాధినాథుఁడు ప్రియంబుననుముందటి భూమిగాంచెగో
దావరివారి మగ్నజనతా ఘనకల్మషతాప విస్ఫుర
ద్దావకృశాను తీవ్రపరిదాహశిఖాగణదవ్యామానకా
ప్లావనవృష్టి మేఘపటలస్ఫుట భాద్రపదాదిశర్వరిన్. 322

వ. తొల్లియచ్చట శేషుండు యజ్ఞంబు సేయుచుండ అగ్నిహోత్రంబు
మీఁద ప్రవహించుటంజేసి యదియుష్ణ తీర్థంబునంబరగె. 323

తే. ఉష్ణలింగంబు భజియించె నుర్విభర్త
యచటనారాత్రి వసియింప నర్ధరాత్రి
యప్సరస్త్రీలువచ్చి యయ్యభవు గొలిచి
సాహసాంకునిదోకొని చనిరిదివికి. 324

వ. అట్లరిగి తమ్మువరించి తమలోకం బేలుచుండుమనిన నొల్లమదీ
యమంత్రి పుత్రునివరియించి తన్మనోరథంబు సల్పుడనిన నట్ల
కాకయని యప్పటిచోటనే డించి యరిగిన. 325

క. పురికేతెంచెను విక్రమ
ధరణీపతి యప్సరసలు తన్మంత్రిసుతుఁ
వరియించికొలుచుచుండిరి
విరోచవసుత నింకనొకటి వినుమనిపలికెన్[1]. 326

---

1. విరోచనకుమారయొకటి వినుమని పలికెన్

క. సారాచార సమగ్రో
దారుండగు నృపతిసుతుఁడు ధరపాలింపన్
మారీవ్యాధులు దరిద్రా[1]!
చోరగ్రహాగతులు ప్రజలసోకకయుండన్. 327

ఆ. అట్లుగాన విక్రమార్కుండు రాజ్యంబు
పాలనంబుసేయ ప్రజలకెల్ల
దుష్టచోర రోగదుర్గత్య వగ్రహా
న్యాయవర్తనంబు లంటకుండు. 328

వ. అనినవిక్రమార్కునకు ద్వాత్రింశత్పుత్రికా సింహాసనంబెట్లుగలిగె
ననిన బలీంద్రునకు నారదుం డిట్లనియె 329

క. రంభయు నూర్వశియునును
జృంభిత నాట్యంబు చూపచింతారత్నా
దంభఘన వేదిపైనా
జనభారి వసించియున్న సమయమునందున్. 330

ఉత్సాహము :
ఏనుబోయిమున్నజూచి యింద్రుడని యేవేడ్కనో
మానినాథ నృత్యశాస్త్రమార్గమెవ్వఁ డెఱుఁగునా
మానవేశుఁడైవ విక్రమార్కుఁడెఱుఁగునన్న వ
ద్దాన వారి రథమువంపె ధరణినాథు చోటికిన్. 331

ఉ. పంపిన విక్రమార్క నరపాలకుఁ డింద్రునియాజ్ఞపూని నై
లింప ధరిత్రికేఁగి యట లేఖకు లేంద్రునిగాంచి వజ్రియు
న్నింపగ రత్నపీఠముననిల్పె సురల్ వినుతింపగన్ యశ
స్సంపదుదారశౌర్యుఁడగు సాహసమూర్తి దిగీశవైఖరిన్. 332

1. దుర్గతి

క. భరతాచార్య మతంబున
నొరవట్టగరాని నృత్య మూర్వశిచూపెన్
వరుసం దత్తిళమతమున
సరసముగా నాడెరంభ శక్రుఁడుచూడన్. 333

వ. అప్పుడింద్రుఁడు విక్రమార్కునిఁజూచి యీయిద్దఱిలోన శాస్త్రసిద్ధం
బైన నృత్యం బెవ్వరిదనిన నతండిట్లనియె. 334

క. అంగములు ప్రధానంబులు
పాంగప్రత్యంగములు రసాస్పదభావం
బంగీకరింపవని యిది
సంగతి గాదనిరి భరతశాస్త్రజ్ఞవిధిజ్ఞుల్. 335

క. అంగప్రత్యంగములే
అంగీకరణంబుగాఁగ నాడెనురంభా
భంగులు శాస్త్రక్రియలకు
భంగంబగు నంద్రుచూపె భరతవిధిజ్ఞుల్. 336

వ. మఱియు శుద్ధాంగవిధాంగ దేశిమార్గ నృత్యంబుల నిపుణతచూపిన
నూర్వశి మత్తల్లి హల్లీసక ప్రేక్షిణి పేరణీ కుండలి దండలాసకాది
నృత్యంబులు విధాంగలక్షణంబగుటను శుద్ధాంగవిధాంగంబులలో
శుద్ధాంగంబుత్తమంబగుట నూర్వశిమేలనిన ద్వాత్రింశత్పుత్రికా
యుక్తంబైన సింహాసనంబిచ్చి యనిపిన విక్రమార్కుండునుం
బురంబునకువచ్చి తత్సింహాసనారూఢుండై రాజ్యంబు సేయు
చుండ గొంతకాలంబునకును. 337

ఆ. కంపమొందెధరణిగజముల మదమింకె
తురగనేత్రములను దొరగెనీరు
కురిసె రక్తవృష్టి కూపెట్టె పక్షులు
రవికి దేజముడఁగె రాజెదిశలు. 338

తే. ఇట్టి యుత్పాతములు ధరబుట్టుటయును
భట్టి వినుపించుటయు నరపాలవరుఁడు
యిందులకు నేమి కారణ మెఱుఁగ జెప్పు
మనిననాభట్టి జెప్పె నేకాంతమునను. 339

సీ. నీతపశ్శక్తికి నీలకంఠుఁడు మెచ్చి
యిలయేలవెయ్యేండ్లు నిచ్చెనీకు
ఇటుబుద్ధిబలిమి వేయేడులు నేనీయ
రెండు వేలేండ్లిల నుండగలిగె

హరుఁడు చెప్పిన కాలమయ్యె మాసాధిక
సమవయఃకన్యకాజాతుఁడైన
బాలుచే బడ నీకు బ్రాప్తంబుగలదని
వచియించె నటువంటివాఁడు ధరణి

తే. బుట్టగాబోలు నరయంగ బెట్టిపంపు
మనిన బేతాళుదలచెనయ్యవనినాథుఁ
డతఁడుచను దేర నరయబొమ్మనిన వాఁడు
నరసియే తెంచి యా విక్రమార్కునకును. 340

క. వినుపించెఁ బ్రతిష్ఠానం
బనుపురి నల యెక్కుడైన హాయనపువయో
వనితకు బుట్టినబాలుం
గనుగొంటిని విప్రకన్యకానందనునిన్. 341

వ. అని చెప్పి యదృశ్యంబయ్యె విక్రమార్కుండు. వానిబట్టితే బంపిన
వాఁడునుం జని ప్రతిష్ఠానపురం బవరోధించిన. 342

క. వాసుకితనపుత్రునికై
యాసురసైన్యములబంప నాసైన్యములన్
వాసిచెడ నురిపి విడిచిన
నాసాహసమూర్తి వినియె హతశేషులచేఁ. 343

క. విని కోపంబునదానే
గిన నబ్బాలకుఁడు కోలఁగెడపినగూలెన్
ఘనుఁడైన విక్రమార్కుఁడు
ఘనహీనతలోక్క రూప కాలంబునకుఁ. 344

క. కాలవశంబున నొకపసి
బాలునిచేనైన ఘనుని ప్రాణము పోవున్
కాలముగూడకతలదెగి
వ్రాలినప్రాణంబు మగుడికాదె తలంపఁ. 345

సీ. శాలివాహనుచేతి కోలచే విక్రమ
శిరమట్లు దెగుచునుజ్జయినిపురము
నందు సాహసమూర్తి యంగనముందర
బడుటయు నాకాంతభట్టిజూచి
గర్భములోనున్న యర్భకు వెడలించి
యతనిచేతికి నిచ్చి యగ్నిజొచ్చె
భట్టియునాబాలు పట్టభద్రునిచేసి
యేలించె నిలయెల్ల నింతలోన

ఆ. గగనవాణి పలికె గద్దియ యెక్కంగ
పాత్రుఁడైన భూమిభర్త లేడు
గానధరణిలోన గప్పడు మీరని
చెప్పెభట్టి యట్ల జేసెనంత. 346

వ. కొంతకాలంబునకు నాస్థలంబు నిర్మానుష్యంబై యడవి పెఱిగిన నొక్కభూసురుండు. 347

ఆ. చెట్టుగొట్టి చేనుచేసి నాఁగటదున్ని
గొఱ్ఱు గొట్టి నడిమిగుట్ట లేరి
[1]సవర జేసి గోరుతగాఁగ జేశివి శాఖ (?)
విత్తులలికి కంచెవెలుగు వెట్టి. 348

క. మిడుతులకు దప్పిచాలే
ర్పడ బాయఁగ పెఱిగి పేనువట్టకవలమై
సుడి చావక యెలుకలచే
బడినొవ్వక జొన్న పెఱిగి పండగనంతన్. 349

శా. ధారాపట్టణమేలు భోజుఁడు మహోదారుండు వాహ్యాళిగా
నారణ్యంబున కేఁగివచ్చు నెడ బ్రహ్మప్రాప్త భూజోవనా
చారంభస్థలి[2]జేరు వంజనఁగ సైన్య వ్రాతముం జూచియు
ప్పారుం డిట్లనె జొన్నచొచ్చివలె నేభక్షింపుడీ బిత్త్యేమున్. 350

క. అని మంచెమీఁదఁ బలుగక
విని నిజమని జొన్నవెన్ను విఱువగ మంచం
బునుడిగ్గి వెంటదోలంగం
జనికుయ్యోయనిన సైన్యజనులతిభీతిన్. 351

ఆ. చేనువెడలిపోవ దానెప్పటిని మంచె
యెక్కి వెడలిపోవనేల మీకు
నూచబియ్యమైన నోపినలాగున
దినుడనంగ వారు తిరిగిచొరగ 352

1. సవరజేసి గొరుత చదునుగాఁగ విశాఖ.
2. భూజావనైకారంభస్థలి.

వ. తొల్లిటి యట్లమంచడిగ్గి యప్పటికుయ్యేడిన భోజుండు విస్మితుండై
యమాత్యుని నడుగుటయును నతండిట్లనియె. 353

క. విత్తంబుమీఁదనుండిన
మత్తుండై పలుకునట్టి మానవుఁడైనన్
విత్తము ప్రలాపయుతమని
చిత్తంబునఁ దలఁచిత్రవ్వయము సేయుదు రార్యుల్. 354

వ. అట్లుగావున నితండెక్కిన మంచెక్రింద నధికధనంబుండ బోలు నది
శోధింపవలయుననిన నబ్భోజుండు. 355

క. ...[1]...త్రమునకు
భూవరుఁడును ద్విగుణమిచ్చి భూఖనికులకున్
తాన్నవిభుఁడుమంచెక్రిందను
భూవివరము సేయుమనుచు బొందుగ బలికెన్ 356

క. జనపతియానతిచే నా
ఖనికులు ధరద్రవ్వనచటగనుపట్టెల స
త్కనక మణిరుచులు వెలుగును
ఘనసింహాసనము పుత్రికాసహితంబై. 357

వ. అది మోయించుకొని ధారాపురంబునకుం జనియెననుటయును. 358

తే. అట్టిసింహాసనము భోజుఁడాత్మపురికి
యివ్విధంబునగొనిపోయి యేమిచేసె
నద్భుతంబయ్యె నది నాకు నానతిమ్ము
బ్రహ్మఋషివర్య! ఆదిమబ్రహ్మపుత్ర! 359

1. అవిప్రక్షేత్రమునకు.

ఉ. వేంకటనాథపుణ్యపదవీ గతయోగసనాథ విస్ఫుర
త్పంకజనేత్ర భైరమహాపాత్రమనోంబుజ మిత్రశంక చ
క్రాంకిత బాహు[1]పద్మనిగమాంత మనోహరపద్మకాస్తుభా
లంకృతపీనవక్ష కమలాముఖ లగ్నకటాక్ష వీక్షణా! 360

క. కుటిలసుర విమత మదహృ
త్పటుచటుల విఘటనచక్ర భ్రమణ బాహా
కటితటఘట నాహాటక
పటరాజిత కుంటముక్ల భైరవు వరదా! 361

వనమయూరము :
శ్రీమహితరూప! పదసేవితసురేంద్రా!
క్షేమకర! తల్పగత! శేషగత శోభా!
భామహిత గంగవిభు భైరవసుధి హృ
ద్ధామ! తిరువేంకటనిధాన! జగదీశా! 362

గద్య. ఇది యష్టభాషాకవితాప్రవీణ నవఘుంట సురత్రాణకూచనా
మాత్య పుత్రసుకవిమిత్ర వినయవిద్యావిధేయ యెఱ్ఱయనామ
ధేయ ప్రణీతంబైన సకల నీతికథా నిధానంబునం బ్రథమా
శ్వాసము. 363

——:o:——

1. పాణి.

# ద్వితీయాశ్వాసము

క. శ్రీకలితకుంట ముక్కల
శ్రీకరపినబయ్యమంత్రి శేఖరహృదయ
శ్మాకల్పక భూరుహాయు
ర్వ్రీకమలాహృదయనాథ ! వేంకటనాథా !

వ. అవధరింపుము నారదుండు బలీంద్రున కిట్లనియె.

సీ. భోజుఁడీరీతిన పూర్వసింహాసన
ముస బలిపూజనములు ఘటించి
శుభముహూర్తంబున శుద్ధాత్ముఁడై దాని
నారోహణముసేయనందు నున్న
ప్రతిమలుఁ గదలి ముప్పదిరెండు జీవముల్
వడసి భోజునిజూచి పలికినపుడు
విక్రమార్కుని భంగి వితరణసాహస
క్రమములు నీయందుగానరా(వు)

ఆ. కానగద్దెయెక్కఁగానర్హ దవుగావు
నిలువుమనుచునర్క నృపతి కథలు
చెప్పిదివికి నెగసియప్పుడు భోజుని
కనిరి దివ్యమూర్తుల లవధరించి. 2

సీ. చంద్రగుప్తతుమాచక్రేశు తనయుండు
చంద్రచందన కుందచారుకీర్తి
వాసవదత్త సింహాసనారోహణ
పావనవైభవోద్భాసితుండు

సాహసోదారరతా విక్రమార్యుండు
ఘోరరిపువ్రాతకుముదహేళి
భూరగస్వర్లోక పూర్ణసద్గుణరాశి
నిర్భయదాన నిర్నిద్రమూర్తి

తే. దానధర్మోపకార విద్యాప్రతాప
సత్యశౌచక్రియా బలాశ్చర్యశౌర్య
భూమణుఁడు దీనయాచక పోషణుండు
విక్రమార్కుండు జగదేకవిశ్రుతుండు. 3

వ. అనియతని గుణంబులు ప్రశంసించి నీకతంబున శాపముక్తులమైతి
మనిన మీకీశాపంబెట్లు వచ్చెననిన నాపుత్రికాస్త్రీ లిట్లనిరి. 4

క. గిరిజకు సఖులగు మేమా
హరునిన్ మోహింపనెంచి యద్రిజమమ్మున్
బరికించి శాపమిచ్చెను
పరువడి నీగద్దెయందు ప్రతిమలుగాఁగన్. 5

వ. అనిచెప్పి యాధాస్థానంబున కరిగిన భోజుండాసింహాసనంబెక్కకయు
మామహేశ్వర ప్రతిష్ఠగావించి కొలుచుచుండె ననిన సభోజుని
జన్మంబు చెప్పుమనిన నారదుం డిట్లనియె. 6

ఉ. ముండికుడాప్రయాగ వసుముఖ్యములల్లక తీర్థవాసులన్
ముండనమాచరించునెడ ముగ్గురు ముండలువచ్చి యందులో
రండయొకర్తి యాత్మపతి రాజుగ గోరి త్రివేణిగూలె నా
రెండవముండయుం బ్రియధురీణ మనోహరుగా దలంపుచున్. 7

ఆ. ఆత్రివేణి గూడెనంత మూడవదియు
నాత్మభర్తకళల నధికుఁడగుచు
చేరిమొగముఁ జూచువారెల్ల కవులుగా
గోరి యాత్రివేణిగూలుటయును. 8

క. ఈముండలు ముప్వరకు
స్నే మగడంగాఁగవలయు నిహామునననితా
నాముండియందు గూలుచు
భూమిపయిన్ ధరణియేలె భోజుండగుచున్. 9

వ. అట్లుచెప్పి యిట్లనియె.

ఉ. మానవలోకనాథుఁ డనమాన చరిత్రుఁడునందుఁడంగనా
మానసవర్తియై విబుధమంత్రులకున్ గొలువీక యెప్పుడున్
భానుమతీ కపోలకుచ భారముఖోరువిలోలనేత్రస
న్మాన మనస్కుఁడై ధరణిమండలమేలుచు నుండెనంతటన్. 10

వ. ఇవ్విధంబున స్త్రీలోలుండై భూపరిపాలనంబునం బ్రమత్తుండై
యున్ననతనికి బహుశ్రుతుం డిట్లనియె. 11

ఆ. జాతిసంకరములు జరగంగ నీయక
భూతలంబు జనులరీతులెఱిఁగి
శత్రుమిత్రనృపతి చర్యలు పరికించి
ధరణి యేలవలయు నరవరుండు. 12

క. లోలాత్ములు మనసీయరు
శ్రీలక్ష్మస్థితులు చెదరు చేరిన మనుజుల్
వేళగని వెళ్ళఁజూతురు
స్త్రీలోలుఁడు పాపియనుచుఁ జెప్పుదురార్యుల్. 13

వ. అనిమంత్రి హితంబుచెప్పిన నిట్లనియె. 14

క. హరుఁడును హరియును నజుఁడును
శిరమున నురమునను వదనసీమల యందున్
దరుణులఁదాల్చిరి పాయక
నరులెంతటివారుపాయ నారీజనులన్. 15

వ. అనిన మంత్రి యిట్లనియె. 16

ఆ. అధికులాచరించు విధములు దలపంగ
నితరజనులు సేయనెట్లు గలరు
దంతిపల్లనంబు ధరియింపఁ బొట్టేలి
కలవియగునె చూఁడన వనినాథ. 17

వ. అనిననతీ విరహితుండనై యుండ లే నేమిసేయుదు ననిన బహు
శ్రుతుం డొక్కచిత్రపటంబున భానుమతి రూపంబు చిత్రించి
ముందటనిడి యీపటంబుచూచుచుం గొలువుండి భూమిఁ బాలింపు
మనిన నతండట్లసేయుచుండె నంతనొక్కనాఁడు. 18

తే. శారదానందుఁడను గురుస్వామియొక్క
యవసరంబున నృపుఁజూడ నరుగుదెంచి
పటమునన్ లిఖితయైన యాభానుమతిని
గాంచి శోభవలక్షణ క్రమములరసి. 19

క. విలిఖించఁ డేలకో యీ
లలనామణి వామ జఘన లాంఛనమనుచున్
బలికినభూపతి యితఁడీ
నెలవెఱుఁగుట యెట్లు! తప్పెనిజమూనటేకిన్. 20

వ. అనిమంత్రిఁజూచి శారదానందుని వధియింపుమని పంపిన బహు
శ్రుతుండట్లగాకయని శారదానందునిం గొనిచని యొక్కభూగృ
హంబున డాఁచియుండె నంత నొక్కనాఁడు. 21

ఆ. నందభూమి పాలనందనుఁడు విజయ
పాలుఁడ నెడువాఁడు పాదివేఁట[1]
యరుగఁదలఁచి సైంధవారోహణముచేసి
పురముగవని వెడలు దెరువునందు. 22

సీ. యెండినతరువుననుండి కాకము గ్రోల్చె (?)
వెత్సకునరచుచు వచ్చెగోవు
రజకుండు మలినవస్త్రపుమూటతో వచ్చె
పట్టినఖడ్గంబు పడియెఁబుడమి
చేలవిహీనయై బాలిక పొడచూపె
తరుశాఖ విరిగి భూస్థలిని ద్రెళ్ళె
కుదిరలు వాపోయె కుడివంకదిక్కున
ముందటగూకడె ముం...

సవ్యబాహువు వణకెనశ్వంబు మ్రొగ్గె
కోటడెలిగించె బలుగుదాగుండ్రఁ దొలిపె
డబ్బు తొరజొచ్చి పరికెదబ్బిబ్బుగాఁగ
......................... 23

వ. ఇవ్విధంబున నపశకునంబులైన మగుడక యారాజకుమారుండు
మృగయావ్యసన పరాయణుండై చని యవ్వనంబున 24

క. మృగములఁజంపుచు గోలము
దగులుచు వెనువెంటఁ దిరుగ తరణియు గ్రుంకెన్
దిగదిగ నొకపులి తరిమిన
జగతీపతిసుతుఁడు తరువు సరసర బ్రాకెన్. 25

ఆ. అట్టిమ్రాను ప్రాకి యగ్రశాఖకు జేర
నంతకపుడె ఋక్షమందుమీఁద
నున్నకోహో యనుచునుండ భయంపడ
వలదటంచు నెలుగు వానిఁబలికె. 26

1. పెంపుడుపక్షులను విడిచి పట్టెడువేఁట.

క. కోపించిన పులిదిగువం
జూపట్టగమీఁద నెలుగునుడియఁగ నుభయా
టోపముల కులికి పడఁకెను
భూపజుఁడడకత్తి బోనిపోఁకయు బోలెన్. 27

వ. అంతక్రిందనున్న పులి మీఁదనున్న భల్లూకంబున కిట్లనియె. 28

క. మనుజుండస్థిర చిత్తుఁడు
తనునమ్మినవారి జెఱుచుఁ దరియగు వేళన్
మనుజుండు పాపకర్ముఁడు
మనుజునివర్తనము లెల్లమాయలు సుమ్మా. 29

వ. అనిబోధించి యమ్మనుష్యునిం బడద్రోయుమనిన నయ్యచ్ఛభల్లం
బిట్లనియె. 30

క. తనునమ్మి శరణుజొచ్చిన
మనుజుని రిపునైన దుష్టమానసునైనన్
మనమున నొందుదలంపక
మనుపుట యేధర్మమనుచు మనుపుదు రార్యుల్. 31

వ. అట్లుగావున నితండెట్టివాఁడైన బడద్రోయనని నిద్రాలసుండైన
యారాచకొమరునిం దొడమీఁద నిడుకొని.........నిద్రవోయి
మేఁలుకొనినయంత భల్లూకంబతని హృదయంబెఱుఁగదలంచి నిద్రిం
చునదియుం బోలె నారాచకొమరునితోడ దలయంపిగాఁగన్నులు
మూసికొన నాశార్దూలంబు రాచకొమరున కిట్లనియె. 32

క. మృగములకును మానవులకు
నగునే చెలికార మెట్టియవసరమైనన్
మృగము (నరుమీఁద) దెగునట
మృగముపయి న్నరుఁడు దెగునిమిత్తములేకే. 33

ఆ. బల్లిదుండు గినిసిపై నెత్తి వచ్చినఁ
గ్రూరుఁడైన దన్ను జేరనిచ్చు
నతఁడు దలఁగిపోవ నప్పుడె భక్షించు
నమ్మఁదగనివాని నమ్మఁదగదు. 34

వ. అట్లు గావునఁ నీ భల్లూకంబును బడఁద్రోచి నీవును సుఖంబునం బొమ్మనిన నతఁడును నట్లచేసిన 35

క. ఋక్షంబు దిగువబడకా
వృక్షము కొమ్మదిమి పట్టి వెఱచినయతని
వీక్షించి వెఱకుమనుచుం
బక్షంబునవలికె నట ప్రభాతంబైనన్. 36

ఉత్సాహం.
పులిదొలంగి పోవుటయును భూరుహంబు డిగ్గియా
యెలుఁగువలికె రాజతనయ యేను నిన్ను గాచితిన్
గెలసి నీకు మేలు సేయ గీడు సేయ జూచితా
ఫలముచే ససేమిరనుచు బలుకుమని శపింపుచున్. 37

వ. ఈనాలుగక్షరంబుల కర్థంబెవ్వఁడు చెప్పిన వానివలన శాపముక్తుండ
వగుదు పొమ్మనెనతండును విభ్రాంతివహించి వనంబున 'ససేమిరా'
యనుచు దిరుగుచున్న తజ్జనకుండైన నందుండు దోడ్కొని చని
వీని జాల్మత్వం బెవ్వండు దీర్చిన నర్ధరాజ్యం బిచ్చెదనన మంత్రౌ
షధ విదులెల్లవచ్చి మాచేతంగాదని తొలంగిన బహుశ్రుతుం
డిట్లనియె. 38

క. అవిచార పరతవిప్ర
ప్రవరులఁ జంపించు భూమిపతులకు నఘముల్
తవులకవిఱిత్త వోవునె
యవివేకముగాదె తెలియకాజ్ఞాపింపన్. 39

తే. నరనుతుండైన శారదానంద గురువు
నిట్టికార్యంబులకు ద్రోవ యెఱుఁగుననిన
కల్లగాజంపితిని వానిగాచి నిలువ
కనినదాఁచిన మునిఁగొంచు సరుగుదెంచి 40

క. భూపతిముందటఁ బెట్టిన
నాపరమ యతీంద్రుజూచి యనియె మునీంద్రా!
నాపుత్రు వెఱ్ఱిదీర్పుము
పాపాత్ముఁడననుచు మదినిబట్టక యనుచున్ 41

వ. కుమారునినిందించి శారదానందుని ముందరనిడిన వాఁడప్పటి యట్ల 'ససేమిరా' యని పలుకుటయును. 42

క. సమరముల శత్రునృపతుల
సమయించుటగాకనమ్మి సామీప్యమునన్
శమము గనిద్రించెడుబు
ధుము నిలబడ ద్రోచుటదియు శౌర్యమెతలఁపన్. 43

వ. అనిశారదానందుండు పలికిన సవర్ణంబు విడిచి "సేమిరా" యనుచుండె ననుటయును. 44

క. సేతువు జూచినగంగా
స్రోతస్విని గ్రుంక భూమిసుర వరహత్యా
పాతకమణఁగు కృతఘ్నత
కేతీర్థమునందు గ్రుంకనేలాఁ తలఁగున్. 45

వ. అనుటయు రెండవ యక్షరంబును విడిచి "మిరా" "మిరా" యని పలుకుటయును. 46

క. మిత్రద్రోహికృతఘ్నుచ
రిత్రులు విశ్వాసపాతకికృతులా(...)భూ
...త్రాదినరకములు నా
గోత్రార్కము ఘోరదశలఁగుందుదు రెపుడున్. 47

వ. అనినమూఁడవ యక్షరంబును విడిచి 'రా' యని పల్కుటయును 48

క. రాజునురాజకుమారుఁడు
తేజము మదిగోరి రేని దేవార్చనముల్
భ్రాజితదానము హోమము
రాజసమున విక్రమంబు రక్షయువలయున్. 49

వ అనిన 'రా' యక్షరంబు విడుచుటయు తోడనే విభ్రాంతిబాసిన కుమారునింజూచి సంతోషచిత్తుండై యితండడవిలో జేసినపని యెట్లెఱిఁగితిరనిన శారదానందుం డిట్లనియె. 50

క. (దేవ) బ్రాహ్మణభక్తి
ప్రాపీణ్యున కెఱుఁగవచ్చు భావంబుననీ
దేవితోడమచ్చ దెలిసిన
భావమున నెఱయనుచు బలుక బార్థివుడంతన్ 51

వ. శారదానందునకు నమస్కరించికొనియాడి మంత్రియగు బహు శ్రుతునింజూచి యిట్లనియె. 52

క. హితవును బుద్ధియు గలిగిన
మతిమంతుఁడు మంత్రియైన మనుజేంద్రునకున్
గతియును రాజ్యముభోగ
స్థితియను గీర్తియను గల్గుసిద్ధముసుమ్మా. 53

వ. అనిమంత్రిఁ గొనియాడి శారదానందుని సర్వశాస్త్రంబు నైకొను మనుటయు. 54

క. యతివరుఁడు రాజయోగ
స్థితినాథుఁడుగాక యిట్టిక్షితినాథుండే
మతిబరికింప గననియా
క్షితిపతి దీవించి చనియె స్వేచ్ఛాగతులన్. 55

వ. అనినారదుండు యింకనొక్క యద్భుతంబు వినుమ నియబ్బలీంద్రున
కిట్లనియె. 56

క. నరుఁడెట్టి కులజుఁడైనన్
హరిచిహ్నలుదాల్చి నాట్యమాడిననైనన్
హరియుద్ధరించు వారికి
శరణంబై రాజ్యభోగ సంపదలిచ్చున్. 57

వ. అట్లుగావున. 58

క. మానవనాథుండు బృహ
త్సేనుండనువాఁడు తపముసేయగ శివుఁడా
ధ్యానమున నిలిచి పలికెన్
భూనాయక ! వరము వేడుపొసఁగఁగనిత్తున్. 59

ఆ. అనిన సంతతియును నాహవజయమును
కోరుటయును నొక్కకొమ్మపుట్టు
దివ్య పురుషుఁడట్టి తెఱవకై తనుదాన
వచ్చి పొంది నీకు వరుఁడగును. 60

వ. అతనివలన నీకు శత్రుజయంబును కులాభివృద్ధియు నగునని వరం
బిచ్చి శంకరుండరిగిన ప్రతాపవిషయాధీశ్వరుండటువంటి
కన్యకంగాంచి యది యౌవనవతియైన హరుండానతిచ్చిన దివ్య
పురుషుండెన్నఁడు వచ్చునోకోయని సౌధాగ్రంబున నిడి యుండు
నంత. 61

సీ. కాళింగుఁడనియెడు కంసాలి యొక్కండు
సౌధాగ్రముననున్న చంద్రముఖిని
గనుగొని మోహించి కదువడి గీలుగా
రచియించి శంఖచక్రములు దాల్చి
విష్ణుండని యువ్విధికి దత్తూస్త్ర...
.........వ్వనిత యున్న
సౌధాగ్రముననున్న జలజాక్షి విష్ణుండ
వచ్చితిని మూర్తి వంశుఁడనగుచు

అనిననిజ............
.....................
.........దగ్గ్రమొక్క
పితకు జెప్పిపంప నతడువచ్చి. 62

క. కాళింగుజూచి నిక్కమె
నాళీకాక్షుండె యనుచు......
బాలకి నర్పించుచుభూ
పాలుండుచని సతియు వాని పత్నై మెలగన్. 63

వ. ఇవ్విధంబునకన్యారత్నంబును భోగింపుచుండునంత 64

క. హరిదనకునల్లుఁడయ్యెన్
సరియెవ్వరు నాకటంచు జగతీప(తియున్)
...దొడగిన నభ్భూ
వరులందఱునొక్క పెట్టవచ్చిరి నృపుపై. 65

ఆ. అతనియల్లుఁడైన హరిచేతజచ్చిన
కలుఁగుకీర్తి ముక్తు లలరమనకు
ననుచు బురము దిరుగనందఱు విడిసిన
క్షితితలేంద్రుడధిక చింతనొంది. 66

సీ. తనభక్తు ప్రహ్లాదు దండిత......
...తింపకున్న నిర్గుణుండుగాడె.
ప్రియభృత్యుడైన నీ భీమణుముక్తిక
జగతినిల్పిన యవిచారిగాడె
కుచ.........మెరబలిపెండి
మాటదప్పిన యప్రమాణిగాడె

తే. యెవ్వడెటువంటివాడన్న నవ్విధంబు
చూపనేర్చిన యాబహురూపిగాడె
శత్రుమి............గతాని
హారినెటుగాగనమ్మెదు నల్లుడనుచు. 67

సీ. వ్రేపల్లెలోపల గోపకాంతారతి
............గారగాడె
తనపుత్రుడగు నరకునిజంపి
అతనినిలలనలజేకొన్న ఖలుడుగాడె
సురవైవ శిశు............
కలన్యపెండ్లి యాడినమహాపెద్దగాడె
కపట విప్రులరూపుగైకొని మాగగు
దునుమ బంచిన యట్టి దోషిగాడె

తే. కాలయవనుని ముచికుందు పాలుజేసి
చంపజేసినయట్టి దుష్కర్మిగాడె
నాకు హరియల్లుడని యెట్లునమ్మవచ్చు
విష్ణుడున్నాడు నాకని వెఱ్ఱినైతి. 68

1. [వ్రేపల్లెలోపల గోపకాంతారతి తేర జారాడినదిట్టకాడె
తన పుత్రుడగు నరకుని జంపియాతని చెలవలజేకొన్న ఖలుడుగాడె
సురవుగ చైద్యునకొనరినకన్యక పెండ్లియాడినమహాపెద్దగాడె
కపట విప్రుని రూపుగైకొని మాగధుదునుమబంచినయట్టిదోషిగాడె]

వ. అనిదుఃఖింపుచున్న నతని కూఁతురు తనపెనిమిటియగు కుహక
విష్ణుపదంబులఁ బడి యేడ్చుచు నిట్లనియె. 69

తే. అధిపవిష్ణుండు తనయల్లుఁడనుచు నస్మ
దీయ జనకుండు నృపతులధిక్కరింప
వారుబలవంతులై మీఁద వచ్చినారు
నీవు పేక్షింపదగునె యోనీరజాక్ష. 70

వ. అనినతండు ఖిన్నుండై యిట్లనితలంచుచు. 71

క. తమచేతగాని పనులకు
గ్రమమెఱుఁగక యధికుమూర్తిగైకొన జనముల్
భ్రమియింప పోనియగుమా
నము ప్రాణముబోవు నిట్టి నడకలు నిజమే. 72

ఉ. ఏవిధమాచరింతు నిక నెక్కడికింజనువాఁడ నెప్పుడుం
జావునిజంబునాకనిన సామజవత్సలు నార్తరక్షుల
క్ష్మ విభునాత్మనిల్పి యపకీర్తికి కీర్తికి హార్తకర్తయ
ద్దేవుఁడె యంచు పల్కి యువతీమణి చూడఁగబక్షివాహుఁడై. 73

చ. హరి జనుదెంచితిన్ నృపతులాజికి బాసిచనుండ పోవరే
జరతును వన్నెదప్ప కరచక్రహతిన్వడి నంచుదాకుచో
దురమున పీనివద్దనను దూఱుదురీక్షితిలోకులంచు నా
హరి యపకీర్తికిన్వెరచి యాతని చక్రమునన్వసింపుచున్. 74

క. అరినృపతుల చరణంబులు
శిరములు గరములును దునుమజెడి హతశేషుల్
మరలకపరచిరి వాఁడుం
గరివరదునికరుణ నాకు గలదని మగిడెన్. 75

వ. అట్లు చనుదెంచిన బృహత్సేనుఁడల్లునకు సాష్టాంగదండ ప్రణా
మంబొనర్చి యప్పటి యట్లసేవింపుచుండె గావున. 76

క. దైవము కృపగల దినముల
(భావింప) గద్దృణము కనక పర్వతమగు న
ద్దేవుని కృపయే తప్పిన
దేవాద్రియు జిన్నతృణము తెరఁగై యుండుఁ. 77

వ. అని నారదుండు చెప్పిన నబ్బలీంద్రుం డిట్లనియె. 78

ఆ. విక్రమార్క (భూమి) విభుఁడు బేతాళుని
గట్టి తెచ్చెననుచు గథలుచెప్ప
వినుచునుందు నెట్టివిధమునఁగొని తెచ్చె
నానతిమ్ము వల్లకీనినాద. 79

వ. అనిన నిట్లనియె. 80

సీ. విక్రమార్కుఁడు జగద్విఖ్యాత సత్కీర్తి
జగముపాలించెడు సమయమునను
క్షాంతిశీలుండను సంయమి నిత్యంబు
నొకపండు నృపతికి నుపద నీయ
నంతట నొక్కనాఁడమ్మౌని యిచ్చిన
ఫలము వానరు మీఁద బడగ వేయ
నది మర్కటము విప్పనందులో నొకమణి
కనుపట్టుటయు ధరాకాంతుఁడాత్మ

తే. నద్భుతముబొంది మునిదెచ్చునవియు జూడ
నట్లనైయున్న యతికి నిట్లనియె నృపతి
యేమియర్థించి తెచ్చితిరిట్టిమణులు
చెప్పుమనుటయు నిట్లని చెప్ప దొడఁగె. 81

తే. వచ్చు కృష్ణచతుర్దశీ వాసరమున
నర్థరాత్రంబు నాకడ కరుగుదెంచి
పితృవనముననే జేయుకృతికి నీవు
సాధకుండవుగమ్ము భూజనవరేణ్య. 82

వ. అని చనుటయు నారాత్రి యతనికడకుంజని యతని యనుమతి
మానస్థుండయి దన్ని కటవట జటలోఁదగిలి తలక్రిందయి వ్రేలు
చున్న బేతాళునింబట్టి కట్టి మూపున బెట్టుకొని వచ్చునప్పుడు. 83

క. బేతాళుఁడనియె వినుమో
భూతలవర మనకును బుసుపోకకుకథలా
ఖ్యాతముచేసెద బ్రశ్నో
పేతంబుగ నుత్తరంబులీవలయుజుమీ. 84

వ. ఆప్రశ్నలకెఱింగి యుత్తరంబీకున్నవజ్రాయుధంబు తలద్రెంచు
ననుచుగథజెప్ప దొడఁగె నదియెట్టిదనిన. 85

సీ. (కర్ణోత్పలం) బనఁగల దొక్క నగరంబు
తత్పురివరుఁడు ప్రతాపముకుటుఁ
డను రాజువానికి నాత్మజన్ముఁడు వజ్ర
మకుటుఁడునను సుకుమారమూర్తి
తన్మంత్రి పుత్రుండు దారుండు బుద్ధిశ
రీరుఁడాతఁడు సహచారిగాఁగ
విపినంబునకు వేటవెడలి తన్మధ్యకా
సారంబునను నొక్కజలజవదన

తే. యంబుకేలి జరింపనయ్యధిపసుతుఁడు
మదన పరవశుఁడగుచు నాసుదతిజాడ
లలనకరకమలమున కమలము డిగిచి
జిలుగుశృంగార చేష్టలు చేయదలఁచి. 86

వ. కమలద్వయంబుకర్ణద్వయంబుమోపివుచ్చి[1] దంతంబుల ఖండించి
చరణయుగళంబునవైచి మఱియొక్క కమలంబు కుచంబులనదిమి
కంపించి తలయూచి పురంబున కరిగిన వజ్రమకుటుండవ్విధంబు
సచివపుత్రునకుం జెప్పిన నతండిట్లనియె. 87

---

1. మూపివుచ్చి.

సీ. శ్రుతులనంబుజములు సొనుపుట కర్ణోత్ప
లునిపురంబున నాకునునికి యనుట
వనజంబుదంత ఖండన మొనర్చుట దంత
ఘాతకమంత్రిప్రసూతి ననుట
పద్మంబు తన పాదపద్మంబులకు మోప
నాత్మనామంబు పద్మావతనుట
యంబుజముకుచస్థలంబున నదుముట
తన(కుసీ)వే ప్రాణనాధుఁడనుట

తే. కంపమొుదుట నావెంటగదలుమనుట
తలగదల్చుట గూఢ వర్తనములనుట
యనుచు నెఱిఁగించి యమ్మంత్రి యధిపుగొనుచు
నరిగెరత్నావతి నియెడు పురమునకును. 88

వ. చని యొక్కభూసురవృద్ధాంగన గృహంబున వసియించి యది
తదంతఃపురవర్తిని యగుట యెఱిఁగి యొక్కనాఁడా యవ్వంబిల్చి
తమవృత్తాంతంబు పద్మావతి కెఱిఁగింపు మనిపంపిన. 89

ఉ. ఆవిధవాశిరోమణి రయంబుననేఁగి రహస్యవేళ ప
ద్మావతిగాంచి రాజసుతుఁడాడిన మాటల భంగిచెప్పల
జ్జావతి [1]ఘృష్టలిప్త(?) ఘున సారకరంబిత గండపాలికల్
వావిరివేసినన్ జరతవామ విలోచనవచ్చి దుఃఖయై. 90

క. యెన్నఁడునాపై నలుగని
కన్నియమీమాటచెప్పు గనభడరిననే
మిన్ననక వ్రేసెఁజెక్కులు
నన్నని చూపుటయు నృపతినందనుఁడాత్మన్. 91

వ. విరహాభరాక్రాంతుఁడై యుండ మంత్రిసుతుండిట్లనియె. 92

1. ఘుర్మలిప్త.

తే. కానుపింపదె శుక్లపక్షంబు పదియు
దివసములదాక నిచటకే తేరవలవ
దనుచు ఘనసారయుత మృదుహస్తములను
సౌంజ్ఞచేసిన యదిగాని చెరవుగాదు. 93

వ. అనిన నూఱడిల్లి యప్పది దినంబులుగడపి పదునొండవనాఁ డెప్ప
టియు నా విశ్వస్త నొడంబరచి చెప్పుమనిపంపిన నది యట్లచేసిన. 94

క. అమ్మగువ కుంకుమలదుచు
నమ్మదు నలియురమునందు నంకితములుగా
ముమ్మడిరేఖలు నిలుపుచు
బొమ్మన్ననువచ్చి నృపతి పుత్రునకనియెన్. 95

తే. ఎన్నిమాటలు చెప్పిన నియ్యకొనదు
మాఱుమాటాడ దింకనే మతమొకాని
కుంకుమాంకిత మృదుకరాంగుళుల నురము
వ్రేసెననిచూప భూపతి వివశుఁడైన. 96

వ. బుద్ధిశరీరుం డిట్లనియె యిట్లేల పగవశుండవైతివి కారజస్వలను
దివసత్రయానంతరంబునం జనుదెమ్మని పట్టించుమనిన వర్థాంగి
కారంబున నుండెనంత 97

తే. దివసములు మూఁడు నరిగిన తెరవగరపె
యనుపుటయుఁబోయి యెఱిఁగింప నంగనకును
పొత్తిచీరిచ్చి యిఁక రాకు పొలఁతి యనుచు
మూఁడు నెక్కించి త్రాట నమ్మగువడించ 98

వ. అరుగుదెంచి అవ్విధంబు జెప్పిరండని యరిగినమంత్రిసూనుండు
రాజకుమారునిం జూపి నీకు నాగమనమార్గంబు నిర్దేసించెననియె
నంత. 99

1. చేసినదిపక్ష్మ యదిగాని చెలుపు గాదు.

క. రవిగ్రుంకి మధ్యరాత్రం
బవుటయురజ్జువుగదల్చి యమ్మార్గమునన్
యువిద బోడగాంచి మదనో
త్సవలీలల మెలఁగుచుండె చతురత మెరయన్. 100

వ. ఇవ్విధంబున పద్మావతీ పరాయణుండై వజ్రముకుటుండు మంత్రి
సుతుండైన బుద్ధిశరీరుని మఱచియుండు నాసమయంబున నొక్క
నాఁడు. 101

క. కులమును నాచారంబును
చెలికానిని గురువు బుత్రు జేరినవానిన్
తలిదండ్రుల బాంధవులను
తలఁపరు కామాంధ జనులు తత్పరవృత్తిన్. 102

తే. అనుచుపద్యము లిఖయించి యతివచేత
ననుప భూపతిసుతుఁడు పద్యంబుచదివి
మఱచితిని మంత్రిసుతుని నీమర్మమెల్ల
నాకు నెఱిఁగించి నట్టివివేకనిధిని 103

వ. అనినఁ బద్మావతి యిట్లుబుద్ధిశరీరుని యిన్నిదినంబులుదాక యెఱిఁ
గింపకిట్లేల చేసితివని భక్తిగలదియును బోలెనొక్కనాఁడు. 104

ఆ. భక్ష్య భోజ్య లేహ్యపానీయ చోష్యప
దార్థములను గరళమావహించి
మంత్రి సుతున కనుప తంత్ర మాతఁ డెఱింగి
తగరుకిడిన జచ్చెతన్ని గొనుచు 105

వ: అవ్విధంబున వజ్రముకుటునట్లు గలిఖించి (?) పద్మావతిహారంబులు
పుచ్చికొని స్తనమధ్యంబున నఖక్షతత్రయంబు నిలిపిరమ్మని పత్రిక
పంపిన నారాజకుమారుండు అట్లచేసి యేతెంచుటయును. 106

ఆ. అంతఁ దెల్లవార నామంత్రిపుత్త్రుఁడు
సిద్ధుఁడగుచు నృపుని శిష్యుఁ జేసి
పురము రుద్రభూమి యిరవుగాఁ గూర్చుండి
హారమమ్మ నృపకుమారు బంప 107

దోదకము :

అంగడిహారము లమ్మెదననుచున్
సంగతిగా వెడజట్టులు సేయన్
దొంగనిబట్టిన దోడ్కొనిపోయు
య్యంగని పించిననాతఁడు వల్కెన్. 108

క. మీభూపతి యరుదెంచిన
నీభావము చెప్పవాఁడ నిట తెండనిరన్
భూభుజున కెఱుక చేసిన
నాభరణము చూదివచ్చె నాతని కడకున్. 109

సీ. వచ్చియీభావంబు వచియింపు మనవుండు
దంతఘాటకునకు దనయుయగుచు
యీప్రేత భూమికి నేతెంచి నిశివేళ
శవభుక్తిగొనుచు నాసన్నిధికిని
వచ్చినమాచేతి వాడిశూల మునహ్రా
ద్భేదంబుచేసి యీపేరు పుచ్చు
కొంటిమి యదిమహా క్రూరపు పడుచుల
.........పెద్దలబట్టి మొసఁగు

తే. కంటిగనుగొందు నురమున గానవచ్చు
యనివజనిచూచి యదినిక్కమనుచు బురము
వెడలగొట్టింప నదియును వెళ్ళిపోవ
గూడుకొని యాత్మపురికిని గొంచుజనిరి. 110

ఆ. దంతఘాటకుండు తనయుకుదుఃఖంచి
(?) చచ్చిన తనిసతియు జిచ్చుచొచ్చె
పాపమెవ్వరికిని బ్రాపించు ననవుఁడు
ననియె సాహసాంకు డాత్మ దెలిసి. 111

వ. బుద్ధిశరీరుండు స్వామిహితంబునకు గపటంబుచేసిన దోషంబులేదు అవిచారంబున నారాజు ప్రధానినందనను వెళ్ళగొట్టించెంగావున నాప్రధాన మరణదోషంబు రాజునకు ప్రాప్తంబగునని పలికిన మరలివటంబునకు బరచి యప్పటియట్ల వ్రేలుచున్న నివ్విక్ర మార్కుండు. 112

క. వెంటనెచని బేతాళుని
నంటంగాబట్టి తొంటియట్లన చనుదే
నొంటిజన దెరువుజరగదు
వాటికి[1] గథయొకటిగలదు వినుమనిపలికెన్. 113

సీ. బ్రహ్మశంఖాగ్రహారంబున నగ్నిహో
మీయుని నందనమీన నయన
మందారవతియను సుందరి వరియింత
మని విప్రనందను లరుగుదేర
నంతనక్కన్య కాలాంతంబు నొందిన
విడిచిపోవఁగలేక విప్రులందు
నొకఁడస్థిగొనుచు గాశికినేగె నొక్కండు
కాటిబూడిద భక్తిగాచియుండె 114

తే. యొకఁడు దేశాంత్రియై చని యొక్కవిప్రు
నింట భుజియింపనున్న నాయింటిగృహిణి
కొడుకు గోపించి యయ్యగ్నికుండము నను
వైచుటయు మృతినొందిన వానిజూచి. 115

1. వింటే.

క. శిశుహంతవురీ గృహమున
వశనము భుజియింపననిన నతివచికిత్సా
వశమున బ్రాణమువడసిన
శిశువుంగని భోజనంబుచేసిట్లనియెన్. 116

క. ఈ సంజీవనినాకి
మ్మోసరసిజనేత్రయనిన నుపదేశించెన్
భూసురుడదిగొని కాశీ మ
హీసురునిం గూడి శవముహీస్థలిఁ జేరెన్. 117

ఆ. అట్లుచేరితొల్లి యచ్చట గావున్న
భూసురుండుచూడ భూమిమీఁద
సిద్ధమంత్రజలము చిలికినఁ గన్నియ
బ్రదుకుటయును చెట్టవట్టియవుడు. 118

క. ముప్వురు తమతమ నలియని
చివ్వకు బెనగుదురు రాజశేఖరయది దా
నెవ్వనికి బ్రాప్తమగునన
నవ్విక్రమసూర్యుఁడనియె నాతనితోఁడన్. 119

తే. అస్థిగొని చన్నవాఁడు తదాత్మజుండు
ప్రాణమొత్తిన విప్రుఁడప్పుణఁతి తండ్రి
కాటఁగావున్నద్విజుఁడె యాకాంత నాథుఁ
డనిన బేతాళుడప్పుటి యట్లయరిగి. 120

వ. పట్టితెచ్చునెడ నిట్లనియె. 121

సీ. వాలిపుత్రాఖ్యమౌ పట్టణమ్మునను వి
క్రమసింహుఁడనెడి ధరాధిపతికి
నాత్మసంభవుఁడు పరాక్రమకేసరి
యను నాతఁడొకచిల్కఁ బెనుపనదియు

నాగకాలీతమనాగతంబు నెఱింగి
విరచింపనేర్చు వివేకశాలి
నడిగె నాకింకఁ బ్రియాంగన యెవ్వతె
యనిన మాగధరాజతనయ చంద్ర

తే. కాంతయనుకన్యయనుచు శుకంబుచెప్పె
నట్లుమగధేశు సుతయుతానాడు జిలుక
నడుగ, జెప్పెఁబరాక్రమ హరియటంచుఁ
బెద్దలంతట నిరువురఁబెండ్లిసేయ. 122

వ. నాచంద్రప్రభయుం బరాక్రమకేసరియుం గ్రీడాగృహంబున రతి (పరాయ)ణులై యున్న సమయంబునఁ బంజరద్వయంబుననున్న కీరద్వయంబునందు రాచిలుకశారికంజూచి యిట్లనియె. 123

ఉ. ఊరకయేలయుండ మనమోహకరత్నమ యస్మదీయ సం
చారవినోదముల్ కలసి సల్పుదమన్న తలంకుచున్నచో[1]
కీరమపూరుషుల్ బహులకల్పితచారుల సత్యభామణుల్
క్రూరులువారితోఁడ నొనఁగూడి మనంగలరే వధూమణుల్. 124

వ. అని విడనాడినకీరంబు శారికంజూచి యిట్లనియె. 125

చ. తరుణుల నమ్మవచ్చునె వృథాకలహాత్మలు కల్మషక్రియా
భరితలు చంచలాత్ములు కృపారహితల్ పరభోగవిభ్రమా
భరణలుమానదూరలును భావవిహీనలు క్రూరకర్మ ని
ష్ఠురబహుభామణల్ కలయఁజూచిన దోషమురాకయుండునే. 126

క. అని యిరువురు వాదడవఁగ
మనుజేంద్రుఁడుచేరి వాదుమానుఁడు మీ వ
ర్తనములు చెప్పుండనవుఁడు
ననియెన్ శారికమహీవరాత్మజుతోఁడన్. 127

1. తలంకెదారి యా.

సీ. అంతిపురంబున నర్థరథుండను
వైశ్యపుత్త్రుఁడు ధనవంతుఁడనెడు
నతఁడాత్మ భార్యలోకాంతరమరిగిన
విటవిదూషకవృత్తి విత్తమెల్ల
బోకార్చుకొని సర్వభూములు దిరుగుచు
నందనపురమను నగరిచేరి
యందుహాటకగుప్తుఁడను వైశ్యుఁడాత్మజ
బింబోష్ఠి నతనికి బెండ్లిసేయ

ఆ. ....................
బ్రియముచెప్పి యింటబెట్టుకొనిన
నతఁడు కొన్నిదినములరిగినఁ దనపత్ని
నమ్మఁజూపి తెత్తుననుపుమనిన. 128

ఆ. కొడుకు మారుగాఁగ గోరినాయింటిలో
పెద్దతనముచేత బెట్టుకొంటి
ననుచు దుఃఖపడిన నాతని నమ్మించి
యెల్లివత్తుననుచు నిచ్చగించె. 129

వ. అల్లునిం గూఁతును ననేకవస్త్రాభరణ భూషితులఁ జేసి యొక్క దాసినిచ్చి యనిపిన పత్నీసహితుండై చనుచుండి యొక గహన మధ్యంబున న య్యాభరణంబు లన్నియుం బుచ్చుకొని తన భార్యను నద్దాసిని నొక్క ప్రానూఁతంబడంద్రోచి యెందేనియుం జనుటయు. 130

క. ఇరువురును మొఱలువెట్టఁగ
దెరువరులరుదెంచి పెద్దతీఁగలచేతన్
దరుణిని వెడలఁగ దివియుచు
మఱిదాసిన్ దివియఁబోవ మరణమునొందెన్. 131

వ. ఆవైశ్యకన్యకయుఁ బధికులంగూడి పితృగృహంబున కేతెంచినం దలితండ్రు లాశ్చర్యచిత్తులై పోయినచ్చిన తెఱంగెఱిఁగింపు మనిన నిట్లనియె. 132

క. నట్టడవిలోన మమ్ముం
బెట్టినసొమ్ములు హరించి పెదపెద దొంగల్
కట్టిమము నూఁతఁద్రొబ్బుచు
నట్లేనీ యల్లుఁగొనుచు నరిగిరి తండ్రీ. 133

వ. అనినయల్లుండు చోరులచేతఁ దగులువడుటంజేసి వణిజుండు దుఃఖంబుననుండె నంతఁగొన్ని దినంబులకు నాసొమ్మంతయు నెచ్చించిధనవంతుఁడు తనమామకుఁగూఁతురు చావుచెప్పి తత్పరలోకక్రియార్థంబు కొంతధనమ్ము పుచ్చుకొందలఁచి మామగృహంబునకు వచ్చునపుడు 134

ఆ. ఇంటిలోనవెలుఁగు నిందునిభాననఁ
బత్నిఁజూచి డిల్లపడిన నింతి
వెఱవకుండునీదు వివరంబు మాయయ్య
యెఱుఁగడనుచుఁ గాళ్ళకిచ్చెనీరు. 135

వ. మామయు నల్లునిరాకకు సంతోషించి తొల్లిటియట్ల కలవుకొని యుండు నంత, 136

ఆ. కొన్నిదినములరుగ నన్నిచవర్తనుం
దర్ధరాత్రినిద్ర నబలపొంద
తొడవులెల్ల గొనుచుమెడగోసి యెంజేనిఁ
బోయెనేమిచెప్పఁ బురుషుననియె. 137

వ. అనినరాజకుమారుండు తనశిరంబు జూచి నీవేమి చెప్పెదవనిన నచ్చిలుక యిట్లనియె. 138

సీ. హర్ష పురంబున కధిపతి ధర్ముండు
వసుధ యేలఁగ ధనవంతుఁ డనెడి
కోమటిగారావు కూఁతురు వసుమతి
కోమలి నొక వైశ్యు కొడుకుకిచ్చి
తనకుఁ బుత్రుఁడు లేమి తనపుత్రి యింటనె
యుండఁగ కన్యదా యువతి యగుచు
నొకవిప్రతనయుతో నొనగూడి మెలఁగఁగ
నంతనప్పతివచ్చి[1] యుత్తమామ

తే. లల్లుఁ డొద్దకుఁ గూఁతును ననుపుటయును
నధిపుఁగవియుక నిద్రితుండైన తఱిని
బ్రాహ్మణుండున్నచోటి కబ్భామునడచె
తస్కరుఁ డొకండు వెంటనె తగిలి చనఁగ. 139

వ. ఉద్యానంబు ప్రవేశించు నంతకుమున్న యవ్విప్రుని జోరులుమ
క్కించినం గొనప్రాణములతోనున్న విప్రకుమారుని గాఁగిలించు
కొని చుంబింపంబోయి న నతండు ముక్కుఁ గరుచుకొని మరణంబు
నొందిన నింటికివచ్చి మగండు ముక్కుఁ గోసెనని కుయ్యి వెట్టుట
యును, 140

క. నేరం బెఱుఁగని మత్పతి
క్రూరుండై మగఁడు ముక్కుఁ గోసె నటంచున్
భూరమణున కెఱిఁగించిన
క్ష్మారమణుఁడు వైశ్యపుత్రు జంపఁగ బంపెన్. 141

ఆ. దొంగ నృపతి కనియె దోషిగాఁ డితఁడు
ద్విజశవంబుతోడ వెలఁది పెనఁగ
ముక్కుఁ గరచి ప్రాణములఁ బాసె విప్రుండు
వానినోటఁ జిక్కె వనిత ముక్కు 142

1. రాఁగ.

వ. అని విప్రశవ వదనంబుచూపిన భూరమణుండు కోపించి యజ్జారిణికి కర్ణచ్ఛేదనంబునుం జేయించి యా చోరుణకిం దళవాయిపట్టంబు నిచ్చెనని కీరద్వయంబునుం గథలుచెప్పి శాపముక్తులై చనిరి స్త్రీ పురుషులలో పాపంబెవ్వరిదని యడిగిన. 143

క. వనితలకు సాహసంబును
ననృతంబును మూర్ఖతనము నదయతయును న
ర్మనమును మాయయు ఖలవ
ర్తనమును నిస్స్నేహితయును దప్పనిగుణముల్. 144

వ. పురుషుండు పాపభీరుండయ్యును పాపంబునకు జొచ్చెంగావున పురుషుండె పాపకర్ముండనిన బేతాళుండప్పటియట్ల న్యగ్రోధంబు నాశ్రయించిన పట్టి తెచ్చునెడ నిట్లనియె. 145

సీ. శరభాంకపురియేలు శూద్రకుండనురాజు
సోమప్రభానామ ముదతిదనకుఁ
బత్నిగాధర యెల్లఁ బాలింప మాళవ
ధరణివిప్రుఁడు వీరవరుఁ డనంగ
కరవాలధారియై యరుదెంచి శూద్రకు
చేజీతమంది యిచ్చిన ధనంబు
దేశభూదేవతా తిథియాచకులకురూ
కలుచతుశ్శతము నిక్కముగనొసఁగి

తే. యున్నరూకలు నూటగృహోచితంబు
తీర్చునే నూరురూకలు దినదినంబు
నృపతివెట్టంగ బగలురాత్రియునుగొల్చి
నిద్రయెఱుఁగక యుండు దానేర్పుమీరసి. 146

వ. అంతనొక్కనాడర్ధ రాత్రసమయంబున. 147

లయవిభాతి :

మెఱపులును నుఱుములును దఱచుపడగండ్ల
బైదఱచుపిడుగులు దొరఁగ నఱిమితి జగంబుల్
గిఱిగొనగ వాన వెఱచరవఁబవనాహతిని నుఱక
కుఱియంగ దిశలెఱుగఁ బడకుండఁగా
తెఱపిగొనలేక కనుగొఱవులగతిఁ జనము
లుఱక మిఱుపల్లములనుఱికి పెనుబాటన్
బొఱలఁగ బశువ్రజము లొఱలఁగ ధరిత్రిపయి
దఱచుగనువాన వెనుచరచి వడిగురియఁగా. 148

మత్తకోకిల :

భూతమొక్కటి యూరివెలుపల భోరుభోరున నేడువన్
భూతలేశుఁడు మేడవాకిలి భూమిఁ గాచుక యున్నవాఁ
డాతనింగనియుడుగ విప్రుఁడనాయుధోద్ధత హస్తుఁడన్
వీతభీతుఁడనున్నవాఁడను వీరవర్యుఁడ నావుడున్. 149

తే. పురము బహిరంగణంబునఁ బొలఁతియొకతె
యడలుచున్నది పోయినీ వరయుమనిన
వీరవరుడరిగి యాయేడ్చువెలఁది బిలిచి
యెందుకడలెదవనిన నయ్యింతివలికె. 150

వ. ఏనీశూద్రకభూపాలు భుజంబున వసించిన భూదేవిని యతండు
మూఁడుదినంబులకు మృతుండు కాఁగలఁడు ఇతనిపిదప నన్యునాశ్ర
యింపనొల్లక యేడ్చెదననిన వీరవరుండిట్లనియె. 151

క. ఈతండతిదీర్ఘాయురు
పేతుండగు వెఱవునద్ధిపృథివీ వనితా !
నాతోడ నానతిమ్మన
భూతన్వియు (బలికెవిప్ర పుంగవుతోఁడన్) 152

తే. ఈ మహాశక్తికిని భవదీయసుతుని
శిరముబలియీయఁ బతిచిరంజీవియగును
సేయుమనవుండు నింటికిఁబోయినంత
సునకు నెఱిఁగింప సమ్మతించిన నతండు. 153

వ. పుత్రునిందోడ్కొని యరుగువాని తల్లియుం జెల్లెలును తోడన
యరుదేర నమ్మహాశక్తిగుడికరిగి యిట్లనిస్తుతియించె. 154

వనమయూరము :
అంబికకృపాత్మ (జగదంబ) శుభమూర్తీ
కంబునిభకంఠ! శశికంధరుని రాణీ
బుంబరవిపక్షకులశక్తి పరమూర్తీ
అంబుధర (వర్ణ! నిను) నాత్మభజయింతున్. 155

వ. అని కరవాలంబున కఠంబుదునిమినం దల్లియును సహోదర మర
ణంబు సహింపనోపక చెల్లెలును ప్రాణంబులు విడిచిన నవ్వీర
వరుండు.

క. కరవాలధారచే దన
శిరమును ఖండింప వెనుకఁ జేష్టలుచూడన్
జరి(యించెదుపతి) వీనికి
సరిగలఁడే భృత్యుఁడనుచు సాహసమొదవన్. 156

ఆ. ఇట్టి బంటులేని యీరాజ్యమేటికి
నను(చుఖడ్గమెత్తి) యాత్మశిరము
తునుమదలఁచునంత దుర్గప్రత్యక్షమై
నలువురకును ప్రాణములు (ఘటించె). 157

వ. శూద్రకుండును వారెఱుఁగకుండ నాత్మనదనంబునకుం జనియె వీర
వరుండును ఆముప్వార (నింటికనివితాను) భూపతి ద్వారంబుగాచి
కొని యుండునంత ప్రభాతంబగుటయును. 158

క. వీరవరుఁజూచి శూద్రకుఁ
డారాత్రిది యేడ్పువివరమది యెట్టిదినాన్
భూరమణ యొకపిశాచము
దారోదన మదియునడఁగెనన చెప్పుట(యున్). 159

వ. అతనివలన సంతోషించి యారాత్రి వృత్తాంతంబు నమాత్యుల
కెఱిఁగించి యతనికి మఱియు ననేకపదార్థంబులిచ్చి (పుచ్చి రాజ్య
మ్మునేయు)చుండె నని చెప్పి బేతాళుం డిట్లనియె. 160

క. ఈ యేవ్వురిలో సాహస
మేయతనిదియన్న భటునకిది ముఖ్యము, భూ
నాయకుఁడు దెగదలంచుట,
నీయందఱియందు నధికుఁడితఁడని పలుకన్. 161

వ. ఎప్పటియట్ల తిఱిగి పరచినం బ్రతిక్రమ్మరం దెచ్చిన బేతాళుండిట్ల
యంగదేశాధిపతి (కడకు) విష్ణుస్వామి యనువతని సుతులు ముగ్గురు
వివేకనిధానులు గొలువంబోయిన మీరేమిటి కెఱుఁగుదురనిన
భోజనశయనారీవారి సంగులమనిన నభ్భూపవరుండు. 162

క. భోజనసంగునకును దగు
రాజనమన్నంబు వెట్ట బ్రాహ్మణసుతుఁడ
బ్భోజన మొల్లకడించెను
వ్యాజంబునఁ గమరుకంపువలచిన దనుచున్. 163

వ. (భూపాలుండు) వీని పరీక్షించునపుడు స్మశాన క్షేత్రంబున పండిన
ధాన్యంబని యెఱింగి సంతోషించె మఱియును. 164

క. నారీసంగునికడ కొక
నారీమణిబంప కామ్పనం బడుపోటన్
చేరంగనీక దానిని
వారించెను మేకగదరువలచినదనుచున్. 165

వ. .......... భూపాలుండు పరామర్శించుచునప్పుడు మేకచన్ను
గుడిచి పెఱిగినదని విని విస్మితుండయ్యె మఱియును. 166

క. శయ్యాసంగునకొక మృదు
శయ్యాస్థలి చూపనందు శయనించెడుచో
శయ్యాధస్థల రోమం
బయ్యెడ మేనొత్తె ననిన నదియును నడుగన్. 167

వ. ఆభూపాలుండు వాని శరీరంబుననున్న తదీయలాంఛనంబుచూచి
ముగ్వురసంతోషించియేలె, ముగ్వురియందును సుకుమార వివే
కులెవ్వరని యడిగిన విక్రమార్కుం డిట్లనియె. 168

క. వని తాసంగుడును భో
జనసంగుడు బుద్ధిచేత సాధించిరి శ
య్యానుక్రింద నున్న రోమము
తనులాంఛనమగుట నధికతమ మన్నిటిలోన్. 169

క. పుటమెగసి మూపుడిగి య
చ్చటికిన్ బేతాళుడరుగ జనపతి చనియు
ద్భట వృత్తిబట్టి (కొనిరా)
(నటనొక) కథచెప్పదొడఁగె నద్భుతభంగిన్. 170

వ. అదియెట్టిదనిన. 171

సీ. ఉజ్జయినీపురి నొక్క విప్రుఁడుహరి
స్వామి, వేదస్వామి నామసుతుని
సోమప్రభానామసుతను గాంచిననది
వయస్సైన దగువట్టి వరుని వరయ
జ్ఞానియు మఱియు విజ్ఞానియు శూరుండు
ననువారు ముగురు దత్తనయనడుగ
జ్ఞానికిఁ దండ్రి విజ్ఞానికిఁ దల్లియు
శూరున కక్కన్న సోదరుండు

ఆ. నిత్తమనుచువారి నింటికి గొనివచ్చి
యొకనికిత్తమటివ కొకఁడు వరుఁడు
గాక, యనుచు దెంపలేక, వాదువంగ
నైదు వాసరంబు లరుగుటయును. 172

క. ఇవ్విధమున ముప్పూరునా
ముప్పూరకును గన్యనుడిగి ముదముడిగినచో
నవ్వనితనొక్కరక్కసుఁ
డువ్వెత్తుగ గొంచు బోయెనొకగిరిగుహకున్. 173

వ. ఇట్లు పోయింజననీజనకసహోదరు లతిదుఃఖితులయిన జ్ఞాని తదీయ
మార్గం బెఱింగించె విజ్ఞాని రథమలవరించెనంత. 174

క. శూరుఁడు రథమెక్కి మహా
వీరుని రక్కసుని దునిమి వెలఁదిని దెచ్చెన్
వీరలలో నెవ్వఁడు క
న్యారమణుండనిన శూరుఁడని యెఱిఁగించెన్. 175

వ. తిరిగి నం బట్టితెచ్చు నెడ నిట్లనియె, మాలావతీ పురంబున ధవళుం
డను రజకుండు కోడలిందోడి తేర కొడుకుంబంపిన నతండత్తవా
రింటికింజని తత్సహోదరుండనుపరా, భార్య ననిపించుకొని వచ్చు
నప్పుడు. 176

చ. తెరువునఁ నున్న దుర్గగని దేవికి మ్రొక్కిన మ్రొక్కు దీర్ప భీ
కరకరఖడ్గమెత్తి తనకంఠము ద్రెంచిన, దేవరుండు నా
కరమున నాత్మమస్తకము గ్రక్కున ద్రెంచిన జూచి దుఃఖయై
తరుణియు నాత్మకంఠమునఁ ద్రాడుగ దల్పగ నంత దేవియుఁ. 177

క. మెచ్చితి బలిఁసోదరులకు
నిచ్చితి ప్రాణములు వీరి యీబొందులపైఁ
దెచ్చితలలదుకు మనవుడు
నచ్చేడియ వీడుపడగనతికె శిరంబుల్. 178

క. పెనిమిటితల, యనుజునకును
పెనిమిటికిని ననుజతలయు బెరశినవారు
బ్బున లేచి నిల్చిరిద్దఱు
వనరుహాముఖి పెరఁగుపడియె వరుఁడెవ్వఁడొకో ? 179

వ. అనియడిగిన "సర్వస్యగాత్రస్యశిరః ప్రధానం" బను వాక్యంబు
గలదు గావున శిరంబున్నవాఁడె యింతికి వరుండగునని బేతాళుం
డెప్పటియట్ల చనినం బట్టితెచ్చు నెడనిట్లనియె. 180

సీ. రమణిఁ బ్రలిప్తపురం బేలుచుండు సిం
హుండను భూవరుఁడొక్కనాఁడు
వేఁటగాజని ఘోరవిపిన మధ్యంబున
క్షుత్పిపాసలఁజిక్కి సొగయుచున్న
కార్పటికుండను గహనచారుఁడు చేరి
యామలకద్వయం బందియిచ్చి
తెరువుదప్పినదెచ్చి తెరువుచూపిన మెచ్చి
యొద్దినీ వాంఛితమిత్తుననిన

తే. గాలనేమితనూజ పాతాళసిద్ధ
కనకపురమునను్న తక్కన్యదెచ్చి
పెండ్లిసేయుమునాకు నభీష్టమిదియ
యనిననగుగాక యనియె ధరావరుండు. 181

క. కలమెక్కి యరిగి, భీకర
జలనిధిలో నురికి, నాగజగతికిజని, యు
త్పలనేత్ర కనకరేఖను
బిలమున్వెడలించి హితునిబెండిలిచేసెఁ. 182

క. ఉపకారపరునకునుఁ బ్ర
త్యుపకారము సేయఁడేని నుర్వి గృతఘ్నా
ద్యుప పాతకములు దగులును
కపటుండని భూజనంబు గైకొన రతనిన్. 183

వ. అట్లుగావున నిందు నెవ్వరిదుపకారంబనిన నిష్కారణం బుపకా
రంబుచేసిన కిరాతుం డధికుండనిన నప్పటియట్ల బేతాళుండు వట
విటపికింజనిన బట్టితెచ్చు సమయంబున నిట్లనియె. 184

సీ. లక్షణపురమేలు లఘుభుజుండను రాజు
తనకూఁతు మణిరేఖ దగిన పతికి
నిచ్చెదనన నొకయిలతేఁడు చనుదెంచె
జంతుభాష లెఱుంగు శాస్త్రవిదుఁడు
వానికిచ్చినఁ గన్య వరియించి తనభూమి
కరిగి రాజ్యము సేయ నవసరమున
సతియును దానొక్క శయ్యపైఁ బవళించి
యున్న పిపీలికాయూధ మొకటి

ఆ. యరుగు దేరఁ బథము కడ్డమై మంచము
కోడు నిల్చియున్నఁ గొంత భటుల
కనియె జీవనాయుఁడది యేల నిలిచితి
రన్న, శయన చరణమున్నదనిన. 185

క. అదిరొ త్త్రిపైచి కొనుచుం
బడడనొక, సతియు, బతియుఁ, బడియున్నారె
త్తుదువొ, వలదో, యనవుడు
జ్జైదురునకును నృపతినవ్వసతి యిట్లనియెన్. 186

వనమయూరము :

ఏమిటికి నవ్వితిమహీశ ! యని పల్కన్
రామ యిదిచెప్పఁగొనరాదనిన నాపై
ప్రేమముడివోయె నిక బెట్టుకొనియుండన్
నామనసుఁ, బ్రాణమునునాథ ! యనిపల్కెఁ. 187

ఆ. చెప్పకున్న నీవు జీవంబువిడుతువు
చెప్పినవుడె నాకు జీవహాని
చెప్పిమున్ను నేను జీవంబువిడిచెద
నీవు దన్నపిదప నిలువలేను. 188

వ. అని స్మశానంబునం జితిబేర్పించుకొని యందు మీఁదం బవ్వళించి
పత్నికెఱింగించి ప్రాణంబు విడిచెదనను సమయంబున. 189

తే. ఒక్కచింబోతు తనమేకనుపచరించి
తన్ను బ్రార్థించి నూఁతిలోనున్న గఱిక
తెచ్చియిడుమన్న నూఁతిలోఁ జొచ్చినపుడె
చత్తు, నీవేలనాకని చనియె దొలఁగి. 190

క. మతి నెఱిఁగి భూమిపాలుఁడు
చితినుండక లేచివచ్చి చిగురుం బోణిన్.
పతిభక్తిగలుగు జక్కని
యతివన్వరియించె దొంటి యంగనయడలన్. 191

వ. ఇమ్మెమనృపతులలో నెవ్వరు వివేకులనిన తిర్యగ్జంతువయ్యును
చింబోతు స్త్రీమోహంబు విడిచెంగావున నదియె వివేకియనిన
బేతాళుం డెప్పటియట్ల వటంబునకుం జనుటయును. 192

ఆ. అవనినాథుఁ డప్పటట్లనె కొని తేర
దనుజుఁడొక్కకథ విధంబుచెప్పి
వీరబాహుఁడనెడు విభుఁడంగదేశంబు
పాలనంబుసేయఁ బట్టణమున. 193

సీ. ధనదత్తుఁడను వైశ్య తనయును మదనస
యనుదాని ధర్మదత్తాఖ్యుఁడొకఁడు
కామించిపట్టఁదగరుటయు (?) నదివల్క-
మును దనతండ్రి సముద్రదత్తు
నకు నిచ్చెననిన, దైన్యమున నాతఁడు పట్ట
వచ్చిన వలదునావరుని మొదల
మును వచ్చినిను బొంది చని, పతిగూడుదు
ననిన వాఁడు నగుచు నట్లుసేయు

ఆ. మనిన నాఁటిరాత్రి యదిపతిగదిసినఁ
దనదుబాసచెప్పి తరళనయన
ధర్మదత్తుఁగూడ నర్మిలిఁ జనుచుండ
పట్టిదొంగసొమ్ము వెట్టుమనిన. 194

క. తనవర్తనంబు దొంగకు
వనరుహాముఖి చెప్పిమగుడి వచ్చియు మఱి నీ
మనమున కిష్టముఁజేసెద
నని సమ్మతుఁజేసి చనియె నాతనికడకున్. 195

ఉ. వచ్చిన, కాంతఁజూచి యిటువత్తురె నాథునిడించి యన్న నీ
కిచ్చిన బాసకై యనిన యిందునిభానన ! సత్యవాక్యమున్
మెచ్చితిఁదోఁడ బుట్టువవుదీనవిలోచనయంచు నొక్క సొ
మ్మిచ్చిన సమ్మ(తించి)యది యేఁగెను తస్కరుఁడున్న చోటికిన్. 196

క. వాఁడును సూనృతయగు పూఁ
బోఁడిని మఱపించి సొమ్ముపుడుకక తానుం
బోఁడిమిచేయుచు ననిపినఁ
బోఁడిమిచెడకరిగె నాత్మపురుషుని కడకున్. 197

క. ముగ్వురిలోపల నధికుం
డెవ్వఁడఱిఁగింపు మనిన హృదయేశ్వరుఁడై
యవ్వనితననిపి తిఱుగా
నవ్వెలఁదింగూడు పురుషుఁడధికుండనియెన్. 198

వ. తిరిగివటంబునకుం బారిన పట్టితెచ్చునెడ, బేతాళుండిట్లనియె. 199

సీ. ధారాపురంబున ధర్మధ్వజుండను
రాజునంగనలు తారావళియును
నబ్జరేఖయును, మృగాంకదత్తయునను
వారలు సుకుమార వనజవదన
లందులో నొక్కతె యంగంబు వెన్నెలఁ
బొక్క నొకక్కతె మేను పువ్వుసోఁకి
చిడిసె మఱొక్కతె చేతులు ముసలరా
వము విన్నఁబొక్కె నీవనితలందు

తే. కోమలంబైన తనువు దేకొమ్మయనిన
నాఁతులిద్దఱికిని గారణంబు గలదు
ముసలనినదంబు వినగరములకుఁబొక్కు
లెగయుకాంతయె సుకుమార యెక్కుడనిన. 200

వ. బేతాళుండు న్యగ్రోధంబున కరిగినతోఁడనె పారిపట్టితెచ్చునెడ
విక్రమార్కున కిట్లనియె, 201

సీ. రత్నకాంచీపురి రాజయశఃకేతుఁ
డనునృపుఁడంగ రాజాధిపతుఁడు
దీర్ఘదర్శనుమంత్రి తెరవుచెప్పిన సము
ద్రముసొచ్చి పాతాళ తళమునందు
నిర్జనపురమునఁ (జెలఁత)నొక్క తెఁజూడ
నటభూతతిథి నొక్కయసురక్రమింగ
రాక్షసు జఠరంబుఁ జొచ్చి యక్కాంతను
వెడలింప నృపునకుఁ బడఁతియనియె.

తే. పొత్తునకురాక తానన్న భుక్తిఁగొనక
నన్నుశపియించె తండ్రి దానవుఁడు క్రమింగు
ననుచు మఱివానిఁజంపిన యతఁడునీకు
రక్తుఁడనిపల్కి శాపవిముక్తి యొసఁగె. 202

క. అటగావున నను గైకొను
మిదినాయభిలాష యనిన నింతినిఁగొనుచుం
బడపడి పురికేతెంచిన
నదిమంత్రి కుమారుఁడెఱిఁగి యసువుల బాసెన్. 203

వ. అమ్మంత్రి మరణంబునకు గారణంబెద్దియనిన విక్రమార్కుం
డిట్లనియె. 204

క. ఆదివ్యకాంతఁ గలసిన
భూవయితుఁడు మత్తుఁడగుచుఁ బొరిగొనునన్నున్
భేదించుమంత్రి తమ్మును
శ్రీదరుగఁగఁ జేయునని యచేతనుఁడయ్యెన్. 205

వ. అనవుండు, 206

క. భుజముడిగి దానవుఁడువట
కుజమునకుం బరవ బట్టికొని తేరఁగనా
రజనీచరుండు పలికెను
విజయోన్నతకథ వచింతువినఁ దగుననుచున్. 207

వనమయూరము :
శ్రీమెరయ వార(ణసి సీమగల వేద)
స్వామి తనయుండు హరిస్వామి యొకకళయ్యెన్
వేమరునుఁ బూర్ణశశి వెన్నెలలుగాయన్
కామిని యుదాను (రతికాంక్షులగు వేళన్). 208

ఇంద్రవజ్రము :
గంధర్వుఁడక్కామినిఁ గాంచిబాహా
సంధానుఁడై కొంచును జన్నవాఁడున్
సింధుప్రజ స్నానము చిత్తవృత్తిన్.
సంధించి వేగంబున జాఁగివెళ్ళెన్. 209

తోటకము :
ధరణీసురుఁ డుత్తరినొక్క (పురిన్)
సరసీరుహలోచన పెట్టినశ్రీ
కరభిక్షము భుక్తముసేయఁగన
త్తరుపై నొకగృధ్రము తుండమునన్. 210

ఆ. పాము జేరుటయును పాఱుండుభిక్షంబు
గుడుచుచోట విషము వడియెనందు
పుచ్చనెఱుఁగ కతడుభుజియించి విషమెక్కి
చచ్చెనదటవిధివశంబుచేత 211

వ. భిక్షంబువెట్టిన గృహిణింజూచి గృహస్థు నీవావిప్రుని కేడువెట్టితివో యతండుచచ్చె నీముఖంబుచూడ దోషంబని భార్యను వెడలంగొట్టె నాబ్రహ్మహత్య యెవ్వరిదని యడుగుటయును. 212

క. దోషంబులేని యోని
ర్దోషిని దోషాత్ముఁడనుచు దూషించినయే
దోషములకు నధికంబగు
దోషంబనికొంద్రు సకలదోష విధిజ్ఞుల్. 213

వ. కావునదోషం బొకనికాపాదించిన వానికి దోషంబుదగులుననిన
బేతాళుండెప్పటియట్ల మఱ్ఱికిం జనిన విక్రమార్కుండు చనిపట్టి
తెచ్చు సమయంబు నొక్కకథ వినుమని యిట్లనియె. 214

సీ. వీరకేతుండను విభుఁడేలు తఱినయో
ధ్యాపురంబున రత్నదత్తుఁడనెడు
వైశ్యుని సుతవీరవతి యనుకన్యక
నధిపతియడిగిన నతనికీక
తనయింటనున్న నత్తరిచోరుఁడిలుచొరఁ
జూచి పేదనితన సొమ్ములీయ
వచ్చిననొల్లక వరియింపఁ గోరినఁ
జచ్చెద వరుగు నీవచ్చినట్ల

ఆ. యనినమరునిచేత నటుచచ్చుకంటెను
జామనీకుగాను చచ్చుటుఱవు
నాఁడలారు లెఱిఁగి నరపతి కెఱిఁగించి
విభునియాజ్ఞఁగొఱఁత వేయఁగాంచి 215

క. వారిజముఖి జనకునకునుఁ
జోరునికథఁదెలిపి యగ్నిఁజొచ్చెద ననుచున్
జేరినఁదజ్జనకుండు ను
మారిక విషమంగలేక మతివడ (లోకవన్) 216

క. జనపతి సమ్ముఖమునకుం
జనిభూవర వీనినేల చంపగనీకుఁ
ధనమెంతైనను నిచ్చెద
ననుటయువినకతఁడు తత్పురాంగణసీమన్, 217

తే. కొఱ్ఱువాతించి తస్కరుఁ గొఱఁతవేయ
వాఁడుదుఃఖించి నవ్విజీవంబువిడువ
నంతనాధీరవతియును నగ్గిఁజొరఁగ
దగ్గఱుటయును శివుఁడు ప్రత్యక్షమగుచు. 218

తే. అతని ప్రాణంబు గృపచేసి హరుఁడుచనియెఁ
గొఱతిపైనుండి దుఃఖంబుగుడిచి పిదప
నవ్వెనేటికి జెప్పుమా నరవరేణ్య!
యనిన విక్రమసూర్యుఁ డిట్లనుచు బలికె. 219

క. ధనమెంత తనకునిచ్చిన
వినఁడయ్యెను, నృపతి, దనకు విధియని యేడ్చెఁ
వనజాక్షియగ్ని చొరగాఁ
జనజూచిన నవ్వె నిదియ (సత్యం) బనినఁ. 220

వ. ఎప్పటియట్ల తిరిగి సరచినం బట్టితెచ్చునెడ బేతాళుఁ డిట్లనియె. 221

సీ. నేపాళదేశమహీపతియగు కీర్తి
కేతునిసుత (యొప్పు) గీరవాణి
చంద్రికనాగ వసంతోత్సవంబున
వనితఁజూచెను ఘనస్వామియనెడు
విప్రకుమారుండు వెలఁదియు నవ్విప్రుఁ
దగఁజూచె మోహమిద్ధతిఁ బొడమె
నతివయంతఃపురి కరుగ ఘనస్వామి
చెలిమూలదేవుడన్ సిద్ధరూగి

తే. యొ(కఁడుఘు)టికిచ్చి విప్రుని నువిడజేసి
నృపతిముందట నిది నాకు నిజతనూజ
తీర్థయాత్రకుజని యల్లుఁదెచ్చుదాక
(పోషణ)ముచేయుమని చెప్పి పోయెనతఁడు. 222

క. ఆరాజన్యుఁడు నాత్మకు
మారికకడనిలుప రాత్రి మగవాఁడై యా
వారిజలోచనఁ బొందును
సూర్యోదయ[1]మైనమగుడ సుందరి యగుచున్ ?. 223

వ. అంతనారాజకుమారికయు గర్భిణియైన నాలోన. 224

ఆ. మంత్రిసుతుఁడు రాజమందిరంబున నొక్క
పగలుకపట విప్రభామఁ జూచి
మోహియగుచు నృపతి ముఖ్యున కెఱిఁగింప
నతనికిచ్చె నింతినాలిగాఁగ 225

క. ఆమంత్రిసుతుఁడు కృత్రిమ
కామినిఁగలయంగ బిలువఁగల దొకవ్రతమో
భూమిసుర! తీర్థయాత్రకుఁ
బోవతి యేతెంచినన్ను బొందెదవనుడున్. 226

ఆ. అతడు తీర్థయాత్రయరిగినన దత్పూర్వ
పత్నిఁ బొందుచుండెఁ బగలు రేలు
నంతమంత్రి తనయుఁడరుదెంచు టెఱిఁగి య
ప్పొలఁతి గొంచు పోయెఁ బురమువెడలి. 227

వ. అంత నమ్మాలదేవుండను సిద్ధయోగి కపటశిష్యునిందెచ్చి రాజు
నకుంజూపి మత్పుత్రిని నితనికి వివాహంబుసేయువలయు దప్పిం
చుమనిన భూపాలుండు. 228

1. సూర్యోదయ అనుటలో వ్రాసబడినది, "సూరోదయ" అనుట బాగుగనుండును.

క. ఆమూలరోఁగి పెట్టిన
భామినిఁదా వెచ్చపెట్టి భయవిహ్వలుఁడై
భూమిపతి తనదుపుత్రిక
నామాంత్రిక శిష్యునకుఁ బ్రియాంగన జేయన్. 229

వ. అతఁడకాంత దోడ్కొని గృహంబునకు వచ్చుటయును. 230

తే. పడఁతి నని మున్ను సతికి గర్భంబుచేసి
నట్టివిప్రుండు తనకాంతయనుచుఁ బట్టఁ
దండ్రియగు రాజునాకిచ్చె దారవోసి
యనుచు నిరువురు జగడింప నత్తపస్వి 231

వ. జగడంబు దీర్పలేదయ్యెనది యెవ్వరిసతియగుననిన విక్రమార్కుం
డిట్లనియె. 232

క. తలిదండ్రులీకవనితన్
దలపోలమునగూడికొనినఁ దాధవుఁడగునే
తలిదండ్రులిచ్చు వాఁడే
యలివేణికి నాథుఁ డితరులగుదురె నాథుల్. 233

వ. అనిన నెప్పటియట్ల వటంబునకుఁ బారిన పట్టి తెచ్చు సమయంబున
నొక్క కథవినుమని యిట్లనియె. 234

ఉ. యాచకనూత్న మేఘుఁడు సమంచితమాన ధనుండు గాఢబా
హాచటులప్రతాపసముదగ్ర వినిర్జితశాత్రవుండు శా
స్త్రోచితమార్గలక్షణగుణోదయుఁ డాత్మవిచారుఁడైన యా
ఖేచరనాథుఁడొప్పు జనకీర్తిత కీర్తి కళామహోన్నతిన్. 235

వ. అగంధర్వశేఖరుండు కాముగమనంబైన (?) విమానారూఢుండై
లోకములం జరియింపుచుండు కాలంబున. 236

క. గరుడుండుద్ధత బలుఁడై
నురగులభక్షింపుచుండ నురగములెల్లన్
గరుడనికిలు వరుసగని
చ్చిరి ఖగవల్లభుఁడు నట్లుసేయుచునుండన్. 237

వ. అతనొక్కనాఁడు. 238

ఆ. శంఖచూడుఁడనెడు సర్పకుమారుండు
తల్లికొక్కరుండ తనయుఁడగుట
పక్షినాథునకును భక్షింపనిలువర్స
వచ్చెననుచు ఫణులువానిఁజూప. 239

వ. తదీయజనని దుఃఖావేశంబున నిట్లని తలంచు. 240

క. ఒకనేత్రము నేత్రంబే
యొకపుత్రుఁడు పుత్రకుండె యూహింపంగా
నకట బహుసుతులఁగానక
యొకసుతునింగనుట, లేకయుండుటగాదే! 241

వ. అని విలాపించు సమయంబున జీమూతవాహనుండు మార్గవశం
బున నచ్చటికిం జనుదెంచి దయాళుండై యప్పాము. 242

ఆ. శంఖచూడుఁ దిగిచి సౌపర్ణుముందట
నిలిచిభుక్తిగొనుమనింద్య చరిత
యనినఁ బక్షివరుఁడు ఘనవాహు దేహంబు
భుక్తిగొనఁగఁ జేరఁబుసువరుని. 243

చ. వలదని శంఖచూడ ఫణివారణసేయఁగ మేఘవాహును
జ్వల తర దేహమాంసములు, చంచుపుటంబున నొల్కనెత్తురుల్
జలజల ధారలై తొరఁగ సాఁగు బళాయని దేవసంఘముల్
పలుమరు ప్రస్తుతింప ఫణిప్రాణముగాచెను దాంశీలియై. 244

క. ఆతని యుదారమహిమకుఁ
బ్రీతుండై మెచ్చి ఖగవరిష్ఠుండు సుధా
ప్రీతునిగఁ జేసి ఫణిసుతుఁ
జేతః ప్రియమలరఁగాఁచె చిత్తంబలరన్. 245

క. మెచ్చితి నంబుదవాహన
యిచ్చెదనే మడుగుదనిన నిది మొదలుగ, నీ
కిచ్చెదని ఫణుల మెసఁగకు
చచ్చిన యురగములఁదినుము శాంతాత్ముఁడవై. 246

వ. అనిన నిచ్చితినని గరుడుండు యథేచ్ఛంజనియె గరుడ జీమూత
వాహనులలో నెవ్వండధికుండనిన విక్రమార్కుం డిట్లనియె 247

ఆ. అధికదాతయైన యంబుదవాహనుఁ
డిచ్చు ప్రాణమైన నేమి చెప్ప
నాఁకలైన మెసఁగనరుదెంచు గరుడుండు
దినక కాచునదియె ధీరగుణము. 248

వ అనినం బరచినం బట్టి తెచ్చు నెడ నిట్లనియె. 249

సీ. కనకపురంబునఁ గలఁడు విశారదుం
డను రాజు వైశ్యుని యనుఁగుదనయ
కామినిజూచి యభ్భూమినాథుఁడు పెండ్లి
యాడెద లక్షణమరయుఁ డనిన
దీని బెండ్లాడిన మానవేంద్రుఁడు రాజ్య
తంత్రంబు నుడుగుచు దగదటంచు
నవనినిర్జరు లదియవలక్షణంబన్న
[illegible]

ఆ. పెండ్లియాడుటయును బృథివీశుఁ డొక్కనాఁ
డతివఁజూచి మన్మథాగ్నిఁ బొరల
మంత్రిదెలిసి తనదు మగువనొప్పించిన
నన్యకాంత పాపమని తలంచి. 250

వ. కైకొనక విరహతాపంబునం బ్రాణంబువిడిచె నమ్మంత్రియుం
దనస్వామి మృతుండయ్యెనని తానును నట్లయయ్యె వీరిలోన
నధికుండెవ్వఁడనిన విక్రమార్కుం డిట్లనియె. 251

క. చక్కనిదైనను గుణములు
మిక్కిలిఁగా హృదయమిచ్చి మెలఁగెడి దైనన్
మక్కువసేయక పరసతి
దిక్కుగనుంగొనినవాఁడె ధీరుఁడు సుమ్మా. 252

వ. అట్లుగావున రాజెక్కుఁడనిన బేతాళుం డెప్పటియట్లన్యగ్రోధం
బున కరిగినంబట్టి తెచ్చు సమయంబునఁ గథవినుమని యిట్లనియె. 253

ఆ. పుష్ప, పురమునందు భూసురుండొక్కఁడు
సూర్య దేవళంబుచొచ్చి, యందు
క్షుత్పిపాస నొగులఁజూచి యోగీశ్వరుం
డతనికన్నమిడుమనని దలంచి. 254

వ. ఒక్కపురంబు నిర్మించి యొక్క బాలికచేత నన్నముపెట్టించినం
దృప్తుండై యయ్యోగీంద్రుఁన కిట్లనియె. 255

క. ఈవిద్యనాకు నొసఁగుము
ధీవల్లభ ! యని నసీవు స్థిరచిత్తుఁడవై
సేవింపక ఫలియింపదు
నావుడు నేనట్లసేతునని కైకొనుచున్. 256

వ. తదీయోపదేశక్రమంబున జలంబులుచొచ్చి జపంబుసేయుచు
ధ్యాననిద్రావశంబునఁ దావివాహంబై పుత్రులంగాంచిముద్దాడు
చున్నాఁడని కలగాంచి జలంబులు వెలువడివచ్చి యప్పుడు. 257

క. అనలంబుఁజొచ్చి భార్యయుఁ
దనయులు దుఃఖంపఁ గాంచి దహనముకొలనై
తనువుఘటించిన వెలువడి
మునివరునకు మ్రొక్కి విఫలముగవినుతింపఁగ. 258

వ. అయ్యోగీశ్వరుండు చింతింపుచుండె నిది సఫలంబుగాని కారణం
బేమియనిన విక్రమార్కుం డిట్లనియె. 259

క జపములు జేసెడువారును
తపములు తగజేయువారు తత్త్క్రియలన్
విపరీత చిత్తులైన
న్నపగతఫలసిద్ధులగుదురందురునార్యుల్. 260

వ. అనిన నెప్పటి యట్లవటమునకు నరిగిన బేతాళునింబట్టి కట్టికొని
తెచ్చునప్పుడు విక్రమార్కునకుఁ గథ వినుమని యిట్లనియె. 261

ఆ. ఒక్కవైశ్యతనయ యుత్పలదళనేత్ర
తండ్రిజచ్చుటయునుఁ దల్లివెంటఁ
బురము వెడలి పోవఁదెరువునొకచోట
శూల నిహతుఁడైన చోరుఁడొకడు. 262

క. సంతానము సుఖహేతువు
సంతానము మోక్షసిద్ధిసాధనమగుటన్
సంతతివడయగ వలయును
సంతానము లేమి నరకసాధనగాదె! 263

వ. అని కించిత్ప్రాణావశేషుండైన తస్కరుండక్కన్య తల్లికిం గన్న దనియధనంబు తన నిక్షేపంబునిచ్చి దానిఁ దావరియించిన వాఁడై యిట్లనియె. 264

ఆ. సూర్యదీప్తిపురము చొచ్చిమత్సఖుఁడైన
యకుమార దత్తునాలయమున
నిలిచి యొక్క విప్రువలన సంతానంబు
వడయునాకు సుగతి ఫలమువొంద. 265

వ. అని చోరుండు ప్రాణంబు విడిచెఁదల్లియుంగూఁతురు ధనంబు గైకొని తత్సఖు గృహంబునకు వచ్చియుండునంత నొక్కనాఁడు కూఁతుంజూచి విప్రునివలన సంతానంబువడయుమనిన సమ్మతిల కున్న నిట్లనియె. 266

క. వరుని యనుజ్ఞను వేఱొక
పురుషుని యెడనైన వనితపుత్రునిఁబడయన్
బరమును దప్పదిహంబునుఁ
బోరినిందయు రాదు వాఁడు పూజ్యుండగుటన్. 267

వ. అని యొడంబరచుటయును. 268

క. హేమస్వామి యనంగను
భూమీసురవరునిబొంది పుత్రునిఁగనియ
శ్యామిని సిగ్గునఁ బెంపక
భూమీశారామవీథిఁబుత్రునిఁ బెట్టెన్. 269

క. వనపాలకుచే వినియ
జ్జనపతి తెప్పించివాని సల్లక్షణముల్
కనితానపుత్రుఁడౌటనుఁ
దన యునిఁగా బెంచి వాని ధరణిపుఁజేసెన్. 270

వ. అంతఁగొంత కాలంబున కాశిరాజుమృతుండైన నక్కుమారుండు. 271

ఆ. గయనుపిండమిడుచు గంగనస్థులు నిల్పు
సుతున కిహముఁబరము జూరయబ్బు
నతనిఁబుత్రుఁడనుచు నందురుబుధులట్లు
గానివాఁడు సుతుఁడు లేనివాఁడు. 272

వ. అని తలఁచి గయకుంజని పిండప్రదానంబుసేయు నప్పుడు. 273

క. హస్తములు పిండభుక్తికి
శస్తముగా మూఁడుదోఁచె జనపతిసుతుఁడే
హస్తమున నిడుదునోయని
నిస్తరణముసేయలేక నివ్వెఱపడియెన్. 274

వ. ఇందు నెవ్వారి హస్తంబునఁ బిండంబిడవలయుననిన విక్రమార్కుం
డిట్లనియె. 275

ఆ. పోషకుండు భూమిభుజుఁడు గూఢాచారి
విప్రుఁడట్లుగాన వీరుగారు
ధనముపెట్టి కన్యఁదస్కరుండువరించెఁ
దండ్రియతఁడె పిండదానమునకు. 276

వ. అనిన బేతాళుండరిగి పరచినఁబట్టి కట్టితెచ్చుచో నొక్కకథ
వినుమని యిట్లనియె. 277

సీ. చిత్రకూటంబేలుక్షితిపతి యొకనాఁడు
వేఁటగాఁజని యటవీస్థలమునఁ
గణ్వునకును మేనకకును జనించిన
కన్యక నతఁడీయఁగామియగుచుఁ

కుంజరాశన [1]తరుకుంజాతరంబున
రమియింపనొక బ్రహ్మరాక్షసుండు
జనపతికనియె బ్రాహ్మణపుత్రుఁదలిదండ్రు
లలమిపట్టఁగ నాకు బలిగాయొనర్పు

ఆ. మిట్లుసేయకున్న నిప్పుడె భక్షింతు
నిన్ను ననిన వేగ నృపతియపుడు[2]
కనక పురుషునొకనిఁ గల్పన సేయించి
విప్రనందనునకు వినిమయముగ. 278

వ. ఇచ్చితదీయజననీజనకుల చేత శిరఃపదంబులు వట్టించి ఖడ్గంబెత్తి
వ్రేయ డగ్గరిన నవ్విప్రకుమారుండు నవ్వె నేమిటికిం జెప్పుమనిన
విక్రమార్కుం డిట్టులనియె. 279

ఆ. తల్లిదండ్రులలర ధరణీశుచేఁ దెగ
వేతఁబడగఁ జేసి విప్రునన్ను
బలిరె విధియటంచుఁ బకపకనవ్వె వాఁ
డనినఁబ్లక్షమునకు నరిగెనసుర. 280

వ. ఎప్పటి యట్లపట్టి తెచ్చునెడ నొకకథ వినుమని యిట్లనియె. 281

ఆ. వసుధనొక్కపురము వైశ్యుండు తనకూఁతు
పిన్నవయసునందె పెండ్లిసేయ
యౌవనమున జారయై విప్రుఁగలయంగఁ
దొంటినాథుఁడరుగుదెంచియపుడు. 282

1. కుంజరాశన = రావిచెట్టు.

2. "నిన్ను ననిన నృపతి శీఘ్రమునను" అని గ్రంథపాఠము
యతిభంగముగా కన్పించుచున్నది.

క. భామనోడఁ బరచి తనప్రియ
భామిని ననిపించి కొనఁగఁ బయనము సేయన్
భూమిసురుఁ బాయఁజాలక
కామిని మృతిబొందె నట్లకడ చేరద్విజుఁడున్. 283

క. పతిననువు మనుచువచ్చిన
యతఁడు ప్రియన్ బాయలేక యసువులు విడిచెన్
మృతులగు ముగ్గురలోపల
క్షితివర యే దద్భుతంబు చెప్పవె యనినన్. 284

ఆ. భూమిసురుఁడు వైశ్యపుత్రియు సమరతిఁ
గలసి పాయ లేమిఁ గలిగె చావు
అతివ మగఁడు దాని యనుభోగమెఱుఁగక
విరహమున నె తెగుట విస్మయంబు. 285

వ. అనిన బేతాళుం డెప్పటియట్ల చనినఁ బట్టి తెచ్చు నెడ నొక కథ
వినుమని యిట్లనియె. 286

సీ. బ్రహ్మస్థలాగ్రహారమున విష్ణుస్వామి
సుతులునల్వురు భూమిఁజూడనరిగి
వచ్చుచో నొకయోగి వలని చే సంజీవ
నాదివిద్యలు నేర్చి యడవిలోన
నొక్కసింహము చచ్చియున్న నందొకరుండు
నస్థులుగూర్చె దానంత నొకఁడు
చర్మంబుగప్పి మాంసమును రక్తంబునుఁ
బుట్టించెఁ బ్రాణంబుఁ బోసెనొక్కఁ
తే. డిట్లునలువురు దమవిద్య లెఱుఁగుకొరకు
నాచరించినఁ గేసరి లేచివారి
నలువురనుబట్టి తినియె నాఁకలియడంగ
వీరిలోఁ బాపి యెవ్వఁడు విక్రమార్క 287

వ. అనవిట్లనియె. 288

క. హీనమతు లెందఱైననుఁ
గానంగా లేక సేయు కార్యము లెల్లన్
మానప్రాణార్థంబుల
హానివెసం జేయుననిరి యార్యజనంబుల్ 289

వ. అట్లుగావున ప్రాణంబువోసిన విప్రునకు పాపంబుదగులుననిన దిరిగి
చనినం బట్టి తెచ్చు నెడనొక్క కథ వినుమని బేతాళుండిట్లనియె. 290

సీ. యజ్ఞశూలంబను నగ్రహారంబున
యజ్ఞసోమద్విజు నాత్మజుండు
మృతిబొందుటయు (నుఁబ రేత భూమికిఁ దెచ్చి)
వనరంగ వామనుండను తపస్వి
యతని దేహముచొచ్చి యడలుమాన్పెదనని
తలఁచి యుప్పినుఁగు తనువుచొచ్చి
నవుడేడ్చి పాతరలాడి ప్రవేశింపఁ
దనయునిఁ దోడ్కొనిచనిరేఁ దండ్రి

తే. తపసియేటికి నేడ్చి నృత్యంబుసలిపె
ననినసర్వక్రమార్కుఁ డిట్లనియెఁ దన్నుఁ
దల్లిదండ్రులు పెంచిన తనువు ముదిసి
విడువఁబడెనంచు నేడ్చెనప్పుడు తపస్వి. 291

వ. బాలశరీరంబుచొచ్చి భోగింపఁగలిగె నని సంతసంబున నటియించె
ననిన బేతాళుండప్పటి యట్లచనినంబట్టి తెచ్చు సమయంబున
నిట్లనియె. 292

సీ. తామ్రశేఖరమనఁ దనరు పురంబున
వృషకేతుఁ డనియెడు వృషలసుతుఁడు
హరికాంతురగు కందుకావతి మోహించి
తోకొనిమఱియొక త్రోవనరుగ
నడవిలోఁ దస్కరులడ్డగించినవారి
వధియించి యొకపురవరము చేరి
కోమలినొక పాడుగుడిలోన నునిచియాఁ
కటికి నన్నముఁదేర గవనిచొచ్చి

తే. యరుగుచోసుమ యనియెడు నాఁటదొక తె
యున్నమిడియెదరమ్మని యతనిఁ గొనుచుఁ
దనకునేలిక సానైన తరుణిఁగూర్చ
నిందురేఖనుగలిసి వాఁడింతిమఱువ. 293

తే. కందుకావతి యాగుడి కడనెయుండ
వైశ్యుఁడొక్కఁడు గొనిపోయి వనితఁజూడ
యెలుకలనుజంపి తనసత్త్వ మెన్నుకొనినఁ
బూర్వనాథుని విజయంబు బుద్ధిదలఁచి 294

వ. వైశ్యుండధముండని వానిఁగలయ రోసిప్రాణంబు నీడిచినవైశ్యుం
డును దనధనంబు రాజపహరించునని దానంబుచేసి యర్థనాశం
బయ్యెనని చచ్చెనంత. 295

ఆ. ఇందురేఖ మఱచి కందుక మ్మఱచుట
న్యాయమనుచు శూద్రుఁడాత్మఁదొరఁగె
నింతటికిని హేతువేనని నిలువక
దోసమునకు వెఱచి డాసిచచ్చె. 296

వ. వీరిలో నెవ్వరి మరణంబధికంబనిన విక్రమార్కుం డిట్లనియె. 297

.....................
...........................
.....................
........................... 298

వ. అనినబేతాళుండు తిరిగిపరచినం బట్టితెచ్చు నెడనొక్కకథ విను
మని యిట్లనియె 299

సీ. జనపతి యొకఁడు రాజ్యభ్రష్టుఁడై తన
సతియుఁబుత్రియు వెంటఁ జనఁగనొక్క
యడవిలోన జనంబు లధిపతిఁ గొట్టినఁ
దల్లియు సుతయు నద్దారినరుగ
నవ్వేలనొక నృపుండాత్మజుండు నుదాను
నడవినాకాంతల యడుగుఁజొప్పు
కనిపిన్న యడుగుల కాంతసుతుండును
బెద్దయడుగుల యింతిఁ బృథ్వీపతియుఁ
తే. గోరఁబదములు పెద్దవికూఁతునకును
దానితల్లికిఁ జిన్నపాదములు నగుట
మాటదప్పక వరియింప మానినులకుఁ
బుట్టుసుతులకు నే వావిపుట్టుననిన 300

క. తెలియక భూపతియూరక
నిలిచిన బేతాళు డక్కునికిఁ బ్రీతుండై
పలికెఁ గొనిపొమ్ము వచ్చెద
నలసితిగాయనుచు నొకరహస్యము చెప్పెన్. 301

తే. వీనినమ్మకు కపటాత్ము వీఁడునిన్నుఁ
జంపదలపోసి నను దేరఁ బంపెనిన్ను
వాఁడువధియింపకయె మున్ను వానిఁజంపి
సిద్ధివడయుము దేవత చేతననుచు, 302

క. భూతలపతిఁ గొనిచనన
బ్బేతాళుండరుగ యోగిప్రియ ముందిమహా
భూతమునకెఱఁగు మనవసు
ధాతలపతి వలికె నెఱుఁగదండము వెట్టన్. 303

క. ఏలాగునఁ బెట్టుదునన
నీలాగునఁ బెట్టుమనుచు నిలపై వ్రాలన్
వాలునఁదలఁదెగ నడచినఁ
గూలెన్ యతి దేవి మెచ్చఁ గుంభినినాథున్. 304

వ. మెచ్చియాతని సాహసౌదార్యగుణకీర్తు లాచంద్రార్కంబుగా వరంబిచ్చి యనిపినఁ బురంబునకరిగె. బేతాళుండును శాపముక్తుం డై చనియెననిన బలీంద్రుండు నారదున కిట్లనియె. 305

క. శాపం బెవ్వరి వలనం
బ్రాపించె నను వాని కనిన భవుని రహస్య
వ్యాపార కథలు దుర్మ్మద
రూపంబై వీఁడు తనతరుణి కెఱిఁగించెన్. 306

తే. అదిప్రకాశితమైన నయ్యభవుఁడెఱిఁగి
ఖచరుఁగనుఁగొని బేతాళుగా శపించె
నెవ్వఁడీ ప్రశ్నకుత్తర మిచ్చునీకు
శాపమునుఁ బాయునప్పుడనఁ జనియెవాఁడు. 307

వ. అనినారదుండింక నొక్కకథ వినుమని యిట్లనియె. 308

మ. రవివంశంబున నుద్భవించి లవణే (రావత్తదంత) క్షమా
భువనంబొక్కఁడ యేలె నైరి నరరాడ్భూరి ప్రభావాటవీ
దవ వై (శ్వానర) కీలసంక్షుభిత దిగ్దంతి స్ఫురత్కుంభదృ
గ్దివి జాహ్నీకతరంగిణీ విహారుడై కేయూర బాహుండొగిన్. 309

క. ఆరాజుమంత్రి వర్యుఁడు
దారప్రతిభా సునీతి తత్త్వజ్ఞుఁడుగం
భీరమణి భాగురాయణి
శూరగ్రేసరుఁడు చిత్తశుద్ధుండగుచున్. 310

ఆ. వసుమతీశుఁ డాత్మవల్లభ యగురత్న
సుందరీరతాభి నందుఁడగుచు
రాజ్యతంత్ర విధులు పూజ్యముగావించి
మత్తుఁడగుచునున్న మంత్రియపుడు. 311

క. ఏకరసమత్తుఁ డయ్యెన్
భూకాంతుండన్యరుచుల బోధింపఁగ నేఁ
జోకనొక విధము చూపి వి
వేకము పుట్టింతుననుచు వేఁగులవారిన్. 312

సీ. పనిచినవారు వేచనివచ్చి వినిపించి
రటచంద్రవర్మ లాటాధివరుఁడు
పుత్రసంతతిలేక పుత్రికగల్గిన
పుత్రుగాఁబెనిచి విచిత్రముగను
వానిపేరు మృగాంకవర్మని యిడియుండఁ
బ్రతిచూతునని మహారాష్ట్రవిభుఁడు
పైనెత్తివచ్చిన భయఁపడి యున్నవాఁ
డనిచెప్పవినిమంత్రి యతనికడకు

ఆ. బాంధవంబు దలఁచిబలములఁ దోడుగా
నని పె. చంద్రవర్మయనుఁగుఁ బుత్రుఁ
డచటనుండవలవ దిచటికిఁ గొనుచురం
డనుచుపంపవారు నట్లసేయ. 313

వ. భాగురాయణుం డక్కుమారునివెంట నిడుకొని యక్కన్యం బొం దినవాఁడు సార్వభౌముండగునని విన్నవాఁడుగావున రహస్యంబు వెలిపుచ్చకయుండి యొక్కనాఁడు. 314

క. ఆరత్నసుందరీపరి
చారఁగళావతినిఁ దనవిచారంబునకుం
గోరిసహాయము గాఁగొని
యారమణికి సరవిఁజెప్పి యనిపిన నదియున్. 315

వ. రత్నసుందరికడకుం జనియిట్లనియె. మీపినతల్లికొడుకు మృగాంక వర్మ తండ్రిపంపునం జనుదెంచి భాగురాయణి యింటనున్నాఁ డనిచెప్పి యామెయనుమతి వడసి తిరిగివచ్చి భాగురాయణికె టింగించుటయును. 316

శా. అమ్మంత్రీశుఁడు రాజమందిరములో హర్మ్యంబుగట్టించియు
క్కొమ్మం బెట్టితదీయ చర్య వెలికిం గూఢంబుగా జేసి త
త్సమ్మంధంబున రత్నసుందరియు హృత్సంతుష్టి బొందంగఁదా
నమ్మార్గంబుఘటించె దూతికరహస్యాచారగానిచ్చలున్. 317

వ. వర్తింపుచుండ భాగురాయణి మేనల్లుఁడయిన సోమదత్తుండను వాఁడంత నొక్కనాఁడు మామకు నీతికథలు వినుపింపుచు నిట్ల నియె. 318

ఆ. కాంచి వైశ్యుఁడొండు సంచిబియ్యమువట్టి
సరికినూనె వోయుసటులఁ గలరె!
యనుచుఁదిరుగ బురిని నతివలు నవ్వుచుఁ
దైలమిడకయున్నఁ దత్క్షణమున. 319

వ. నిప్పచ్చకుండను కోమటిభార్య తైలంబు వోసెదనని వానింబిలిచి పళ్ళెరంబున బియ్యంబుగొల్చికొని తానును నాపళ్ళెరంబుననె నూనెగొలిచి లాభంబుఁబొందెఁ గావున. 320

క. వెలఁదులకు నరులకంటెను
నలుమడి బుద్ధియన ధరవినంబడుచుండున్
దలఁప సుబుద్ధులు గలిగిన
పొలఁతిసుమీ కాపురంబు పొందుగ సేయున్. 321

ఆ. బుద్ధిగలుగవలయుఁ బురుషున కదియుఁద
త్కాలవృత్తిమైనఁ గలుగుఫలము
తలఁచినపుడెబుద్ధి తలకొన కుండిన
హానివచ్చుగాన నది యబుద్ధి. 322

వ. అదియెట్లనిన. 323

క. దక్షుఁడను విప్రుఁడొకతెను
వీక్షించిన క్రొముక్కు, దాని విభుఁడెఱిఁగి ద్విజున్
లక్షించి చంపఁజూచిన
నక్షణమున నెఱిఁగి క్రొముక్కై నాళలకొల్లన్. 324

క. అదిజపముతోఁడి క్రొముక్కని
మదిదలఁచిన భటుఁడు చనియె మానినియును స
మ్మదమును బొందెను జూచిన
నదిగో! తత్కాలబుద్ధి, హాని నడంచున్. 325

క. తమ కార్యమునడపెడు ను
త్తముఁ డీతండనుచు జనులు తమునాసింపన్
తమకార్యమెపుడు వదలక
తమకార్యమె నడుపుచుంద్రు దత్త్వవిధిజ్ఞుల్. 326

వ. అదియెట్లనిన. 327

సీ. పీఠికాపురమున బింబోష్ఠిచతురిక
యనువారసతి దానియనుఁగు విటులు
మంత్రిపుత్రుఁడు కోమటినందనుండును
దలవరిసుతుఁడును దస్కరుండు
గలరు నల్వురు గజగమన యందఱకును
గూరిమిగల యట్ల కూటమిచ్చు
నీరీతి మెలఁగంగ నిందఱికిని నొక్క-
ధరణీసురుండు ప్రధానసఖుఁడు

తే. గలఁడు వాఁడొక్కనాఁడు తత్కాముకులను
కాంతకెవ్వరిపై కూర్మిగలదు నలువు
రందునని యొక్కరొకని నేకాంతమునను
జెప్పుమనుటయు వేర్వేఱఁ జెప్పిరపుడు. 328

క. వారిజముఖి తనమీఁదనె
కూరిమిగలదనుచు దాని గుణములు వొగడన్
వారలనడిగినరీతినె
వారాంగన నడుగ విప్రవరునకు ననియెన్. 329

సీ కౌఁగిలొక్కని కిచ్చుఁగామించు నొక్కని
నలుఁగు నొక్కనితోఁడఁగలియు నొకనిఁ
బలుకు నొక్కనితోడఁ బులకించు నొక్కనిఁ
దక్కించునొక్కనిఁ దగులునొకని
నొకనిరమ్మని పిల్చు నొకనికాసలు చూపు
కనుసన్ననొకనికిఁగాఁక సేయు
నమ్మించునొకనిఁ బంతముచెప్పు నొకనికి
మ్రొక్కు వేఱొక్కని దిక్కుచూచుఁ

తే. తడవునొక్కని మనమునఁదలఁచు నొకని
వన్నె యొకనికి నొకనికి వలపుఁజెప్పు
నింటనొకఁడుండ నొకని బొన్నింట(?) గలయు
వారవనితలఁ దెలియ నెవ్వారు గలరు. 330

క. పెక్కుబొజుంగుల మెలఁపిన
యక్కామినియేలఁ దక్కు నన్యునకును దాఁ
దక్కఁగఁ దలఁచిన పసిఁడికిఁ
దక్కునునది లేకయున్నఁ దక్కకతక్కున్. 331

శా. సాక్షాన్మన్మథుఁ గూడి యిష్టగతులన్ సంభోగముల్ సల్పినం
దాక్షిణ్యంబునఁ గూడియున్నతఱి ఖేదంబొంది హేమాంబరా
పేక్షన్నిల్వ కుబేరునింగలసి చూపెం గూర్మి కామాంధయై
దాక్షారామమునందు నొక్కసతి కాంతల్ పేదకుంగూర్తురే 332

వ. అట్లుగావున ధనంబుదక్క దక్కిన మోహంబులు లేవనిన విప్రుండు
నవ్వుచుం జనియెనంత. 333

సీ. జనపతి చెలికాఁడు చారాయణుఁడు రత్న
సుందరిదూతితోఁ గందువెట్టి
యిరువురు జగడింపనింతు లిద్దఱుఁగూడి
తమలోనఁ దలపోయఁ దరుణియోర్తు
పలికెనిట్లని భూమిపతి సఖుతోఁడ మే
ఖలకేలకలహింపఁ గారణంబు
పోరినయిండ్లనుఁ బొరుగులు మనవని
చెప్పెడుమాట నిశ్చితముగాదె

తే. వీరిజగడంబుమాన్ప నెవ్వారితరము
సరట[1]గజ యుద్ధమునఁ దొల్లి జైనపల్లె
తోఁడ గూడంగఁ గాసారతోయజములు
నాశమును బొందెననిన నన్నాఁతి యనియె. 334

1. సరట - తొండ.

వ. అదియెట్లనిన. 335

ఆ. గంధదంతి యొకటి కాసారతటమునఁ
గరము నిలుప (నొగ్గ) సరటమొగిచి
సరభసమునఁ బారి కరితుండ రంధ్రంబుఁ
జొచ్చుటయును దంతిచురుకుపుట్టి 336

శా. కాసారంబుగలంచి వారిరుహసంఘాతంబు భేదించి త
ద్గ్రాసంబుల్ విదళించి జైనచయమున్ ఖండించి పంకేరుహా
వాసంబప్పుడు (జొచ్చినన్) సరటమావ్యాజంబుగాఁ బాసినన్
నాసాద్వారము నొప్పిమానుటయు నన్నాగంబు బోయెన్వడిన్ 337

వ. అనిన మఱియొకర్తిట్లనియె. 338

క. అధములకైనను గలహపు
విధమెప్పుడు కీడుపుట్టు వినుమాయొకచో
మధుబిందు కలహమునజన
వధ ప్రాప్తంబైన యట్లు వసుమతిలోనన్. 339

వ. అదియెట్లనిన. 340

సీ. బోయ యొక్కఁడు లాటపురవీధిఁ దేనియ
కుండఁ దేరఁగ మదకుంజరంబు
దరిమినవాఁడు దత్తరమున దలఁగఁగఁ
దొలఁకి యా తేనియ చిలుకఁ దేఁట
మక్షికంబులబట్టి భక్షింపనొకయోఁగ
పులిచేరబల్లి యప్పులినిఁదిన్న
నాబల్లి నొకపిల్లి యాహారమునుఁజేయ
నాపిల్లి నొకకుక్కయులమి కఱచె

తే. నాఖుభుక్కనుఁ జెంచిన యతఁడు కుక్కఁ
బొడిచె నాకుక్క నేలిన బోయవాఁడు
కుక్కఁబొడిచిన యాతని మక్కఁజేసె
పోరుఘనమయ్యె నప్పుడప్పురము నడుమ. 341

క. క్షితిపతి పోరుడుపఁగఁ దా
నతివేగమ్మె సైన్య సహితమై వచ్చిన భూ
పతికినిఁ బురజనులకు సం
యతి[1]ఘోరంబైన మడసిరందఱు నచటన్. 342

క. పలువురు గలహము సేయఁగ
నిలిచికనుంగొనఁగవలదు నేరమివచ్చున్
గలహించువారిఁ గూడిన
బలవంతునకైన మానభంగముదెచ్చున్. 343

వ. అట్లు గావునమన మచ్చట నుండవలదని ప్రధాని కవ్విధం బెఱిఁగిం
చుటయును. 344

ఆ. సచివశేఖరుండు చాగణరాయనిఁ
బిలువఁబంచి వానిఁ బ్రీతుఁజేసి
పూని మేఖలకును మానభంగము సేయు
మనినవాఁడు చనియె నతఁడంబ. 345

విలసితము :
కపటసఖ్యమునుఁ గామినితోఁడన్
(శపథ) యుక్తముగ జాగణరాయం
డుపమమీరి సరసోక్తుల తోఁడన్
నృపతి యాత్మ గరుణింపగ జేసెన్. 346

వ. అంతనొక్కనాఁడు. 347

1. సంయతి - యుద్ధము.

ఆ. తనసుపుత్రుఁడనుచు దాసి పుత్రునిఁదెచ్చి
ప్రేమమేఖలకునుఁ బెండ్లిసేయఁ
బడఁతి యెఱిఁగి మానభంగంబునకు రోసి
రత్నసుందరియును రాజుగూడి. 348

వ. ఉన్నయవసరంబున నడుగులంబడి తనమానభంగంబు విన్న
వించిన నూరకున్న నదిరాజకృత్యంబని కోపించి రత్నసుందరి
యంతఃపురంబున కరిగిన నక్కేయూరబాహుండు విరహాక్రాంత
చిత్తుండై మధ్యమకుడ్యకుహరస్తంభవేదికాస్థలంబున విచార
నిద్రాలసుండైయున్న సమయంబున నిద్దఱు దూతికలు తమలో
నిట్లనిరి. 349

క. చారాయణుండు మెల్లన
నారీమణిమేఖలకును నచ్చినగతినే
పోరామిచేసి మానము
దూరముగావించె నిట్టి ధూర్తుఁడుగలఁడే. 350

వ. అనిన మఱియొండవదిట్లనియె. 351

ఆ. చేరఁదగనివానిఁ జేరుచుకొన్నను
ప్రాణమానహాని ప్రాప్తమగును
కాకిఁజేర్చుకున్నగాదె హంసకుమున్ను
ప్రాణహానియగుట పద్మనయన! 352

వ. అదియెట్లనిన. 353

ఆ. చిత్రకూటనగము (శిఖరము) పొదుపు
హంసలున్నవేళ నచటికొక్క
కాకి చేర నచటఁ గాలూఁదనిచ్చిన
రెట్టవెట్టమఱ్ఱిచెట్టు మొలిచె. 354

వ. కాలక్రమంబునం బెరిగి యాడలుదట్టి భూస్థలంబు మోఁచియుండు
టయును. 355

ఆ. ఒక్క బోయ మెక్కి యుదియొడ్డి హంసలఁ
బట్టి మెడలుదునిమి చట్టిఁబెట్టి
బంధుజనులుఁ దాను భక్షించెఁగావున
జేరదగనివానిఁ జేర్పఁదగదు. 356

వ. అనిమఱియు నిట్లనియె. 357

క. అతివినయం బత్యంతము
వ్రతపరిచయమధికమిత్రవాత్సల్య మతి
స్తుతిచేయుట యివి ధూర్త
ప్రతతికిఁ జిహ్నములుఁ దెలియరాదెవ్వరికిన్. 358

వ. అదియెట్లనిన. 359

సీ. ఒక్కబ్రాహ్మణుపత్ని యుత్పలదళనేత్ర
పతిదప్పఁగను గోస సుతునినైన
నని నేత్రములు గట్టికొని పతికనయంబుఁ
బ్రతిలేనివినయ సద్భక్తిఁ గలుప
నతఁడెచ్చటికినైన నర్థింపఁబోయినఁ
గోకలుగుంజు నచ్చాకివానిఁ
బొందు మనుండ నప్పారుగువార లెఱింగి
విప్రునకెఱిఁగింప విధము దెలియ

తే. నూరికరిగెద ననుచునయ్యవిదయొజుఁగ
కుండ నట్టుగుమీఁదగాచుండు నంతఁ
గోక దెచ్చిన చాకలిఁగూడఁ జూచి
విప్రుఁడక్కాంతనక్కడ విడిచిపోయె. 360

వ. అని సల్లాపంబులు సేయుచు మఱియొకర్తి యిట్లనియె. 361

క. అవివేకి పొందుకంటెను
వివేకముగల జనుతోడి విరసంబొప్పున్
భువనాధుఁడు రక్షింపఁడె
వివేకమునఁ దస్కరుండు వింధ్యవనమునన్. 362

వ. అదియెట్లనిన. 363

ఆ. బందుగుండు రాఁగ బ్రాహ్మణుఁడొక్కండు
ధనము లేక నతని దమ్ముఁడున్న
పురికి నరిగి లేమి పరిపాటి నెఱిఁగించి
ధనము వేఁడుటయును దమ్ముఁడపుడు. 364

వ. ఒక్కయమూల్యంబైన రత్నంబొసంగి పొమ్మని యనిపిన నతం
డారత్నంబు మ్రింగి పయనంబై పోవనొక్క పాటచ్చరుండెఱింగి
పథంబున బ్రాహ్మణువధియించి రత్నంబపహరింతునని వెంటనె
చనుచున్న చోరుండు బ్రాహ్మణుంజూచి యిట్లనియె. 365

ఆ. నీవుమ్రింగినట్టి నిర్మల రత్నంబు
నాకునిమ్ము యీక యూరకున్న
పొట్టవ్రచ్చియైనఁ బుచ్చుకొందునుఁ దాని
ననములిమ్ముచునకు ననియె ద్విజుఁడు. 366

క. నీకడుపు రత్నదళకము
నాకీయకయున్న నడుమునరకెదననుచున్
వాకోపవాక్యములఁ బెను
పోకలు పోవంగ నచటఁ బొందినచోరుల్. 367

వ ఇరువురిమాటలువిని దొంగంజంపి పదిరత్నంబులును, బ్రాహ్మణుఁ
జంపి రత్నంబునుం బుచ్చుకొందమని యాయిద్దఱినిం బట్టికొను
టయు.

క. తనచావుదప్ప దీబ్రా
హ్మణుఁగాచెదఁ జావకుండ నదియెట్లనినన్
మునువిప్రుఁజంపి మణిగొని
ననుజంపకమానరని మనంబునదలఁచెన్. 369

వ. అనితలంచి యచ్చోరుండు దొంగలతోనిట్లనియె. 370

ఆ. బ్రాహ్మణుండు నాకు బావ నేమఱఁదిని
హాస్యభాషణంబు లాడుకొనఁగ
సత్యమనుచు దలఁచి చంపెదరైతిర
నన్నుఁజంపి మణులుగన్నపిదప. 371

క. మఱివిప్రుఁ జంపుడనఁ ద
స్కరునిన్ వధియించివాని జఠరములోనన్
వరమణులు లేకయుండిన
ధరణీసురుఁగాంచి చనిరి తస్కరజనముల్. 372

క. అవివేకి చెలిమికంటెను
వివేకి యెడవైరమొప్పు విపినంబున భూ
దివిజునిఁగాచెం జోరుం
డవనీశుఁడు క్రోఁతిచేత హతముం బొందెన్. 373

వ. అదియెట్లనిన. 374

సీ. ఒకనాఁడు నృపతి వేఁటకునేఁగి మర్కట
శిశువునుఁదెచ్చి పోషింపఁబొగి
యదియువర్ధనబొంది యధిపతిహితచర్య
వర్తింప నాసన్నవర్తిఁజేసి
ఖడ్గమొక్కటి దానికరమునకందిచ్చి
యేనిద్రబొందెద నీవునన్ను
బోతుఁటీగైన ననుఁ బొలయంగ రాకుండ
గాచుండు మెవ్వరేఁగదిసిరేని

ఖండనము చేయుమనిన నక్కపియునట్లు
యుండి భూపతినిద్రింప నొక్కయీఁగ
ముట్టుటయు ఖడ్గమున దానిబెట్టుగొనిన
గళము దెగుటయుఁ బ్రాణసంగతికిఁబాసె. 375

వ. అట్లుగావున. 376

క. అవివేకి చెలిమికంటెను
వివేకియెడవైరమొప్పు విపినంబునభూ
దివిజునిగాచెనుఁ జోరుఁడు
ప్లవగముచే నృపతిచచ్చె భవనమునందున్. 377

వ. అట్లుగావున నవివేకియైన మేఖలతోఁడిపొంగు చారాయణు[1]నికి
వలదని చెప్పుకొనిరంత. 378

ఆ. భాగురాయణుండు పనిచెం గళావతి
కపటవర్తనంపు గతులుచెప్పి
యదియునామృగాంక కవ్విధంబెఱిఁగించి
లలితమణులచే నలంకరించి. 379

సీ. అల్లనఁదోకొని యరిగి భూపతినిద్ర
చెందినయవ్వేది యందునిల్పి
నీమణిహారంబు నృపతికంఠమ్మునఁ
బెట్టుమాతఁడు నిన్నుఁబట్టెనేని
రత్నసుందరికి పెఱితువు నీవని, బోలు
గంభంబుఁజొచ్చి చీఁకటినినిలువు
మనుచు బోధించియు నామృగాంకనుబాసి
చనికళావతి యొక్కచక్కినున్న

1. చారాయణుఁడే చాగరాయఁడు.

తే. నామృగాంకయు నటువలె నాచరించి
తలఁగుటయులేచి యభ్యాగమితల విభుండు
రత్నసుందరిమీఁదను రక్తిఁగొంత
వదలి యక్కాంతపై నిలువంగఁజేసె. 380

వ. అంతఁబ్రభాతంబైన సర్వసఖుండైన చారాయణుని రప్పించి రాత్రి
వృత్తాంతం బెఱింగించిన నతండిట్లనియె. 381

మాలిని :
లాటనరేశ్వరు పుత్రుఁడుగాదది లక్షణభార్యవిశేషలస
త్పాటలగంధి మృగాంకవతీయను పద్మవిలోచన దేహళశా
హాటకరేఖ మనోహరరూప ప్రియంబున బెండిలియాడుమునాఁ
జాటకునింగొనియాడి తదీయవిచారము చేయుచునున్నతఱిన్. 382

వ. భాగురాయణుండు కళావతింబిలిపించి రత్నసుందరికి హితుండునుఁ
బోలె మేఖలా మానభంగంబునకుం బ్రతీకారంబుగా మృగాంక
వర్మను నాడురూపుగాఁబన్ని కేయూరబాహునకుం బెండ్లిఁజేయుద
మని రత్నసుందరికి వినుపింపుమని పంచుటయును. 383

క. అదిపోయి యట్లచెప్పిన
మదిసంతసమంది యిదియ మార్గంబనుచున్
మదవతి మృగాంకరేఖను
విదితముగా బెండ్లిఁజేసె విభునకునంతన్. 384

క. తనయుఁడని మున్ను మీరా రా
ద్దనుబెట్టినవాఁడు గన్యతక్కన్యను మీ
జనపతికినిమ్ము నాకొక
తనయుండుదయించెనేకుఁ దమ్ముండగుచున్. 385

క. అనిలేఖఁ జదువ నాసతి
విని లజ్జాఖేదదశల విస్మయపడుచున్
జనుని వెలపింతు రాఁ
[illegible] 386

వ. అని రత్నసుందరి ధైర్యంబవలంబించియుండెఁ గావున. 387

క. రాజును రాష్ట్రమునిల్పెను
రాజితముగ మంత్రి భాగురాయణుఁడు మహిన్[1]
బూజయుఁ బుణ్యముఁ బడసెను
నైజముగానెల్లవారు నమ్ముచు నుండన్. 388

ఉ. హాటకనేత్ర! నేత్రకలితాబ్జ దివాకర! వాకరక్రియా (?)
పాటవరూప! రూపజితబంధుర కంధర! కంధరావృతా
చ్ఛోటితరత్న(?) రత్ననిధిసుందర భవ్యనివాస! వాసవ
తస్మాటన! కుంటముక్ల పినభైరవమానసపద్మభాస్కరా! 389

క. శ్రీమద్వేంకటశైలమ
హీమండల సార్వభౌమ! హేమాంబర! సు
శ్రీమహిత! పిన్నభైరవ
ధీమానసనాథ! వినుతధిషణసనాథా. 390

కవిరాజితము :

కమలవిలోచన! కౌస్తుభభూషణ! కంజభవా
ద్యమరగణార్చిత! నాకమునీశసమాశ్రయ! శ్రీ
రమణి మనోహర! రాక్షససంహార! రక్షణ చి
త్రమముదిత గంగయభైరవపాత్ర శుభస్థిరదా. 391

గద్య :

ఇది యష్టభాషాకవితా ప్రవీణ నవఘుంటసురత్రాణ కూచనా
మాత్య పుత్ర సుకవిమిత్ర వినయ విద్యావిధేయ వెఱ్ఱయనామ
ధేయ ప్రణీతంబైన సకలనీతికథా నిధానంబను మహాప్రబంధంబు
నందు ద్వితీయాశ్వాసము. 392

-:o:-

# తృతీయాశ్వాసము

శ్రీనిత్య కుంటముక్కల
ప్రాణేశ్వరమంత్రి పిన్నభైరవ పాత్రో
ద్యానశుకరాజ! కమలో
ర్వీ నిర్మలహృదయనాథ! వేంకటనాథా! 1

వ. అవధరింపుము నారదుండు బలీంద్రున కిట్లనియె నివ్విధంబునకే యూరశాహుండును మృగాంకవతిని వివాహంబై రాజ్యంబు సేయుచుండ భాగురాయణుం డొక్కనాఁడు కథాప్రసంగవశంబున నిట్లనియె. 2

క. ములు ముంటఁ బుచ్చుగతిఁ దా
నలయక భూజనములెల్ల నానాననఁగా
ఖలునకు ఖలగుణములనే
బలిమియడంగింపవలయుఁ బ్రాభవశక్తిన్. 3

వ. అదియెట్లనిన. 4

సీ. శార్దూలమొకటి మాంసము భుక్తిగొనుచోట
దవడ యెముకనాటఁ దివియలేక
కూపెట్ట నొకతరు కోటరంబున నున్న
మ్రానుపోటను పక్షి[1] దానిఁజూచి
యేటికి వాపోయ దెమ్ముకి వుచ్చెదఁ
దెఱుము నోరనవుండు దెఱచియున్న
వదనంబుజొచ్చి దవడనున్న యెమ్ముక
వుచ్చియప్పులిఁబాసి భూజమెక్క

ఆ. పులియునొప్పి బాసి పులుఁగుతోఁ జెలికాఁడ
మాచరించి పక్షియామిషంబు
నడుగుటయునుఁ బెట్టకనియె నప్పులుఁగుతోఁ
జెలిమిదలఁచి నోరఁ జిక్కినపుడు. 5

వ. తినక, నిన్ను వెళ్ళవిడుచుట ప్రత్యుపకారంబుగా దలంచుకొను
మనిన నట్లకాకయని, యప్పులిఁగాచుకొనియుండ నొక్కనాఁడు. 6

క. పలలముదిని మత్తా[1]గొని
పులి, నిద్రింపంగ మ్రానుపోటు రయమునన్
దలఁద్రొక్కి యొక్క నేత్రము
గెలఁకిదివంబునకు నెగసెఁ గృతమతియగుచున్. 7

క. పులిజూచి పలికె నాకుం
జెలివని యొకకన్ను వొడిచి చిక్కినకన్నున్
గెలఁకక విడిచితి నృపకృతి
కిల నుపకారంబుసేయ కెట్లుండదగున్. 8

వ. అనియుపహసించి యథేచ్ఛనరిగెనని నారదుండు బలీంద్రుని నింక
నొక్కకథ వినుమని యిట్లనియె. 9

క. కరలిఖితంబులు చదువను
పరిమళముల దండగట్టఁబవనము ముడువన్
సురపథముఁ గొలువవచ్చునుఁ
దరుణులచిత్తంబు తెలియఁదరమె తలంపన్. 10

వ. అవియెట్లనిన. 11

1. "మత్తాశబ్దోఽశక్యః" అని ఛహోబలపండితుఁడు.

సీ. అసమాస్త్రపురి మనోహారిణి యనులేమ
సౌందర్యవిభ్రమచారు మూర్తి
కర్ణారుఁడను నొక్క కష్టరూపునకు మో
హించితానింటివారెఱుఁగకుండ
నాతని వెంట దాక్షారామపురమున
కరిగి యందొకచోట నిరవుగాఁగ
నున్నచో కర్ణారుఁ డన్నగరంబునఁ
దాంబూలపుష్ప పదార్థచయముఁ

తే. దెత్తునని పోవయొంటి నత్తెరవయుండ
పురములోపలి పల్లవుల్ తరుణి వినఁగ
నిట్టిలావణ్యవతియైన యిందువదన
యకట వీనికిఁ బ్రాప్తమెట్లయ్యెననుచు. 12

వ. తమలో నిట్లనిరి. 13

చ. ధనికుఁడొ చెప్పఁజూపగ వదాన్యుఁడొ శూరుఁడొ! రూపవంతుఁడో!
మనములరింపనేర్చు రతిమర్మవిధిజ్ఞుఁడొ! వీనివెంట నీ
వనరుహనేత్ర తావలచి వచ్చుటయేమని యెన్నవచ్చునా
చెనఁటి విధాత మర్కటము చేతికి మౌక్తికహారమిచ్చెనే. 14

వ. అనినమతియొక్కరుం డిట్టులనియె. 15

ఉ. అంగన జాతిహీను వికలాంగుఁగురూపుని నైన నెప్పుడున్
సంగతివాయకున్న తనజవ్వనమాతని సొమ్ముసేయు న
య్యంగజుఁడైన మారగతుఁడైనఁ దలంపదు, పుష్పవల్లి దా
నెంగటి బూరుగున్ విడిచిపోవునె చూతపుమ్రాఁకుపోతముల్. 16

క. అనుమాటలువిని యంగన
మనమునకర్ణారుమీఁది మచ్చికవదలెన్
వనితపరపురుషబోధలు
వినినను మరుబోఁదనైన విరసముపుట్టున్. 17

వ. ఇంకశూద్రకుని చరిత్రంబు వినుమనియిట్లనియె. 18

ఉ. అంగజమూర్తి శూద్రకధరాధిపుఁ జూడఁగఁగోరి యొక్క మా
తంగ లతాంగి యాత్మకరతామరసంబునవొక్క కీరమున్
సంగతిగా (ధరించి) జనసంఘము విస్మయమందఁజేనికిన్
ముంగలనిల్చి కీరకుల ముఖ్యునిఁగానుక యిచ్చియిట్లనున్. 19

క. చదువంగ నేర్చుఁగావ్యము
(ల)దుకంగానేర్చు మాటలాడఁగనేర్చున్
ద్రిదశేంద్రవిభవఁ యీశుక
మదియిదియునవేల విద్యలన్నియుఁనేర్చున్. 20

క. అనివిన్నవించి శూద్రక
జనపతిమన్నించి యనుపఁజనియెను నృపుఁడున్
మనమలర జిలుకపలుకులు
(వినువే)డుక దాని జన్మవిధముడుగుటయున్. 21

వ. అక్కిరం బాశీర్వాదంబుచేసి యిట్లనియె. 22

సీ. వింధ్యాద్రి దక్షిణోర్వీతలంబు (నఁబంప
యనఁగలదొక్క) పద్మాకరంబు
తత్తటంబున భూర్జతరువుండు (శాఖల
నఖల) బ్రహ్మాండంబు నావరించి

యందుమాతలిదండ్రు లధివసింపగనొక్క-
శబరుండు వారలఁ జంపుటయును
బోదనై యొక కంపపొదదూరి (హారీతుఁ
డనుమునిఁ) జేరినవతఁడునన్ను

తే. నుపచరించుచు జాబాలి యొద్దనిడిన
జ్ఞానమున మౌని నాదుజన్మంబు నెఱిఁగి
పెనిచి వృత్తాంతమెల్లఁ జెప్పినను వింటి
నంతయునునీకు వినుపింతునవధరింపు. 23

క. తారాపీడుండను ధా
త్రీరమణుఁడు సుతులు లేమి ధృతిదరుగుచు నా
భూరమణుఁడు కలఁగ నెసహా
చారిణివదనంబుఁ జొచ్చెఁజంద్రుండనుచున్. 24

అంత :

ఆ. (మంత్రివరుఁడు) తనదుమగువకు శతనాభిఁ
గమలముద్భవింపఁ గాంచెస్వప్న
మమ్మహీశ్వరుండు నమ్మంత్రివరుఁడును
సుతులు గలిగిరంచు మతులఁ దలఁచి. 25

వ. ఉండి రంతనయ్యురువురిభార్యలు పుత్రునిం గాంచిన......
......(కొన్ని పత్రములు జారిపోయినవి) 26

క. ఆపుండరీకుడంతట
నాపై మోహంబు నిలిపి ననుబిలిపింపన్
వాపోవునంత విరహ
వ్యాపారమునందు నలసి ప్రాణమువిడువన్. 27

వ. ప్రియమిత్రుండైన కపిలుండు దుఃఖంపుచున్న నేనును నతిదుఃఖ
తనై యున్నసమయంబున. 28

తే. ఇందుబింబమ్ము వెడలొక సుందరుండు
పలికెనిట్లని రెండవ భవమునందు
నీకుబతియగు వీఁడు నో నీలవేణి
యనిన నూరడియేఁ దపమాచరింతు. 29

సీ. అనివినిపించి నాయనుఁగు నెచ్చెలిమది
రా చిత్రరథుల గారాపుదనయ
కాదంబరీ నామ కన్యకగలదునీ
కిప్పింతునర్థమ్మని యిందుపీడుఁ
గొనిచని యాకాంతకును వివాహముసేయు
నీపత్రలేఖ నయ్యోడనునిల్పి
జనకుప్రాలాకు వచ్చినసైన్యములఁగూడి
యాత్మపురంబున కరుదెంచి

తే. జనకునకుమ్రొక్కి తగినదీవెనలబొంది
మంత్రికశునాసుఁ డాత్మకుమారునడుగ
నతఁడు ననుఁగూడి రాఁడయ్యెనడనజిక్కి
నన బలాహకుఁ డిట్లనె నవని పతికి. 30

క. భూతావేశంబున శుక
రీతులబల్కుచును నెవ్వరికిఁ దీర్పఁగరా
కాతరువులలో దిరుగుచు
నేతరినైయున్న వానినెటు (దేనొప్పన్) 31

వ. అనిబలాహకుండు వినిపించినఁ దారాపీడుండు కుమారునిఁజూచి
నీవేమిచేసితివో (యని) కోపించిన నేఁబోయి తోడ్కొని వచ్చెద
నని బలాహక సహితుండై పురంబువెలువడి యమ్మహా......
యాశ్రమంబున కరిగి యున్నడు. 32

సీ. వినమితోండగుచు దీవెనబొంది మత్సఖు
(విధము నెఱుంగుదే) విమలనయన!
యెచ్చటనున్న వాడెఱుఁగు దే నెఱిగింపు
మనిన మహాశ్వేత యనియెనప్పు
డొక్క సుకుమారకుఁ డొంటినా వెనువెంటఁ
దిరుగుచుననుఁ బట్టకరముచాపఁ
గోపించిశుకమవై కూలుమునీవని
శపియింప విప్రుఁడు వచ్చెననిన

తే. అవనిపతి పుత్రుఁడును కవితాసుఁడైన
పత్రరేఖాదులరిగి యప్పాటుచెప్ప
నంతకాదంబరీకాంత యరుగుదెంచి
దుఃఖమున పత్రరేఖయుఁ దురగమణిని 33

వ. వాగె వట్టుకొని శోకావేశంబున మరణంబు బొందెదనని యక్కో-
లనమునిఁగిన నయ్యశ్వంబు కపింజలుండను మునియయ్యె నంతట
శ్వేతకేతుం డచ్చటికిం జనుదెంచి దుఃఖింపుచున్న కాదంబరీ
మహాశ్వేతా పత్ర రేఖల నూరార్చెనప్పు డడివిని తారాపీడశుక
నాసులు నచ్చోటికే తెంచిరంత. 34

క. చిలుకై వైశం పాయనుఁ
జెలమిన్వహియించె నంత నిందుఁడుఁ జొచ్చెన్
లలిఁజంద్రపీడు దేహం
బలవైశం పాయానాఖ్యుం డబ్బుండయ్యెన్ 35

వ. అనిజాబాలి మునీంద్రుండు ఋషులకు వినిపించుట వినియెనచ్చోటు
వాసియొక్క శ్యపచనివాసంబుపై త్రోవగానరుగుదేర నొకమా
తంగకన్యక నన్నుబట్టికొని తోలుఁబంజరరబున నిడియెనంత. 36

క. రవియ _స్తమించె బడమట
రవిపాషాణముల తీవ్ర రశ్ములడంగెఁ
భువనములు మూటికిమ్ముగ
గవిసెన యిడిరనఁగ నంధకారముఁ దోఁచెన్. 37

వ. ఏనునుఁబథశ్రమంబున నిద్రించి ప్రభాతరంబగుటయు మేలుకొని కనుగొనునప్పుడు. 38

ఆ. పంజరంబుమంచి పసిఁడిమైయుండిన
కన్యదెచ్చిమీకుఁ గానుకిచ్చె
యేమిగారణంబొ! ......
............... 39

శా. మాతంగాంగనఁ బిల్వబంచి శుకుసన్మానంబునం బల్కెనో
ధౌతాంబోరుహానే...............మున్
చేతఃప్రీతిగ జెప్పుమన్ననియెన్ శ్రీదేవి నేనీశుకీ
పోతంబే చెలికాదుమ.........డ్డవి. 40

ఆ. అట్టిశూద్రకుఁడు ప్రాణంబులోఁబాసి
పోయిచంద్ర పీడుబొందిచొచ్చె
........................
తనువుచొచ్చి దేవధారి యయ్యె. 41

సీ. ప్రాణంబు లీగతిబడసి చంద్రాపీడ
పుండరీకులుస............
......బంధుజనులు సంతోషింపఁ
జతురంగబలములు నతిఁడలిర్ప
కాదంబరీకాంత.........
......దుహృదయ సంప్రీతివెలయ
పుండరీకునకు నప్పొలంతి మహాశ్వేత
భార్యయై............. ...

తే. యిట్టిభవము నొంది యమహీశ సుతుడు
సకలసైన్యంబు గొలువనుర్వ......
..............నీపురినధి వసించి
చెలువుమీరంగ రాజ్యాభిషిక్తుడయ్యె. 42

వ. ఇంకనొక్క కథచె(ప్పెదవినుమనిన)

సీ. ఇలనిలా వర్షంబు నేలువజ్రుండును
జనపతి నలువురు సచివవర్తుల
వరగృహాసన వస్త్రవాహనస్త్రీలను
రినక్రొత్తగాఁబెట్టుఁడనినవారు
నట్లచేయుచునుండ నందులో నొకమంత్రి
వరుసకుఁగన్నియ దొరకకయున్న
చింతింప నిమ్మంత్రి చెలికాఁడు వరరుని
తంత్రినాఁదగు కన్యతన తనూజ

మంత్రివరునకు నిచ్చి యమ్మగువవజ్ర
హానునిముందట నిడుమిది యఖిలకళలు
నెఱుఁగుఁగథఁజెప్ప నేర్పు భూమీశ్వరునకు
నన్యచిత్తంబు లేకుండనాదరించు 43
(ననినన్మంత్రి వరుఁడును నట్లసేయ)

తే. దాదియనుచరగాఁగ నత్తంత్రికన్య
యుర్విపతిఁగూడి సుఖగోష్ఠి నున్నవేళ
మక్కువలరంగనుప మాతదిక్కుచూచి
యొక్కకథ జెప్పెనమ్మాత యోకొనంగ. 44

వ. కుంజర పురంబుననొక్క సార్థవాహుండు బేరమువోవుచున్న నతనియొద్దు నడవిలోజిక్కిన విడిచిపోయిన నెద్దులావు కొనిఖింకె జేసిన. 45

ఉత్సాహ :

బండియెద్దు అంకెచెవులఁ బడినసుగ్రకోపియై
చండపింగళాభిదాన సత్యనాధుదుద్ధతిన్
చండసంహృతాహ్వయుఁడైన జంబుకప్రధానునిన్
శౌండసత్వరాశి నరసిఁజూడ చెప్ప రమ్మనెన్. 46

వ. ఆసృగాలంబు మృగరాజున కిట్లనియె. 47

క. బోయలతో నొకభూపతి
యాయోధనమాచరింప నడచేరివడన్
బోయియొకనక్క దానిని
వాయింపుచుఁ బలలబుద్ధి వ్రచ్చుచునందున్. 48

వ. ప్రవేశించి మాంసంబుగానక కడమదిక్కునువచ్చి నెడలేఁగావున రవంబుకుందలంకనేటి కనిన నక్కంఠీరకంబు తాఁబోయి యరసి వచ్చెదనని చని యానందకునిఁగాంచి యిట్లనియె. 49

ఉ. ఎందులనుండివచ్చితి మృగేశ్వర! యన్నను దేవనైచికే
నందనుఁడాభినందకుఁడ నందకనాముఁడ నాకభూమినా
మందిరమిద్ధరామృగ సమాజముఁ జూడగవచ్చినాఁడ
చందమిదన్న పంచముఖ సఖ్యముఁజేసెను నంచు తోఁడినాతన్. 50

వ. అదియెటింగి సంహృతనామజంబుకం బాత్మకులంబు గూర్చుకొని యిట్లనియె. 51

క. సహవాస దోషమునసే
మహితాత్మునకైన నదియు మార్గంబగుట
త్సహవాసంబున ఖలుఁడును
మహితాత్మకుఁడగుచు జనులమన్ననగాచున్. 52

వ. అదియెట్లనిన. 53

సీ. వేటవోయొక భూమివిభుఁడు బోయలపల్లెఁ
జేరంగవాకిట చిలుకచూచి
జనపతి చనుదెంచె జంపిసొమ్మెల్లనుఁ
బుచ్చుకొండనుటయుఁ బోకమగిడి
యొకమునీశ్వరుల పల్లెకుఁజేర వాకిట
కీరంబు వలికెను క్షితివిభునకు
నర్ఘ్యపాద్యాదు లిమ్మనిన సంతోషించి
మునుపటి చిలుక తన్ననినమాటఁ

తే. జెప్పుటయు భూమిపతికి నచ్చిలుకపలికె
నట్టికీరంబునాతోడ బుట్టెదుష్ట
సంగతంబున నిన్ను నభ్యంగిననియె
శిష్టసంగతినేఁ బూజసేయుచుంటి. 54

వ. అట్లుగావున. 55

క. నందకసంగతి మనలను
నిందఱదిగవిడిచె నీమృగేంద్రుఁడుభేదం
బిందు ఘటింపకయున్నను
ముందటికార్యంబు మనకు మోసముగాదే! 56

వ. అట్లుగావున నేఁజెప్పినబుద్ధి క్రమంబున నడచుట లెస్స నడవక
యున్న నపాయంబు వుట్టునది యెట్లనిన 57

క. సత్పురుషులేవి చెప్పినఁ
దాత్పర్యము తోఁడనదియ తగఁజేయుదగున్
వ్రాత్పురుషు లేదిచెప్పిన
తత్పరతం దిరుగఁగార్య తత్వముదప్పున్. 58

వ. అదియెట్లనిన.

ఆ. కచ్ఛపంబుతోడఁ గలహంస లొకరెండు
మైత్రిచేసి యొక్కమడుగునందు
మెలఁగ నాహ్రదంబు జలమింకఁ బారిన
నంబుచరము చూచి హంసలనియె. 60

వ. మానస సరోవరంబున కరిగెదము నీవువచ్చెదేని యీకాష్ఠంబుఁ
గఱచిపట్టుకొని మాటాడకయుండు మనిన నది యట్లచేసిన 61

తే. రెండుహంసలునక్కఱ్ఱ రెండుగడలు
కఱచుకొనియెగసి పోవ సృగాల మొకటి
యంబుచారంబు భక్షింతు ననితలంచి
గగనమున నున్నహంసలఁగాంచి యనియె. 62

క. కటకట ! యీకమఠముమీ
రటుగొనిచను టెల్ల మెసఁగనా ! యన ముఖసం
పుటముడిగి హంసలేలా !
యటుచేసెదరనుచుఁ గూర్మమననిం బడియెన్. 63

క. కొక్కెరలు వాసిపోయిన
నక్కయుఁదా బేటిఁ జేరి నమలఁగఁ బోవన్
జక్కఁగ నవయవములుదన
యక్కటిలో నణఁచియున్న నాజంబుకమున్. 64

ఆ. తినఁగనలవిగాక త్రిమ్మలుఁగుడువంగ
కమఠమనియె జంబుకమునుఁ జూచి
నేర్పులేదు నీకు నీటిలో నానంగ
బెట్టితినుము వేతపెట్టవలదు. 65

క. ఇదియవ్వనని కమఠంబును
వదనంబునఁ గఱచికొని శివాప్రభుఁడరిగా(?)
నదినీటముంచిమీఁదం
బదమిడి యొకకొంత ప్రొద్దు పదిలముజేసెన్. 66

వ. అక్కచ్ఛపంబుఁబిలిచి నానితివోటని యడిగినం గొంతకొంతనాను
చున్నదానక్షణమ్ము నిలువుమనిన నదియును నట్లచేసికొంతప్రొద్దు
నను నెప్పటియట్లపిలిచి యడిగిన. 67

క. పేరవనాయకఁ దేహము
నీరునఁదగనాని నడుగునిలిపినచోటన్
వారిందడిసియని కతమున
దారువువలెనున్న దడుగుఁ దలఁగింపవయా. 68

క. నీపదమించుక నివియుము
కోపింపక యనిన (దివియఁకూర్మపతియుఁదా)
నాపదదప్పిన జలముల
లోపలికిని (బోయెనాత్మలోకంబునకున్) 69

క. అదిగావున వచనస్థితి
హృదయంబున నిలుపరేసి నిందఱుహింసా
చ్యుదిత ములు మఱచి త్రెళ్ళిన
యుదకచరం బట్లునాశ మొందుదురనుచున్. 70

తే. నందకుండున్నయడకు నానక్కయరిగి
క్రూరజంతువు సింహంబుఁ జేరియెట్లు
బ్రతుకఁగలదిది వదియేల బ్రతుకనిచ్చు
మిగులనాఁకలిపుట్టిన మెసఁగుఁగాక, 71

క. క్రూరుల సహవాసంబును
వైరుల యాశ్రయముచెనఁటి వనితల పొందున్
గోరికలుడుగ మనుజులఁ
జేరినవేల్పులకు జేటుసిద్ధముగాదే. 72

వ. అనినందకుఁజూచి మఱియు నిట్లనియె. 73

ఆ. యొక్కరాజుశయ్యనొందిన యంకుశ
యూక యొక్కనల్లి రాకచూచి
యనియె నీవుగుట్టి చనుదువునేనని
పట్టిచంపుదురు స్వభావమదియు. 74

వ. అనుసమయంబున వారిద్దఱు వాదడువ నమ్మహీపతి శయనించిన
నల్లిగుట్టిచనిన వెదకిచీరపేలనెల్లఁ జంపి రట్లుగావున మఱియును
నొకకథ వినుమని జంబుకంబు నందకున కిట్లనియె. 75

క. శాంతుఁడనినమ్మి దుర్జను
చెంతన్ వసియించి పలుకుచేసిర యేనిన్
గాంతురు సుజనులు భయదకృ
తాంతగ్రైవేయ భూషణాంచిత మహిమల్. 76

వ. అదియెట్లనిన. 77

క. ఒక్కయగాధపు మడువునఁ
గొక్కెరయును మత్స్యములునుఁ గూడుండినచో
నక్కుటిలబకము ఝషముల
దిక్కుగనుంగొనుచు నేడ్చె ధృతిదఱుగంగన్. 78

సీ. కొక్కెర యీరీతిగోలుగోలున నేడ్వ
మీనంబులెల్ల సన్మానమునను
జేరియేడ్చుటకునుఁ గారణంబెట్టిది
యనిన న నావృష్టి యరుగుదెంచె

నీమడుఁగింక మిమ్ముం దఱిడించిపో
వఁగజాల కేడ్చెదననుఁగులార !
మన మిందఱముగూడి మానసంబున నవ
గ్రహ దోషకాలంబుగడపి మగుడ

తే. వత్తమనవుండు మేమొల్లువత్తు మనిన
చంచుపుటమున గొనిపోదునంచు బట్టి
యుడు పథంబున కేఁగి యొండొక్కచోట
భక్షణముచేయుదినమున బకవిభుండు. 79

వ. అంత. 80

క. ఒకయెండ్రిక, ననుఁగొనిపో
బకవల్లభ ! యనిన దానిఁ బట్టుకపోనే
రక, దానిడెక్కదనకు
త్తుక యిఱుకగఁ జేసి యఱుగదొడిగిన నదియున్. 81

వ. అవ్విధంబున నరిగి యబ్బిసకంఠిక వ్రాలు శిలాతటంబున గనుపట్టు
మత్స్యశల్యంబులుచూచి యిప్పాత్కుం డిందఱి భక్షింపంబోలు
నని తనడెక్కల కంఠంబిఱికి చంపెంగావున. 82

క. నందక ! నీవక్కసరి
యందున్ విశ్వాసముడుగు మనిజంబుక మా
నందుని వీడ్కొని సింహము
ముందఱికిఁబోయి మొగము మూఁచుచు బలికెన్. 83

తే. ఉష్ట్రమొక్కటి వనమున నొంటిచిక్కి
చెలఁగి సింహంబుతో మైత్రిఁజేయుచుండ
శివయుఁగాకియుఁ దాని భక్షింపఁదలఁచి
కాకితోడు త వజ్జంబుకంబుపలికె. 84

సీ. తీతువపిట్టలబ్ధి ప్రదేశంబున
 గ్రుడ్డులబెట్ట నా గ్రుడ్డులవిసి
పిల్లలౌటయు వానిఁ బెట్టి మేఁతకుఁబోవ
 నవి సముద్రుఁడు గొంచునరుగుటయును
పెంటిదుఃఖింపఁగ పెట్టతేఁడూ ర్చి
 కథచెప్పఁదొడఁగె దుర్గంపుటడవి
పులివెంటఁబట్టిన బోయండు పాఱియుఁ
 దరువెక్కుటయును నాతరువునందుఁ

తే. దొల్లియున్నట్టిప్లవగమూభిల్లుఁ దిగిచి
యిరవుగానంక తలమునసీఁగి కొనిన
పులియు నావృక్షతలమున నిలిచికపినిఁ
బలికె నిట్లని సాంత్వన భాషణముల. 85

తే. ఒక్కవనమున మనము గూడున్ననీవు
నన్నువిడువంగఁదగునె వానరకులేంద్ర
నమ్మినినుఁ జెరుచు నరుఁడు నిక్కమ్ముగాఁగ
వినుముచెప్పెద దొల్లొక్క విప్రవరుఁడు. 86

క. అడవికి సమిధల కరుగుచు
వడగొని యుదకంబు గ్రోలవలసొకనుయ్యో
క్కడగాంచి చేరనందులఁ
బడిభయపడు వ్యాఘ్రమనుజఫణికపి వరులన్. 87

ఆ. వెడలఁదీయఁదలఁచి నిడుదవల్లులువైచి
ద్వీపి నాగకపులఁ దిగిచివైవ
నీవుగలుగఁబట్టి యీవేళ బ్రతికితి
మవని సురవరేణ్య యనుచుబలికె. 88

వ. ఈనూఁతం జిక్కినస్వర్ణకారుండు పాపిష్ఠివీని వెడలం దివియకుమని బుద్ధిచెప్పి యొకవేళ మమ్ముంజూడ విచ్చేయుఁడని యథేచ్ఛం జనిన నమ్మహీసురుం డప్పుడు. 89

క. పాపము మర్త్యుండకటా
కూపము వెడలంగలేక కూపెట్టెడు నీ
కూపము వెడలించెదనని
యాపారుఁడు వెళ్ళఁదిగిచె నయ్యగసాలిన్. 90

సీ. అంతటనొక్కనాఁడవనీసురేంద్రుండు
వనమునకరుగ నవ్వనచరంబు
తనపూర్వ మెఱిఁగించి దండమర్పణ చేసి
పుష్పఫలాదుల పూజసేయ
నవియందికొని విప్రుడటవోవ నొకపెద్ద
పులిఁజూచి భయమునఁ బొందుటయును
వెఱవకుమని తనవృత్తాంత మెఱిఁగించి
తానొక్క రాజనందనునిఁ జంపి

తే. దాచినటువంటి సొమ్ములద్ధరణిసురున
కిచ్చుటయునునొక్క పురమునకేఁగి ద్విజుఁడు
నాఁటియగసాలి చేతికి నమ్మి యియ్య
నృపతిపుత్రకు తొడవుగా నిశ్చయించి. 91

క. భూపాలపుత్రుఁ జంపిన
పాపాత్ముండనుచు విప్రుఁబట్టింపించెన్
త్క్ష్మాపతియు విప్రవధ శా
జ్ఞాపించెన్ దలవరులునుఁ జనిరట వారున్. 92

ఆ. అంతఁదొంటి యురగ మారాజ కూఁతును
గరచి విషముదిగక కస్తిబెట్టి
మంత్రతంత్ర విధుల మగుడకయవ్విప్రు
దిక్కుచూచినపుడె తిరిగె విషము. 93

క. తన్మాకాంతుఁడునా విప్రున
కాకన్నియనిచ్చి యతనికారాజ్యంబీఁ
గైకొనియేలుచు నా భూ
పాకారునిఁ జిత్రవధగఁ జంపించెవెసన్. 94

క. విపరీత జాతులైనను
నుపకారంబెఱిఁగి సేయనుపకృతిఁ జేయున్
గపటియగు మర్త్యుఁడుపకృతి
కపకారమొనలఁచువాని నణఁపగ వలయున్. 95

వ. అనిన నవ్వానరం బిట్లనియె. 96

క. హరిచేమృతిఁ బొందినపులి
నరుఁడౌషధ మిడిన వైద్యునదియే మ్రింగున్
బరికించి దుష్టజనులకుఁ
బురుషార్థము సేయునతఁడె పొలియుం బిదపన్. 97

వ. అనియవ్వానరంబు కిరాతు నుత్సంగంబు తలయంపిగా నిద్రించు
సమయంబున నప్పులియా శబరున కిట్లనియె. 98

సీ. వృక్షాగ్రమునఁ గలవింకములొకరెండు
నీడము ఘటియించి నిలిచియుండ
వర్షంబు గురియంగ వడఁకెడుకపిఁజూచి
కలవింకములువల్కెఁ గరుణవొదవి

గుడిలోననైనను గుడిసె కట్టుకనైన
వెచ్చనిచో నుండ నిచ్చఁగాదె
యనినఁ బత్తులునన్ను నపహాస మొనరించె
బ్రదుకుదురో! యనిప్లవగమపుడు

ఆ. గూడువెట్టియున్నకుజ శాఖఖండించి
యేటిలోనవైచెనిది వనచర
గుణముగాన దీనిఁగూలంగ వడఁద్రోయు
మనినఁ ద్రోసె భిల్లుఁడగచరమును, 99

వ. ఇవ్విధంబున వనచరంబుపడి మగుడం జెట్టెక్కు సమయంబునఁ బులిదానితోఁక వట్టుకొనిన వనచరంబిట్లనియె. 100

క. కదువోస పోయితక్కట
మెడఁబట్టక యనిన పులియు మెయికొని తోఁకన్
విడిచి మెడఁబట్టఁ బోయిన
యెడగని యభూరుహంబునెక్కెం గపియున్. 101

వ. శార్దూలంబును యధేచ్ఛనరిగె, వనచరంబును భయపడు కిరాతు వెఱపుడిపి ఫలంబులుదెచ్చెదనని యరుగుటయును. 102

ఆ. భిల్లుఁడగచరంబు పిల్లలభక్షించి
యంతఁగ్రోఁతి వచ్చి యడుగుటయును
పిల్లలున్నవసతి యల్లదె యనిచూప
బోయి వానరంబుఁ బొదివిచంపె. 103

వ. పులియునుం గృతఘ్నుండని కిరాతుని భక్షింపుట దోషంబని విడిచె నని కథ చెప్పిన టిట్టిభం బిట్లనియె. 104

క. ధరణికృతఘ్నుండగున
ప్పురుషుని భక్షింపమాంస భుక్కులరోయున్
బరికింపఁ గృతఘ్నతకును
సరియగు పాపంబులేదు శాస్త్రనిరూఢిన్. 105

వ. అట్లుగావున పిల్లలఁ దేకుండిరి నేని నక్కరాతఁడు వోయినగతిం బోదునని శపథంబు వలికియుప్పుడు. 106

ఆ. కులము నెల్లఁ గూర్చుకొని గరుడికిఁ జెప్ప
గరుఁడుడవ్విధంబు హరికిఁ జెప్ప
హరియుఁజక్రమేయ హరికినంబుధి మొక్కి
నెమ్మినిచ్చెటిట్టిభమ్ము సుతుల 107

వ. అట్లుగావున 108

క. ఏజాతి నుద్భవించిన
నాజాతింబ్రోచువాని నఖలజగమ్ముల్
పూజించునట్లు గాదేఁ
దేజంబణగించుమేని తెవులును బోలెన్ 109

వ. మఱియును. 110

క. కీడాచరించు మనుజులు
గూడిమెలఁగువారువలెనె కుత్సితవృత్తిన్
గీడేసేతురు నమ్మిక
గూడిన కీఁడగును సాధుగుణులకునైనన్. 111

వ. అనిశివావాయసంబు లొట్టెనుఁగు తోఁగపటస్నేహంబుచేసి మృగ పక్షికులంబు గూర్చుకొనియుష్ట్రి సహితంబుగా సింహంబు ముందటికింజని యిట్లనిె. 112

క. ఆకొన్నాడవు మృగవర
నీకేటికి నవయ మమ్ము నిలువరుపగనీ
యాఁకలి దీరుచుకొమ్మని
చేకొని యుష్ట్రింబునిడిరి సింహంబునకున్. 113

వ. అని చెప్పి సంహృతజంబుకంబు నందుని యొద్దకు వచ్చిన విశేషం
బులు గలవే యని యడిగిన నిట్లనియె. 114

తే. కుంజరశ్రేష్ఠుఁడొక లతా కుంజమునను
పత్రకాండ చయంబునుఁ బగులఁద్రొక్క
ఖగము లెల్లను గజము నిష్కారణముగ
గ్రుడ్లు ద్రొక్కెనే యని గమిగూడి యపుడు. 115

వ. తమసఖులైన నీలమక్షిక మండూక ద్రుమకుట్టన వాయసంబుల
కెఱింగించిన నవ్వాయసం బిట్లనియె. 116

సీ. మును కృష్ణ వల్కలుండను చిల్క సేవించి
బలవైరి కడకంపఁ జిలుక మ్రొక్కి
యంతకు దర్శించి యతని పీఠము క్రిందు
చొచ్చిన నింద్రుఁడా శుకముఁ జూపి
జరయుఁ జావును లేని సంసార మీచిలు
కకుఁ బెట్టుఁడనిన నక్కాలుఁ డపుడు
మృత్యువు రప్పించె మృత్యువు చిత్రగు
ప్తునిఁ బిల్వ చిత్రగుప్తుఁడును వచ్చె

ఆ. శక్ర చిత్రగుప్త శమన మృత్యువు లిట్లు
గూడినపుడె చిలుక గూలు ననుచు
బ్రహ్మ వ్రాతగాన బడియె నక్కీరంబు
ఫాలలిఖిత ఫలము లేల తప్పు. 117

వ. అనిన మండూకం బిట్లనియె 118

క. ఉద్యోగాన్వితుఁడగునే
సద్యఃఫల మిష్టభోగ సంపదలబ్బున్
వేద్యముల గుహ్యాద్యములు ని
రుద్యోగికి కార్యజాత మూరక పోలియున్. 119

వ. అదియెట్లనిన. 120

సీ. గరుడుండు [1]తాఁబేళ్ళఁ బొరిగొని భక్షింప
మతిమంతుఁడనెడు కూర్మంబుఖగవుఁ
గనుగొని పలికె నో ఖగకుల వల్లభ
జలమున నీకంటె జవము కలిగి
పరచెద నీ వభ్రపథమున బరవుమీ
నోడకుండినఁ దినకుండు మమ్ము
నోడినఁ దినుమన్న నోడఁబడె ఖగపతి
కూర్మంబు చని తనకులము వారి

ఆ. కెల్లఁ గజెప్పి వార్ధి నిండఁ ఆమును జేరి
సాగి పక్షి యాకసమునఁ బరచి
పిలచినపుడె మనము తలచూపి గెలుతుము
రమ్మటన్నఁ గచ్ఛపమ్ములలరి. 121

వ. ఇవ్విధంబాచరించి కచ్ఛపంబులు గరుడుని చేత ఘాతలకు బాసి
చనియెఁ గావున. 122

క. పలువురొక మూఁకగూడిన
బలవంతునినైన చిక్కుపరుతురు తార్క్ష్యున్
గెలువవె కచ్ఛపములు మును
జలనిధిలోఁ దలలుచూపి సాహసవృత్తిన్. 123

వ. అనిన నీలమక్షికం బిట్లనియె. 124

క. మనుజుడు ప్రాయంబుననే
పనియైననుఁ జేయనోపు బలియుండు వెలెన్
మనుజుండు ప్రాయహీనుఁడు
ఘనభుజబలుఁడయ్యుఁ గార్యగతులకుఁ దప్పున్. 125

1. గరుడుఁడు.

క. అదియెట్లనిన. 126

సీ. తొల్లియనావృష్టి దోఁచుటయును నొక్క-
పారుఁడు బోయలపల్లె చేరి
యయ్యవగ్రహకాలమరిగినఁ దమభూమి
కరుగంగఁ దలఁచి బోయలకునెల్ల
దధిదుగ్ధఘృతము ఖోత్తమ[1] పదార్థములతో
విందువెట్టిన భిల్లవిభుఁడు మెచ్చి
యీబహులద్రవ్య మెక్కడిదన్నను
ధేనువుఁబితికి సాధింతు ననిన

ఆ. గోవుమూల్యమిచ్చి కొనిపోయి పిదుకంగ
నెఱుఁగుక వని సురునకిచ్చినట్ల
యిమ్ముమాకుననిన నీకున్న దూడతో
విడిచి దాని నూరువెడలగొట్టె. 127

వ. అనిచెప్పిన యందఱుగూడుకొని మత్తగజంబునకు గవిసి. 128

ఆ. మ్రానుపోటుఁబులుగు మర్దించెకన్నులు
కాకివానిఁ దిగిచి కస్తిచేసె
నందునిప్పువెట్టె నానీలమక్షిక
యంతపాడునూఁతనఱచెఁగప్ప. 129

వ. ఆరావంబువిని యమ్మత్తేభంబు దప్పికొన్నది గావున నచ్చట నీరు
న్నదని వోయి యానూతంబడి మృతంబయ్యెఁ గావున. 130

క. బలవంతుఁడ నగవలవదు
పలువురతో విగ్రహించి భంగముపొందున్
బలవంతమైన యేనుఁగు
పులుగులచే భంగమంది పొలిసెదె పిదపన్. 131

---

1. యతోత్రిమ.

వ. అని మఱియు నిట్లనియె. 132

సీ. ......................

........................

పితృభూమి బడియున్న వీనుగున దుగుదీ
వనవుడు బోయి వాఁడడుగుటయును
నుజ్జనిపురవరమొద్ద నుండిన మఱ్ఱి
క్రిందని చెప్పంబు లిందుడపుడు ?
దానభోగక్రియా ధర్మాత్ముఁడై యుండ
మృత్యువు చక్కని మెలఁత యగుచు

తే. నాతనికిఁ బత్నియై యొక్కయవసరమున
నతఁడుఁ దానును బండెక్కి యరుగుచుండ
గోత్రి వోయినదని పుటి గొల్లవారు
చూడమృత్యువు గోత్రియై సొగయుటయును. 133

క. ఇదిగో మాగొత్రియ యని
యదిరాజునకెఱుఁగ జెప్ప నాతఁడు నిన్
పదిలముగ మఱ్ఱిక్రిందను
వధియింపగఁ బంపెవాని వసుధేశ్వరుఁడున్. 134

వ. అట్లుగావున. 135

క. ఏవలనవచ్చి పొందునొ
దైవికమునుఁ దప్పఁ ద్రోవధాతకు వశమా
దైవికమె ప్రధానమ్మగు
భావింపగమానుషంబు పనియేమిటికిన్. 136

వ. అని నందకు పీడ్కొని యజ్ఞంబుకంటు చండపింగళుండను సింహంబు
ముందటికింజని యిట్లనియె. 137

క. కొమ్ములు గలవానిని నఖ
రమ్ములుగలవాని శస్త్రధరుఁడగువానిన్
నమ్మక దీయఁగ వలవదు
చిమ్మునునాటించు జంపు చేరఁగ నేలా. 138

వ. అట్లుగావున. 139

క. నమ్మంగవలదు నందకుఁ
గొమ్ములు చూపెడిని, వాని గుణమెట్టిదియో
నెమ్మిగలదేని నొక వ
ర్షమ్మున నాజాడ చూడు సత్యకులేంద్రా. 140

వ. అనునంత నొక యకాల వర్షమ్ము గురిసిన నందకురమ్మని పిలువఁ
బంపుటయును. 141

క. వానకు తలవంపుచు న
ద్ధేనుసుతుండరుగఁదేర దృష్టించి శివా
జ్ఞానంబు మెచ్చి కేసరి
యానందకు కంఠమలమునది చిమ్ముటయున్. 142

క. సింగంబు పండ్లునాటిన
నంగము దొరగుచును నందుఁ డాయతి రేఖా
శృంగములఁజిమ్మ హరియున
ణంగెను విధిచేయుపనికి నాగగవశమా ! 143

వ. అనికథచెప్పి దాదించూచి మఱియు నిట్లనియె. 144

ఆ. సహజరిపుఁడు తానె జావంగఁ జూడక
చేరఁదిగిచి రక్షచేసి రేని
వానిచేత దారవశ్యముఁ బత్తురు
సర్పహారిని హరులు చచ్చినట్లు. 145

వ. ఎట్లనిన. 146

క. ఒకవేసవికాలంబున
సకలజలంబులును నింక సర్పంబుదకం
బొకచోటను గానక నూఁ
తికిజని భేకములుగాంచి దీనాననయై, 147

వ. ఆకప్పలఁ బ్రార్థించి క్షుధాపరవశుఁడనై తి నీరు గ్రోలఁదిగి వచ్చితి
నని యిట్లనియె. 148

క. పరిపంథి శరణుచొచ్చిన
విరసముగాఁ జూడ కావ్తువిధమున నయ్యా
తురునిఁగని రక్షచేయుట
పరమంబగు ధర్మమనుచుఁ బలుకుదు రార్యుల్. 149

వ. అని కరుణంబుగాఁ బలికినఁ గొన్ని కప్పలు సమ్మతించిన కృష్ణుం
డను దర్దురంబక్కప్పల కిట్లనియె. 150

సీ. ఒక్కవిద్యాధరు నుగ్మలిగర్భిణి
యొకయుత్సవము చూడ నుత్సహించి
నడువలేననిన నన్నాతుక గర్భంబు
తాఁదాల్చి యనిచినఁ దరుణిపోయి
యయ్యుత్సవముఁజూచి యంతట నొకజార
పురుషునితోడుత పొందుచేసి
పడఁపడి యింకగర్భము దాల్ప నేనోప
నని జారువెంటనే యరుగుటయును

తే. అతివగర్భంబు దాల్చిన యతఁ డ చరుఁడు
మూసములు తొమ్మిదియు నిండి మడసెగాన
ఫణులఁగాంతల నమ్మిచేపట్టరేని
ప్రాణగొడ్డంబులగు నట్టిపనులు పుట్టు. 151

వ. అనిన నురగంబిట్లనియె. 152

క. ఆశావశుఁడై మానవుఁ
డాశయపూనంగ వానినాశయ చెఱుచున్
డాసి(?)యొకనక్క మిక్కిలి
యాశన్ గొనయంబు గొఱికి హతుఁడగు పగిదిన్. 153

వ. అదియెట్లనిన. 154

ఆ. శబరుఁడొక్క భద్రసామజంబును జంప
నొక్కపుట్టయెక్కి యుగ్రశరము
వరపుఁబాము వెళ్ళికఱచిన ఫణిఁజంపిఁ
చచ్చె సామజంబు చచ్చె నంత. 155

ఆ. నక్కయొకటిచేరి నాగంబు నాగంబు
శబరుఁజూచి మదిని సంతసిల్లి
దినము నెలయునైదు దినములు భక్షింప
నబ్బెననుచు మిగుల నాశవొడమి. 156

ఆ. భుజగకరటినరుల భుజియింపనేటికి
గొనయమున నె భుక్తిఁగొందుననుచు
వింటికొప్పుగళము నంటించి గొనయంబు
నరముఁగొఱుక మిడిసి శిరము దునిసె. 157

వ అట్లుగావున నిక్కపంబెల్ల మీసామ్మను నత్యాశవిడువుండని
మఱియు నొక్కకథ చెప్పం దొడంగె. 158

క. లోభంబు నరక హేతువు
లోభంబపకీర్తికరము లోభంబుజగ
త్త్రాపభవ దూరముగావున
లోభంబుడుగంగ వలయు లోకోత్తముఁడై. 159

వ. అదియెట్లనిన. 160

సీ. వ్యవహారులిద్దఱాయసము నొడననిచ్చి
వనధి జనద్వీపమునకు నరుగ
నంతనొక్కఁడు రోగియై పోవలేకున్న
నొకఁడేగి బంగారునకును మార్చి
కొనితెచ్చి యేకాంతమున నమ్మికొనఁ దోడి
వ్యవహారి పాలు దన్నడుగుటయును
యెలుకలుదినిపోయె నినుమంతయును నీకుఁ
బాలువెట్టగ లేదు పసిఁడియనిన

ఆ. నతని తనయుఁడింటి కాడంగవచ్చిన
డాఁచియతఁడు వచ్చి తనయు నడుగ
గ్రద్దయొకటి గొంచుగగనంబునకు నేఁగె
ననుచుఁ గపటవృత్తి నడలుటయును. 161

క. జనపతికి విన్నవించిన
మనుజేంద్రుండనియె గ్రద్దమానిసి నెటుగాఁ
దినెననిన లోహమెలుకలు
దినినట్టుల గ్రద్దశిశువుఁ దినెనని పలికెన్. 162

ఆ. జనవరుండు పసిఁడి సమభాగమిప్పింప
నతనికొడుకుఁ దెచ్చియప్పగించె
నమ్మిపెట్టినట్టి సామ్మిన్ని విశ్వాస
పాపియనుచు వైశ్యుఁ బాపెఁ బురికి 163

వ. మఱియు నొక్కకథ వినుమని యిట్లనియె. 164

సీ. సింధుమతీపుర క్షితిపతి చచ్చినఁ
గొమరుకు లిద్దఱు తండ్రి పుడమివంచి
కొని రాజ్యమేలుచుఁ గూడి వేఁటకు నేఁగి
సేనగూడఁగ లేక చిక్కుటయును

రాజ్యలోభంబున రాకొమరుండు సో
దరుఁ జంపుదో నొక్కతరువు గదల
శంకించి నగరికిఁజని రాత్రియొక్కట
పురవార్తలరయుచుఁ దిరుగువేళ

తే. నొక్కవడ్లంగి[1] తనప్రియనుపచరించి
తరువు చలనంబు రాజనందనుని మదిని
బాయకున్నట్లు నామది బాయవనిన
విని మనుష్యులు తనుఁగనిరనుచు బచ్చె. 165

వ. అట్లుగావున లోభంబు విడువ.........బుప్రవేశించి యుదకంబు
గ్రోలి దినదిన క్రమంబున నొక్కొక్క మండూక.........
గజనామప్లవంబున కిట్లనియె. 166

క. బుద్ధిగలవారువలె ని
ర్బుద్ధులు పెక్కండ్రు సిద్ధబుద్ధుని నైనన్
బుద్ధికిని బాపియమకృత
బద్ధంబునఁ దాముసతఁడు బడుదురు పెలుచన్. 167

వ. అట్లుగావున నొక్క కథవినుమని యిట్లనియె, 168

ఆ. తొల్లియొక్కచోట దొంగలు మేకల
మందగొంచు బోవనందులోనఁ
జేరినడవలేని చింబోతు దిగవిడి
పోవ వ్యాఘ్రభీతి గ్రావమెక్కె. 169

వ. యొక్కగంటి మీఁదబడియున్న సమయంబున. 170

క. హరిగనుగొని నీవెవ్వఁడ
వరుదెంచితికిట్టిచోటి కనుటకు నక్క
సరికనియె నింద్ర యజ్ఞపుఁ
బురుషుఁడనగ గడ్డమేల పొందెను నీకున్. 171

1. వడ్రంగికి రూపాంతరము.

వ. అనిన నిట్లనియె. 172

క. కరటుల నేబదియునుఁ గే
సరులను నైదింటి వ్యాఘ్రశతమును దింటిన్
హరియొకటి గొఱఁతనిన్నున్
బొరిగొనిగడ్డంబు వపనముగ నొనరింతున్, 173

క. అనిపలుక వెఱచి సింహము
చనియెఁ మతిగలుగునట్టి జనులకుబీడల్
తనికినను వేగయణగు
దినపతి యుదయింప నణఁగుతిమిరము పగిదిన్. 174

వ. అనిమఱియు.........నుండి.........................
యొంద్రికయొక్కచో నెందుచున్నఁ జను దెంచి జలకలశంబుననిడి
కొని చనియెడిచోఁ బథశ్రాంతిబొంది వృక్షమూలమున నిద్రిం
పంగ నొకకాకిద్విజుని గ్రుడ్లనునాకుఁ దెచ్చి పెట్టుమనిపోతుఁగాకితో
ననుటయు నీసఖు ఫణిబంపునిద్రించు పారుఁగఱవ 175

ఆ. ననినట్లచేయ నహివిప్రుఁ గఱచిన
వాయసంబు విప్రవరునిగ్రుడ్లు
కెలఁకవచ్చి కుండిజలములు గొనఁబోవ
నంద్రికాకి కంఠమిఱికి పట్టె. 176

క. విప్రుబ్రతికింప కుండిన
నీప్రాణము గొందువనివ నీచఖగంబున్
క్షిప్రమె బోయంబవిచివ
నప్రాణుం జేయ లేచె జగతీసురుఁడున్, 177

క. కాకిదుబాపి యంతకు
కాకోదర మధికపాపి కాకోదర త
త్కాకముల కంటె మిక్కిలి
భూకాంతుఁడు పాపిఁచంద్రుబుధ జనులెవ్వరున్. 178

ఆ. ఇతరజాతులైన హితులఁ బ్రోచు నొక్కొక
యెడరుపుట్టినప్పుడెఱుక వొడమి
యొండ్రివిప్రు ప్రాణమొత్తెను కాకంబు
గళము బిగియఁబట్టి కాననమున 179

వ. ఆబ్రాహ్మణుండు గంగయందు నక్కర్కటకంబు బెట్టి స్నానంబు
చేసిచనియెఁ గావున. 180

క. అనిహారులు బుద్ధిచెప్పఁగ
వినియును విననట్ల వారల వెదకుఁచునన్నిం
టిని మెసఁగిచనియెఁ బాముస
కును పాలిడి పెంప విషముగురియక చనునే. 181

వ. అనితంత్రి దాదింజూచి యిట్లనియె. 182

క. పలువురు పగతులలోనికిఁ
బలవంతుఁడననుచు నరిగి ప్రహారమలీలన్
బలుమారు జెప్పఁగొననేఁ
బ్రళయంబగుఁగాక యెట్లుప్రాణము నిలుచున్. 183

వ. అదియెట్లనిన 184

సీ. జలనిధిదరిఁబక్షిసంఘము తమకొక్క-
యధిపతివలెనని యాత్మఁదలఁచి
పరశురామునిచేత భంగముబొందిన
క్రౌంచపర్వతము రంధ్రమునఁబుట్టి
నట్టియంచను ఖగపట్టబద్ధునిఁ జేయఁ
దగబరద్వేషిణి ధ్వాంక్షమనియె
కలహాంస నిర్బుద్ధిఁ గద్దఁ గట్టుదమన్న
వర్ణంబుగాదు వింధ్యాద్రియందు

ఆ. రక్తనేత్రుఁడనెడు గ్రద్దపక్షులకెల్ల
భర్తయగుచునుండఁ బ్రథమమంత్రు
లైనరక్తకేతుఁడను నక్కయునుదా
త్తుండు నాఁగఁబులియు దుర్మదమున 185

వ. ఖగబలంబునకును గ్రద్దకునెడ సేయఁదలఁచి పక్షికులము దండ
కరిగి. 186

చ. అధిపతినంచు గ్రద్దమిమునందతిసీనగ వింధ్యవాసకున్
వధరొనరించి మాంసములవారణగా బలివెట్టఁజూచెమీ
రధముల పోలెనుండ దగదన్న ఖగంబులువల్కె మమ్మునీ
విధమునఁ బాపఁగాఁదలఁచి పీడఁగనాడుట మాకుధర్మమే. 187

క. నృపతులు పరిజనములపైఁ
గృపఁజేసిన దుష్టజనులు కృత్రిమవృత్తిన్
నెపమునిడి పాపఁదలఁతురు
కపటుల వాక్యములు నమ్మఁగా దెవ్వరికిన్ 188

వ. అనిన సిగ్గువడి గ్రద్దనాయకునికడకు నరుగుదెంచి యిట్లనిరి. 189

క. అధిపతికంటెను సేవకు
లధికులమని గర్వులైన యాయాకొలఁదిన్
మధురముల వలెనె పలుకుచు
వధసేయు నృపాలకుండు వర్థనమొందున్. 190

క. పక్షులు తమపై మిక్కిలి
పక్షముగలరనుచు నమ్మి పాలించిన నా
పక్షులెగుడిచెడఁ బుట్టిన
వృక్షంబులపగిది నృపునివిఱుతురు పిదపన్ 191

వ. అట్లుగావున పక్షులం బ్రతిపక్షులంగాఁ దలంచి నీపక్షంబు వదలి
ఘారికఘటంబు వీక్షించి శిక్షించుమను నవసరంబున. 192

తే. కొలువుసేయంగ నా ఖగకులముఁ వచ్చి
యున్న గృధ్రమ్ము దమకునుసన్న సేయఁ
బులియు నక్కయు నప్పటి కులముఁజంపి
పిదప గృధ్రంబుఁ జంపినిర్భీతులయిరి. 193

వ. అట్లుగావున గృధ్రంబు బుద్ధివిహీనంబు ఖగపతిత్వంబునకునర్హం
బుగాదనిన వాయసంబు కపింజలంబు బట్టంబుగట్టుదమనిన
మయూరంబది యర్హంబుగాదని యిట్లనియె. 194

క. నిలయమునకు శశముగపిం
జలమును బోరాడియొక్క శార్దూలయతిన్
వలగొనిఁ జెప్పినవినినే
దెలిపెదనని చెప్పుచును వధించెను వానిన్. 195

క. హీనులు తమలోఁ గలహం
బైనను నృపుడెఱుంగకుండ నడఁపక క్రూర
త్మ్మానాథున కెఱింగించిన
ప్రాణము లిరువు (రకునొ) క్కభంగినపోవున్. 196

వ. అట్లుగావున కపింజలం బవివేకియని జీవంజీవకంబు బట్టంబుగట్టుద
మనిన నదిగాదని శారిక యిట్లనియె. 197

సీ. వినుడు కేరళదేశమునఁ బ్రసేనుండను
త్మ్మాపతి కుష్ఠరోగమునఁ బొంద
వైద్యుడొక్కరుఁడు జీవంజీవకము దేక
మానదీరోగమే మందులందు
ననిఫశాకుని కులననిపిన వారును
నరిగొక్క[1]సరసిని నురులుదీర్ప
కొక్కరయురిఁ బడ్డనక్కటా యనియొక్క
పొన్నంగి యురిఁద్రెంప వోయితాను

1. దుస్సంధి.

తే. మఱిని బడుటయు జూచివాగురికవరులు
పట్టుకొని తేరనిధి యున్నపట్టు మీకుఁ
జూపెదనునన్ను విడుడనవుఁడు జూచివిడక
పిట్టఁగొనిచని నృపుమ్రోలఁ బెట్టుటయును. 198

క. ఆవైద్యులట్టి జీవం
జీవకమునుఁదెచ్చి రాజు శిరమున నిడిగం
గావారి జలకమార్చిన
త్మ్నావిభుదేహంబు దివ్య కాంతి వహించెన్. 199

వ. రోగవిముక్తుండై యప్పక్షిని విడిచిపెట్టిన నాకసంబున కెగసి భూ
వరున కిట్లనియె. 200

ఆ. మొదలనేను వెట్టిఁబిడపఁ గిరాతులు
వెట్టివారు నీవు వెట్టివనిన
నెట్లుచెప్పుమనిన నేబక కంఠంబు
తగులు గొఱకు కతనఁ దగులువడితి. 201

వ. అట్లుగావున మొదలివెట్టినేనైతి నిక్షేపంబుఁ జూపెదననిన నొల్లక
నన్నుఁదెచ్చిన కిరాతులువెట్టులు మఱి నీవెట్టితనంబుఁ దెలిపెదనిన
యిట్లనియె. 202

క. ననుముట్టిన మాత్రననీ
తనువుజ్జ్వలకాంతి మహిమఁ దాల్చెనునన్నుఁ
దినినను జిరకాలమునీ
తనువుండుటఁ దెలియ కిట్లుతగునే విడువన్. 203

వ. అనినకిరాతులంజూచి దీనినేయుండనినఁ బడనేసిరిగావున యీయవి
వేకి యర్థంబుగాదనినఁ గపోతంబు శుకంబు పఠింజేతమనినసార
సం బది వివేకి యవునని యిట్లనియె. 204

సీ. జగతీశురాష్ట్రి దేశంబున రవిగుప్తుఁ
డనువైశ్యుడప్పురి యంగణమునఁ
దనతోఁడిచెలులునుఁ దాను నోములునోమ
వచ్చినభవగుప్త వరతనూజ
రత్నమాలికయను రమణిఁ గటాక్షించి
విరహవేదన బొంది వివశుఁడైన
నతఁడుపెంచిన శుకమలయ నేమిటికింత
యని శివాలయమున కపుడె యరిగి

తే. పూజచేసిన పత్రిలో బొంచియుండి
శివునకును మ్రొక్క భవగుప్తుజిలుకపలికె
నీతనూభవ రవిగుప్తునికినిఁ బెండ్లి
సేయుమనవుఁడు హరుఁడు వచించెనన్న. 205

వ. అనివివాహంబు చేసిన రవిగుప్త రత్నమాలికలు సుఖంబుండునంత
నొక్కనాఁడు. 206

క. రవిగుప్తుఁడు వేఁటొకతెను
వివాహమునుగాదలంప వెలఁదుక యనియెన్
శివునానతి మజ్జనకుఁడు
వివాహమునుఁ జేసెనొండు విధమింకేలా. 207

ఆ. అనిననతఁడునవ్వి యన్నచ్చుకముడాఁగి
పలికెఁగాని హరుని పలుకుగల్ల
యనిన నరిగితంద్రికావార్త నెఱిగింపఁ
గోరియల్లు చిలుకఁ గొంచుబోయి 208

వ. శుకలూడ్చి వండింప నమకట్టిన నదిదైవికంబున నొక్కచోట
డాఁగి యీకలువచ్చి మొగవి యుపవనంబున వ్రాలి యొక్కరాజ
శ్వేష్ఠపుత్రునిచే పడి యతనికి హితుండై యుండెనంత. 209

ఆ. పిన్నపత్నిమీఁది ప్రేమను భూపతి
తత్తనూజు రాజ్య తంత్రమునకు
భర్తఁజేయ బెద్దభార్య కుమారుండు
చిలుకగూడి కార్యచింత సేయ. 210

వ. ఆశుకం బిట్లనియె. 211

మత్తకోకిల :
ఇంతయేటికి జింత యీపని యేన తీర్చెదనింక నీ
వంతమాన్పెదనంచు దచ్చుక వంశ్యులారవ కింకిణీ
వంతులై తను జేరనప్పుర వప్రవీథుల నిల్వభూ
కాంతుడెవ్వరటన్న నింద్రుని భావ్యదూతల మేమనఁ. 212

క. ఏమిపని వచ్చి నారన
భూమీశ్వర యగ్రమహిషి పుత్రుని రాజ్య
శ్రీమహితు జేయుమనిను
రాముఁడు నీకిలుకచే సి రమ్మనిపంపెఁ. 213

తే. అనిన నట్లసేతునని కీరముల నంపి[1]
పెద్దపుత్రుని యువరాజ్య భృతునిఁజేసి
చనినసంతోష చిత్తుడై యనియె చిలుక
కతడు నీకిష్ట మెయ్యది యదియొనర్తు. 214

వ. అనినభవగుప్తు సొమ్ములపుచ్చుకొని తలగొరిగించి వెళ్ళగొట్టించు
మనిన నట్ల చేసెగావున కీరంబుపాయ కర్తయనిన భరద్వాజం
బిట్లనియె. 215

సీ. ఒకచెట్టుతొఱ్ఱలో శుకముపిల్లలఁబెట్ట
బోయయొక్కఁడు శుకపోతములనుఁ
గొనిపోవఁ జిలుకల్లొచ్చునిఁజూచి పలికెను
శిశుఘాత మేటికిఁ జేసెదనిన

1. ఈపాదము ఛందోభంగముగా కాన్పించుచున్నది.

నమ్ముదుగాని నేనటు సేయనన నీకు
విత్తమిచ్చెదవీని విడువుమనుచు
దుష్టసర్పంబున్న తొఱ్ఱచూపందుల
ధనమున్న దదివుచ్చి కొనుమటన్న

తే. నెఱుకుచని యాత్మహస్తంబు తొఱనుఁజొనుప
పాముగఱచినఁ జచ్చెనబ్బర్బరుండు
వానిమొలనున్నయురిఁ జూచి దీనమమ్మఁ
బట్టునే యని కొఱక నప్పక్షియరిగి 216

వ. ఉరిదగిలి తానును మృతంబయ్యె గావునచిలుక నిర్బుద్ధియర్హంబు
గాదనిన జలవాయుసంబు బకంబు గట్టుదమనిన చాతకంబిట్లనియె. 217

సీ. బకమొక్కఁడడవిలో పద్మాకరముపొంత
నారికేళము భవనంబుగాఁగ
వసియింప నొకనాఁడు వంశపక్షులుదివి
నరుగనాయింటికి నరుగుదెంచి
యారాత్రి వసియించి వారిచరంబుల
భక్షింపుడని ప్రేమ బల్కుటయును
నవిమొల్ల నిలిచి మత్స్యావలి నెల్లను
భక్షించిపోవ నబ్బకముచిక్కి

తే. రొంపిబడుటయు నొకనక్క చంపెదానిఁ
గాన నిర్బుద్ధియది యనఁగాకి తమకు
వరునిఁజేయంగఁ గారండవంబు పలికె.
........................ 218

వ. అమ్మాటకు గలకంఠం బిట్లనియె. 219

తే. కుంటివులిఁజూచి యొక నక్కకూర్మిఁ బలికె
సకలమృగములఁ జంపి మాంసమిడుదెచ్చి
నీకు నిచ్చెద మృగముల నాకుఁ జాలు
పెట్టు మన వ్యాఘ్రమును నక్క పెట్టదొడఁగె. 220

వ. ఇవ్విధంబున దిరిగి మృగంబులనెల్ల జంపించి మాంసంబు గానక
యిట్లని తలంచు. 221

సీ. భాగీరథీతీర భాగంబునను నొక్క
నేరేడుగలదందు నిలిచియొక్క
మర్కటంబుండియమ్మడుగు నక్రంబుతోఁ
జెలిమియొనర్చి తత్ఫలములెల్ల
మొసలిపైఁబడ రాల్చ మొసలి పత్నికినీయ
నెక్కడి వనగ్రోఁతి యిచ్చెననిన
గుండెలుదినవలె గ్రోఁతిఁ దెమ్మనవుఁడు
మముఁజూడ రమ్మని మర్కటమును

తే. వీఁపు నందిడి పోవుచు విపినచరము
పలికె నీగుండెల డిగె నాభార్యయనిన
నపుడె చెప్పంగవలదె యయ్యగ చరముల
గుండెలన్నియు మ్రాననేయుండు కతన
నాదుగుండెలు నున్నవన్నగమునందు. 222

వ. అట్లుగావున నన్ను దిరుగఁగొనిపోయిన నా గుండెలన్నియు నిచ్చెద
ననిన నది యట్లచేసిన. 223

క. చెట్టెక్కి కొమ్మవిరి చా
చిట్టిగి మొకయుంబుచరము శిరమునపై వన్
గుట్టుచెడిపోయెఁ గావున
నట్టే నే గార్ధభమున కాప్పుడ నగుదుఁగా. 224

వ. అని నిశ్చయించి జంబుకంబు చాకలి వాని చీరెలు
మోచుగార్దభంబుతో చెలిమిచేసి యిట్లనియె. 225

క. పులికిని నాప్తుఁడనే నా
పులికిన మాత్ర్యుండు చచ్చిపోవుట నిన్నా
పులికిం బ్రథానిఁ జేసెద
చెలికాఁడా రమ్మటంచు శివగొని చనియెన్. 226

వ. అట్లుచని పులికి నొప్పించెగావున జంబుకంబు విశ్వాస ఘాతకి,
కాకి ఖగాధముండు గావున నర్హంబుగాదది యెట్లనిన. 227

సీ. కాకులు దుర్భిక్షకాలము పండిన
వసుధకుఁబో జలవాయసంబు
కులముసాములఁజూచి గలువ నిచ్చటనుండు
డభివాంఛితములు మీకర్థినిత్తు
ననుచునందఱి నిల్పి యను దినంబును దృష్టి
సేయంగఁ గరువంతఁ బాయుటయును
తమభూమి కరుగు నత్తఱి మేలునకు మేలు
సేయంగలేక యచ్చోనఁటి పులుగు

తే. లనియె నీ యెంగిలిలు మాకుఁదినగఁబెట్టి
మావ్రతంబులు చెరిచి యిమ్మాడ్కి నీవు
పుచ్ఛమ్మును చూప మాకెట్లు భక్తులగుదు
ననుచు నెపమిడి తమభూమికరిగెనవియు. 228

క. చుట్టలమని కలకోలదిని
బెట్టిన ద్రవ్యములు మెసఁగి ప్రియముడిఁగితుదిన్
అట్టొకటి ప్రభువు వీఁడనుఁ
కట్టక మఱచనట గ్రామకాకు (?) లభంగిన్. 229

వ. అట్లుగావున కాకం బర్హంబుగాదని పక్షులెల్ల విచారించి గరుడ నింబట్టంబుగట్టి సుఖంబుననుండిరని చెప్పి మఱియు నొక్క కథ వినుమని తంత్రియు నిట్లనియె. 230

క. ప్రమదమునఁ బిశాచంబులు
తమకొక్కని రాజుఁజేయఁ దలఁచిన వేళన్
క్రమమలర స్థూలకుక్షుం
డమరఁగ దుర్బలపిశాచ మర్త్యుండనిరా 231

క. తను భవభీతిపిశాచం
బనియెన్ దుర్బలపిశాచమది పతియగునే
యనినన్ విధినోడ్పడ నేన్
ఘనుడైనను హీనుడైనగాంతి వహించుఁగా. 232

సీ. గంగాఖ్య పురమునఁగలఁడు దరిద్రుండు
దేవదత్తుండను ద్విజవరుండు
బలహీనుఁడతనికి భార్యలిద్దఱుగల
రందుఁ జిన్నది తన యధిపతికిని
విధియు క్తమైనట్టి వివిధలద్దుకములు
మూటగట్టా[1]త్మేశు బ్రోలఁబెట్ట (?)
నతఁడు తమ్మునిఁ జూఁడ నరుగంగ దొంగలు
ముసరియాతనిచేతి మూట మొసఁగి

తే. విషముచేఁ జచ్చుటయును నా విప్రవరుఁడు
తస్కరులజేతి శస్త్రముల్ తాధరించి
తలలుఖండించుకొనిపోయి ధాత్రిపతికిఁ
జూపుటయు మెచ్చి ధనము భూసురునకిచ్చి. 233

వ. గృహంబున కనిచి సుఖంబుండు నంత. 234

1. దుస్సంధి.

క. శృంగారవనమునను నొక
సింగముచను దెంచెననుచుఁ జెప్పిన భూభృ
త్పుంగవుఁడు విప్రుననిపిన
సింగమునకు వెఱచి ద్విజుఁడు చెట్టెక్కెంగా. 235

క. పంచాస్యము డగ్గరుతరి
చంచలమున చేతనున్న శస్త్రమువదలన్
పంచముఖు శిరము తెగిపడ
నంచలముననురికి చేత నా తలగొనుచున్. 236

తే. రాజుముందట నిడిన నారాజవరుఁడు
విప్రునకుఁజాల నిష్టార్థవితతి యొసఁగె
నంతవచ్చి సహస్రసాలాఖ్య నృపతి
పురముచుట్టును విడిసె నద్భుతముగాఁగ. 237

దోదకం :

వచ్చినృపాలుడ వారణబలుఁడై
యచ్చట విడియుడు నభ్యావిభుఁడున్
నచ్చినవిప్రుని నమ్మి విభూతిన్
ప్రచ్చరవైరికి గర్వముచూపెన్. 238

వ. అంతసహస్రపాలుండు దేవదత్తు ప్రతాపంబు విన్నవాఁడు గావున రహస్యంబున వానిం బట్టితెచ్చిన పిదప గంగాధరు బలంబణంతు నని తలంచి. 239

ఉ. క్ష్మాపతిగూఢ భావమునగంగపురం బవలీల జొచ్చి య
భ్భూపతి యాప్తుఁడై మెలగుభూమర సద్మముఁ జొచ్చి వచ్చుచో
నాపృథివీసురుండు నృపుఁడౌట మనంబున నిశ్చయించి త
చ్చాపలచిత్తు బట్టుకొనితత్సుత వర్గముతోఁడు పాటుగన్. 240

క. ఈగతి సహస్రపాలుని
వేగంబునబట్టి భూమివిభునకు నీయన్
చేగచెడివాని బలములు
ప్రోగులువడి పరచె నాత్మభూమార్గమునన్. 241

క. బలహీనుఁడైనఁ గానీ
బలయుతుఁడగు ధాత తోడుపడినను మఱిదో
ర్బలయుక్తుఁడైనగానీ
బలహీనుండగును దైవబలమెడలుటయున్. 242

వ. అనిన గజవక్త్రుండను బేతాళుం డిట్లనియె. 243

సీ. నెమ్మివిటాగ్రహారమ్మున గార్దభ
సేనుఁడు నావిప్రశేఖరుండు
సంతానకాముఁడై జలజజుఁ బ్రార్థించి
వ్యభిచారియగు కూఁతు వరము వడసి
క్షిప్రకోపికిఁ బెండ్లిచేసిన నప్పెండ్లి
కొడుకు తద్వ్యభిచార గుణముమాన్ప
భైరవమంత్రజపంబును చేయుచు సిద్ధ
భైరవసంసిద్ధి పడసెననుచు

తే. జగతి భ్రమియించి తనకాంత జవ్వనైన
వికృతరూపంబు శూలంబు వెలఁదికిచ్చి
పాన్పునకు వచ్చునప్పుడాభావమునను
శూలమొనఁ ద్రిప్పి మంచముచుట్టుదిరిగి. 244

క. శూలములొమ్మనిచి(వగ)
పాఱితివి పొడుతుననుచుఁ బలుకుచు మఱి నీ
వాలికయుడిగి మంచము
పైలాలితభంగి నెలగు భావమునుమఱ్. 245

వ. ఉపదేశించిన నదియుచేయుచుండు నంత నొక్కనాఁడు. 246

క. పరదేశి విప్రుఁడొక్కఁడు
సురుచిరతర విభవరూప శోభితుఁడగుచున్
బురవీధి దిరుగ జారిణి
పురుషుండిలు వెళ్ళి నదికి బోయినవేళన్. 247

క. పరదేశివిప్రు నిజముం
దిరమునకుం దెచ్చి దొంటి తెరఁగున కడుభీ
కరమైన రూపుగైకొని
యరుదెంచిన భయముబొంది యతడిలువెడలెన్. 248

వ. అట్లిల్లువెడలి బమ్మరించుచు నెదురుపడిన యవ్విప్రునకుఁ జెప్పిన
నందఱికిం జెప్పుకున్న ప్రమాదంబనిన నట్లచెప్పిన నెవ్వరునాపైఁ
దలిజూడభయపడుచుండి రంత. 249

ఆ. క్షిప్రకోపుఁడా త్మగృహమున కేతెంచి
భార్యకనియెనాకు భైరవుండు
చెప్పెనన్యపురుషుఁ జేపట్టినదియని
యన్నసీదు వేల్పు నడిగిచూఁడు. 250

వ. అనియెం గావున. 251

క. దైవముకంటెను మానుష
మీవిధమున నెక్కుడయ్యె నిదిగో విప్రుం
డావెలఁది మానుషంబున
దైవీ(?)కపు జారతనము దగిలినకతనన్.[1] 252

వ. అనిన లంబోష్ఠుండను పిశాచంబు మానుషంబుకంటె దైవికం
బెక్కుడని యొక్క కథ చెప్పందొణంగె. 253

1. దైవికదోషంబునఁండి దగిలినకతనన్.

సీ. మాహిష్మతీపురి మహిపతి జలశాయి
పద్మజుగురిచి తపంబుసేయు
నురగంబు పుత్రుగానొసఁగి యా పుత్రున
కళనంబుగాఁ గన్యకలను నొసఁగు
మనిన నారాజన్యుఁడటువలె నహిఁగాంచి
పురకన్యకలనెల్ల భుక్తియొసఁగ
నొకనాఁడు.పురిని గన్యకలు లేకుండిన
భైరవివరమున బ్రాహ్మణునకు

తే. జననమొందిన కమలలోచనను మాఱుఁ
దల్లి వెలవుచ్చికొని యాయ దండశూక
భుక్తికరుగుచు భైరవి పూజచేతఁ
గాంచినటువంటి పద్మయుగంబు గొనుచు. 254

క. అరిగి, ఫణి, భుక్తికొఱకై
యరుదేరఁగ ఱొమ్ము వేయ సప్పద్మహతిన్
నరుఁడై వరియించెను నజు
వరమును నిటువలెనె కాన వైభవమొప్పన్. 255

తే. అతఁడు పద్మాంకుఁడనుపేర వతిశయిల్లె
పద్మలోచన యంత గర్భంబుదాల్ప
సవతిజనయిత్రి తనవ్యభిచారి కూఁతు
గర్భిణికి బుద్ధులెల్లనుఁ గఱపియంత. 256

వ. కమలలోచనకు నోము మీఁద నభిలాష పుట్టించి కుసుమావతిం
బద్మాంకునొద్దనిలిపి యక్కమలలోచనం గొని యర్ధరాత్రంబున
గంగమడువునం ద్రోచుటయును, 257

క. దైవవశంబునఁ గామిని
చావక యొక కొయ్యవట్టి చనఁగ బ్రభాతం
బావిర్భవింపగౌతమ
దేవమునీంద్రుండు దరికిఁ దెచ్చెను దానిన్. 258

తరల:
కమలలోచన యంతఁ బుత్రకుఁగాంచె నుజ్జ్వలమూర్తి శ్రీ
రమణతుల్యుని సార్వభౌముని రాజలక్షణు నిక్కడన్
రమణియక్కుసుమావతియు బధిరాంధమూక వికారునిన్
శమవిహీనుని బుత్రుఁగాంచెను సమ్మదప్రతిపక్షునిన్. 259

వ. అంత నప్పద్మాంకుండు దిగ్విజయార్థంబరిగి గౌతమాశ్రమంబునం గుమారునింజూచి వీఁడెవ్వని పుత్రుండని యమ్మునీశ్వరు నడిగిన నతండిట్లనియె. 260

స్వాగతము:
సారసలోచన క్ష్మావర నీకున్
గారవమొప్పగగాంచిన పుత్రుం
డీరమణీయుఁడ హీన బలుండై
ధారుణియెల్లనుదారత నేలున్. 261

వ. అని వినిపించి తదీయాగమనక్రమంబెల్ల నెఱింగించినఁ గమలలోచనా సుతసహితుండై మునియనుజ్ఞ నాత్మపురంబునకేతెంచి యందుఁగుసుమావతి వర్జించెనని తంత్రిదాదికి మఱియొక్క కథ వినుమని యిట్లనియె. 262

క. సాహసునకు దైవంబును
సాహాయ్యముసేయు హీనసాహసునుఁ దైవం
ద్రోహియని దైవమును ద
త్సాహాయ్యము విడిచివానిఁ జంపఁగ జూచున్. 263

వ. అదియెట్లనిన. 264

సీ. రత్నావతీ పురీరమణుండు వరదత్తుఁ
డనురాజు సుతుని జయంతునొక్క
శూలనాసాపిశాచుఁడు సోఁకి యెటువంటి
మంత్రతంత్రాదులు మానకున్న
భూపతి చింతించి భూతము నెవ్వండు
విడిపించుఁజాలంగ విత్తమిత్తు
ననిపురిసాటింప నందుసాగరి యను
వారకామిని ధన వాంఛఁజేసి

తే. మాన్పఁగా నేర్తుననుచుఁ గుమారిదెచ్చి
శూలనాసాశ్రయుని రాజసుతునియొద్ద
నునిచి పరిచర్యచేసెడి యుక్తిగరపె
నదియుబరిచర్య సేయంగ నాపిశాచి. 265

క. అక్కామిని కిట్లనియెఁ
జిక్కితినీమీఁది కూర్మిఁ జెలువానాపై
మక్కువ సేయుము నావుఁడు
నక్కామిని యాత్మజననికది యెఱిగింపన్. 266

ఆ. దానితల్లివచ్చి తరుణి మాయింటికి
ననుపుమనిన భూతమనియె నీవు
చెప్పినట్టిపనులు చేసెద నిక్కాంత
నునుపుమనిన వారవనిత బలికె. 267

ఆ. ఎట్టిరాజనంబు లిరువది పుట్లును
బియ్యమనుదినంబు బెట్టు తూము
దెత్తుననియు నీవుదెచ్చిన తూమునఁ
గొలుతుననుచు నియ్యకోలుజేసి, 268

వ. ప్రతిరాత్రియు నటువలెఁ బెట్టుచునట్లుగూడి సుఖయింపుచు నొక్క-
నాఁడు. 269

క. ఎయ్యెడ నెఱ రాజనపుర్
బియ్యంబులు దొరకకున్న భీతుండగుచున్
సయ్యన నానృపసుతుపై
నెయ్యముఁదిగవిడిచి యంధ్రనృపసుతుఁబట్టెర్. 270

ఉ. పట్టినఁ నంధ్రభూమి జనపాలుఁడు సాగులిగొంచుబోవు(?,నా
పట్టియుఁదాను దానవుఁడు పట్టినరానుతుఁజూడభూతముర్
బట్టొకభంగి గావదలి భామినికిట్లను తూముఁదెచ్చితో
పెట్టిటవచ్చితోఁయనినపెట్టక తెచ్చితినన్న భీతుఁడై. 271

క. ఇది మొదలుగాఁగ మనుజుల
గదియనునీతూము నానకామినియని భూ
విదితముగఁ బలికెనృపసుతు
వదలడివికి(?)జనియె బురమువారలు నవ్వర్ 272

వ. సాగులికయు నభ్యూపాలునిచేత నధికధనంబులు వడసి సుఖంబుండె
ననిచెప్పిన నాజానుబాహుండను పిశాచం బిట్లనియె. 273

క. మాటాడనేర్పు కలిగినఁ
బాటింతురునృపులు దైవభాదలడంగుర్
బోటులు మనసిత్తురు దగ
మాటాడగ నేరవలయు మానవులెపుడున్. 274

వ. అదియెట్లనిన 275

సీ. పిప్పలుండను సెట్టిపృథివిపై సైంధవ
వ్యవహారికంబున నరుగుచుండి
ప్రొద్దుఁ గ్రుంకుటయునుఁ బోలేక యడవిలో
విడిసి చోరమృగాదు లడవి విడిచి

చనుదు వేలాఖ్య రాక్షసుఁ డుందునన్న వాఁ
డతఁడు చూచిన నెపమాత్రుననుచు
జాటించెనవియెల్లఁ జనుచోట దొంగయు
బులియును నొక్కచోఁ బొంచియుండి

తే. హరులలో డాఁగెఁ బులియును నంతలోనఁ
జోరుడును గుఱ్ఱమును దియ్యఁ జేరి పులిని
వాగెఁ దగిలించి యెక్క నవ్వ్యాఘ్రమాత్మ
రాక్షసుండని మోచి యరణ్యమునను 276

క. తిరుగుచునుండగ దొంగలు
సురరిపుఁడని చేరవెఱచి చూచుచునుండన్
హరి యుదయ మొందె నొకశివ
నరుమోచినద్వీపిఁ జూచి నగుచుం బలికెన్. 277

ఆ. మనుజుఁదినక యేలమరలెట్లు గొంటివి
దిగువ వ్రేయు మనగఁ దెలిసిచోరు
డడవినొక్క పాదుగుడిఁ గాంచిపులిడిగ్గ
నురికిచొచ్చి తలుపులిడియఁ బెట్టి 278

వ. అంతనక్కయుఁ దలుపులు వుత్తునని కుంచెకోల వరపుతోలిని తోఁ
కఁజొనిపినా. 279

క. చోరుండాశివవాలము
ధీరుండై బిగియఁబట్టి తివియఁగ శివయున్
నోరెండిచచ్చెఁ బులియున్
ఘోరాటవి కరిగెఁ జోరకుండును వడలెన్ 280

క. మానవుఁడు పాయుబలమునఁ
ప్రాణము రక్షించి సకలభాగ్యము గాంచున్
గాన నుపాయజ్ఞుండే
మానవవరుఁడనిరి బుద్ధిమంతులు జగతిన్[1] 281

వ. అదియెట్లనిన. 282

సీ. ద్వైతాటవినిసముద్ధతుఁడను సింహంబు
మృగములనెల్లను మెసవుచుండ
మృగములు హరిఁబల్కెఁ దగునె మమ్మిందఱి
భక్షింప నిలువర్స భక్షణంబు
సేయుమునీవన్న సింహంబు నదియొప్పు
కొని వర్సతోఁ భుక్తిఁ గొనుచునుండ
నిట్టికి నొక్కనాఁ డిలువర్స వచ్చిన
మృగమ్మృగీ పోతంబు లేడ్చుచున్న
తే. శశము పొడగని సింహంబు జంపివత్తు
ననుచునూరడఁ బల్కి తానరిగి హరినిఁ
గాంచుటయు వేళదప్పె నాఁకలియుఁ బెరిగె
నేలనిలిచితివనిన కుందేలు వలికె 283

క. కేసరిమ రొక్కటిమముఁ
గాసింబెట్టంగ వానికథ దీర్పగసే
నోసరివి చెప్పవచ్చితిఁ
దోసముగలదనిన హరియుదుర్మదవృత్తిన్. 284

ఉ. కోపితచిత్తుఁడై యెచటఁగుత్సిత జంతువుమందునన్న నేఁ
జూపెదరమ్మటంచు మృగశూరునిఁ దోకొనియేఁగివాఁడునీ
కూపములోన నుండునని గూలము ద్రొక్కుటు చూడనాత్మస
ద్రూపవునీడ దోఁచుటయు రోషముతోఁ నురికెన్ స్వమూఢుడై 285

---

1. "మానవవరుడనిరి బుద్ధిమానసజనముల్" అని గ్రంథపాఠము.

క. బుద్ధిగలవాఁడె బలియుఁడు
బుద్ధివిహీనుండు బలముఁబొందియు నణఁగున్
సిద్ధము శశకముచేని
ర్బద్ధి మృగేంద్రుండు మృతము ? బొందినభంగిన్. 286

వ. అనిన ప్రబలుండను పిశాచంబింద్రశర్మ పిశాచంబుఁబట్టంబుగట్టుద మనిన దూషకపిశాచం బిట్లనియె

క. భూసురుఁడు కుక్కఁబెంచుచు
కేసరిగాఁజేయ నదియు కిల్బిషమతినా
భూసురునేతిసఁ జూచిన
నాసంయమి మగుడఁ గుక్కరాకృతిచేసెన్. 287

వ. అనిమఱియు నిట్లనియె

క. వాదడచు చోటనిలువం
గాదెవ్వరికైన వాదుగలిగిన మనుజుం
డాదిక్కు విడువకుండిన
నాదాసికిమేష(?)యుద్ధమగు గతివచ్చున్ 288

చ. జగతివరుండు వాజియుత శాలకుగావలిగాఁగ బొందిలిన్
తగరులనిడ్డనం దొకటిదాసికి నెగ్గొనరింపఁ బొయ్యిలో
భగభగమండు కట్టెఁగొనిపారఁగఁ గొట్టిన మండుకొంచు వె
న్తగులగశాలదూరుటయు దగ్ధములయ్యె హయాదివాహముల్ 289

ఆ. దానఁజేసి హరుల తనుదాహమగుటయు
నశ్వభేషజముల కగచరముల
వండి పూయుడనుచు వైద్యులుచెప్పిన
కపులకెల్ల నంత్య కాలమయ్యె. 290

వ. మఱియును 291

క. ఏవిధము నరుఁడు దలఁచిన
దైవము తావేఱయొకటి తలఁచుచు నుండున్
భూవర సుత మోహించిన
కావరుసన్యాసి నెలుఁగు గఱచిన భంగిన్. 292

వ. అదియెట్లనిన. 293

క. సన్యాసి రాజునకు గడుఁ
మాన్యతవర్తింపుచుండి మహిపతి తనయం
గన్యారత్నముఁ గనుఁగొని
ధన్యకుమోహించి భూమిధవుతో ననియెన్. 294

క. నక్షత్ర గ్రహరాసులు
లక్షణములు జాలనట్టి లలనాసుతలన్
వీక్షించు నరునకునువం
శక్షయమగుననిరి (జోస్యశాస్త్ర?)విధిజ్ఞుల్ 295

ఆ. అట్లుగాన నీవరాత్మజ లక్షణ
హీనగాన దీనినింట నుంప
వలదు పెట్టిబెట్టి వస్త్రేటవిడిపించు
మనిననట్లసేసె నంతనదియు 296

వ. ఏఁగాలి వశంబునం జనుదేర నొక్కభూమీశుండు పెట్టిపుచ్చి
కొని పెట్టిలోనికన్యంగైకొని యందునెలుంగు బెట్టివిడిచిన 297

ఉ. పెట్టియవట్టుకో ననుచు భిమకుడేటికి వచ్చి యందుఁ జూ
పట్టెడుపెట్టి వట్టుకొని ప్రాప్తమఠంబున కేఁగుదెంచి యా
పెట్టియకట్టు విప్పభటుభీకర ఋక్షము బిక్షుకాధముం
బట్టిభుజించె నిష్టములు భాగ్యవిహీనులు కేలకగ్గెడిన్. 298

వ. అనిమఱియు నిట్లనియె. 299

క. నరుఁడొకటిఁ దలఁపదైవము
మఱియొక్కటిదలఁచు వేశ్యమాతృకయల్లుం
బొరిఁగొన విషచూర్ణముత
త్వరతబ్రయోగించి తాన ప్రాణమువిడిచెన్. 300

క. వారాంగనయునుఁ బురుషుఁడు
నారయజవ్వనము నంద యార్జింపని బం
గారము ముదిసిన పిమ్మట
చేరదు పలువెతలబడ్డ సిద్ధముగాదె 301

వ. అదియెట్లనిన. 302

నందన :

నందనవిటునకు ననిచి ప్రియమునన్
బొందుచు మఱియొక పురుషుని నెచటన్
చెందకధనమును చినుకక యుండఁగ
సుందరివిటునియు సువ్వలు గొనఁగఁ. 303

వ. ఒక్కనాఁడు కాంతాసమేతుండై నిద్రించునల్లుని యానసంబున విషచూర్ణయుక్తంబైచ కోలుజొనిపి యావలికడ వదనంబున ధరియించియూఁదు సమయంబున 304

తే. అల్లుఁడుత్సర్గ విడువందదాస్యపవన
గతులననగించి మగుడితద్గళముచొరఁగ
వేశ్యమాతకు విషమెక్కి విధివశమున
కుంభినీస్థలి బడితన్నుకొనుచుఁ జచ్చె. 305

వ. మఱియు నిట్లనియె. 306

క. ఒరుసొమ్మున కాసించిన
పురుషుఁడు తనుదాన పొలియు పొలతుఁక సొమ్ముల్
హరియింప మద్దెలీడొక
యురికంఠము బిగిసి యసువులుడిగిన భంగిఁ. 307

వ. అదియెట్లనిన 308

క. సామరుని కోడలొక్కతె
గ్రామము వెలి నసువువిడువఁ గానవీథిన్
వేమారు బోవమర్దలి
యామానినిఁజూచి యేమియని పలుకుటయున్. 309

ఆ. ఇంటివారు వోరయేనందు బడలేక
చత్తుననుచు వచ్చిచచ్చువెరవు
తెలయుననినవాఁడు తెలిపెదననియొక
మఱ్ఱియూడనురి యమర్చిపలికె 310

వ. ఈమద్దెల మీఁదెక్కి(?)యురిదగిల్చుకొమ్మనిన వెరవునీవే చూపు మనిన యమ్మద్దెల యెక్కి వురిదగిల్చుకొని మృతుడయ్యె నని మఱియు నిట్లనియె. 311

క. హీనాశ్రమంబు కంటెను
దీనునకధికాశ్రమంబు తేజముచూపున్
మానుషముఁ గలుగువానికి
హీనునిఁ గొలువంగ వలవదే దుర్గతులన్ 312

వ. అదియెట్లనిన. 313

సీ. మేకపిల్లలు రెండు మేతకై యెవ్వని
గొలుతుమొకో యని తలఁపుచేసి
యొకటిసింహంబును నొకటి నక్కనుఁగొలువ
నందులోనక్క ప్రియంబుగల్గి
మేకపిల్లకుజాల మేతపెట్టుచునుండ
హరియొక్కవేళ దానరయ దెవుడు
అంతట వర్షమే కార్ణంబుచేసిన
క్రోష్టువామేకనుగుంట మీఁద

తే. బెట్టికొనియుండె సింహంబు భీతికుడుచు
మేకపిల్లను నేనుఁగుమీఁద నునిచి
ఆఁకటను జిక్కి నక్కయమ్మేకతోఁక
దినఁగ నిమ్మన్నదియు నందిచ్చుటయును. 314

వ. తోఁక భక్షించియుందునఁ దనివోవక చెవులును గళస్తనంబు
లును భక్షించియమ్మేకను భక్షించనున్న సమయంబున. 315

క. ఏనుగు కుంభస్థలమునఁ
దానిలిచిన మేక సఖుని దప్పక కని త
త్ప్రాణము రక్షించుటకై
యేనుఁగు బురిగొల్ప నక్క నీడ్చెను కరియున్. 316

క. హీనుల సేవించిన య
మ్మానవులకు నర్థమాన మహిమలు చెడు త
త్ప్రాణమునుఁ బోవుగావున
హీనులగొలుచుటయు మోసమెవ్వరికైనన్. 317

క. ఘనులం గొలిచిన మనుజులు
ఘనులై హీనులకు నధిక కార్యార్థులకున్
ఘనములగు పదములొసఁగుచు
మనుచుదురుపకార మహిత మానసులగుచున్. 318

క. చెడుగునకు హితవుచేసిన
చెడుమానము ప్రాణములును సిద్ధము హితముం
జెడిపీకును(?)జేసిరియుర చే
పడఁతుక తనముక్కు గోఁతఁ బడిన విధమునన్. 319

వ. అదియెట్లనిన. 320

సీ. ఒక పరదారకు నువిద యొక్కతెదూత
చర్యవర్తింప నజ్జారమగఁడు
తనకాంతఁబట్టి మ్రాఁకునకు బంధించిన
నిశియందుగుంటెన నెలఁత వచ్చి
యుపపతి వచ్చినాఁడువిదరమ్మని పిల్వ
కట్టినాఁడెటువలెఁ గదలి వత్తు
ననిననీకట్లును ననుగట్టి యుండాక
బోయిరమ్మనట్ల పోవ నతఁడు

తే. కట్లనున్నది యాత్మీయకాంతయనుచు
మఱియు నెగ్గులువలుక నత్తెఱవమూల
దట్టమగుచీకటిని దానిదగులబట్టి
కోపమున ముక్కు మొదలంటఁ గోసి విడిచె. 321

ఆ. అంతనక్కాంతయది దీర్చి యరుగుదెంచి
కట్లు దాసికి విడిచితన్గట్టినట్ల
యుండె సత్తైన సతినైతి నేనిదెగిన[1]
ముక్కు గ్రమ్మరనాకును మొలుచుగాత. 322

వ. అనినవాఁడు దీపికాహస్తుండై నాసిక గనుంగొని పరమప్రతివ్రతవు
తప్పులోఁగొనుమని దండంబువెట్టి కలసియుండెనంత నక్కడ. 323

క. హితవరియై నిజనా సా
చ్యుతు బొందినుగండు గోసె శుద్ధాత్మకనుం
గత మేమి లేకయని భూ
పతికిన్ మొరపెట్టజంపబంపె దానికి. 324

వ. అంత. 325

1. యుండి నత్సతినైతినే నౌరదెగిన.

ఆ. దొంగయొకఁడు చేరి యంగనాదూతల
చేష్టలెల్ల నెఱిఁగి చెప్పుటయును
కడమచెవులుగోసి కామిని వెడలించి
భటునికొక్క సతిని బట్టి చేసె. 326

వ. అని తంత్రిదాదికి మఱియు నిట్లనియె. 327

క. గురువుల ధనమైనను చే
దొరకిన యెందాక హితవుతో జరియించున్
దొరకిన మరి తలచూపక
విరబాఱను పూరిపుడక విశ్వాసమునన్. 328

వ. అదియెట్లనిన. 329

ఆ. విబుధయోగి యొకఁడు వేణుదండములోన
పొన్నుచయమునిడ్డబోసి కడల
రాగికుప్పెలిడి కరంబున విడువక
పట్టుకొనుచు దిరుగ పొరు డొకఁడు. 330

క. అమ్మాడలెత్తుకొని పో
నిమ్మగు నందాక యతికి హితశిష్యుండై
నెమ్మిని మెలఁగుచు నొకచో
నమ్మునికిని భిక్షసేయు నాసద్మమునన్. 331

క. కడుజవికి నొకకసవుం
బుడక శిరంబంటుకొని బోవుచునార్తిన్
వడకుచు గురువుల యడుగుల
బడి పలికెను నాకు దగిలె పాపంబనుచున్. 332

వ. అదియెయ్యది యనిన మనకు భిక్షచేసినవారింటి పూరిపుడక నా
తలఁ దగిలి వచ్చెను నాపుడుక. 333

(గ్రంధపాఠము)

.........................

.......................

సాదుసురభిదుష్ట సహవాసమున రాత్రి
పొలము మేయబోయి పోయిజేను
జొచ్చి మేతగాపువచి...
దాటుకొనుచుబోవ...... 334

క. వెనుకకు నిటువలె జోరవె
ళ్ళను నెఱుగని గోవుబందెలకు నొప్పింపన్
గనుగొని................
ఘనమగు నొక గుదియ మెడనుగట్టెను జిక్కన్. 335

క. అని తంత్రికథలు చెప్పగ
మనుజేంద్రుడు...మంత్రులు దెచ్చిం
దినక్రొత్తలడుగ మఱచెను
వనితలతమిమఱవు పొడమువరబుద్ధులకున్. 336

వ. నారగుండు కథావిశేషంబులు వినుపించిన బలిచక్రవర్తి యుత్తర
కథా వినోదంబులు వినుపించుమనిన. 337

మ. కరుణాపూర్ణకటాక్ష భక్తజన హృత్కామ ప్రదానక్రియా
సురధాత్రీరుహా! (హృష్ట) దేవముని సంస్తోత్రస్ఫురద్గోత్ర
...త్రకవిన్న భైరవమహాపాత్రాత్మవాక్పాత్ర శ్రీ
ధరణీ ముఖ్యకళత్ర వేంకట నగోత్సంగాల యాధీశ్వరా! 338

క. మిత్రశశినయన భైరవ
పాత్రస్తుత చరణలోక బహుజీవనవటీ
సూత్రభవజలధి తారణ
పా(త్రాయిత చరణకమల) భవ్యచరిత్రా! 339

దోదకము :

కంధరపటల నిశాశ శరీరా! . . . . . . . . . . . . . .

బంధురభైరవపాత్ర !... . . . . . . . . . . .

......బాదనిహారా!

సింధుసముద్భవచి రమణిహారా. ! 340

గద్య : ఇది యష్టభాషాకవితా ప్రవీణ నవఘంట సురత్రాణకూచనా మాత్య పుత్రసుకవిమిత్ర వినయవిద్యావిధేయ యెఱ్ఱయనామ ధేయ ప్రణీతంబైన సకలనీతికథా నిధానంబునందు తృతీయా శ్వాసము.

——:o:——

# చతుర్థాశ్వాసము

శ్రీకుంటముక్ల రమణ
శ్రీకర ? (మహా ?) పాత్ర విభవ ! చినభైరవని
శ్యాకల్ప రక్షణా ! పృథి
వీకల్పక వృక్షయూధ ! వేంకట నాథా ! 1

వ. అవధరింపు బలీంద్రునకు నారదుం డిట్లనియె. 2

చ. వసుధకునంచితాభరణ వైభవమై బహుభోగసంపదన్
గుసుమపురంబనాఁగలద గోచరహట్టములందు నప్పురీ
వసుమతిరాజ హంసుఁడను వల్లభుఁడేలు తదీయ మంత్రులు
ద్వసులు మురారి ? సచివర్యులు పుత్రులఁగాంచి రార్యులన్. 3

ఆ. అక్కుమార వరుల యందునొక్కఁడు తీర్థ
వాసి యయ్యెనొకఁడు దో (?) యయ్యె
నొకఁడు బేరమాడుచుండుచో మాళవుం
డఱుగుదెంచె రాజహంసు మీఁద. 4

వ. అప్పుడు. 5

క. మాళవభీకరకరశ
స్త్రాలికి భయమంది రాజహంసుఁడు వసుధా
పాలనముడించి గిరివన
పాలకుఁడై యరిగెరిపుఁడు పైకొని నడవన్. 6

ఆ. అట్లు రాజహంసునాహవముఖమున
గెలిచి మూర్ఛవుచ్చి బలము మెఱసి
తిరిగి పట్టణంబు దిక్కునకై శత్రుఁ
డఱుగుదేర రాజహంసు దేవి. 7

క. తనపతి రణమున బడెనని
మనమున దుఃఖించి రెండు మార్గమున నికే
తన తలము వెడలి యడవికిఁ
జని ప్రాణము విడువఁ దలచి సంభ్రమ మొదవన్. 8

వ. ఒక్కలతాపాశంబు సంధించి యున్నత వృక్షశాఖనురివెట్టుకో
నచ్చటికిం జేరు సమయంబున. 9

క. అరిచేత మూర్ఛితుండై
యరదముపై నున్న రాజహంసునిఁ బ్రాణే
శ్వరుఁ జూచి మూర్ఛఁ దెలిసెను
సరసిజముఖి విభునిఁ గూడి సమ్మద మొదవన్. 10

ఆ. మాళవేశ్వరుండు మరలి సేనయుఁ దాను
నరుగుటయును రాజహంసుఁ డెఱిఁగి
పొలఁతిఁ గూడి యాత్మపురి సొచ్చె నంతన
ద్ధరణి విభుని దేవి తనయుఁ గాంచె. 11

సీ. అట ప్రధానులు నల్వురాత్మజన్ములఁ దెచ్చి
రాజునకిచ్చి భూరమణ! వీరి
భవదీయపుత్రుని భంగి నే పోషింపు
మని యప్పగించిరి యంతలోన
యతులు నల్వురు నొక్కయాటవికుండును
నొక్కొక్క సుతుఁ దెచ్చి యుర్విపతికి
నిచ్చినఁ దొల్లిటి యేవురు వీరును
గూడ బదుండ్రైరి తోడుతోన
తే. నట్టి పుత్రకు లీరెను నవని బెరిగి
బాల్యమును బాసి యౌవన ప్రాప్తినొంద
సచివులునుఁ దాను సుతులకు సకలనీతి
భావసంగతు లెఱుఁగంగఁ బల్కరపుడు. 12

క. హితవుగలవాఁడె చుట్టము
పతియానతిసేయునదియె భార్యధనాది
స్థితి నడుపువాఁడె జనకుఁడు
మతినమ్మికగలుగు నదియెమైత్రి దలంపన్. 13

క. పతిభక్తి లేని భార్యయు
హితరహితుండైన సఖుఁడు...
కితవసచివుండు పన్నగ
యుతగృహమును మృత్యువునకునున్నళ్ళ పదముల్. 14

తే. చెడకయుండంగ ధనము రక్షింపవలయు
ధనము విడిచైన రక్షింపఁ దగును సతిని
ధనము భార్యను విడిచైనఁ దన్నురక్ష
చేయు నరునకు నభివృద్ధిచేరుచుండు. 15

ఆ. కులముచెఱుచువానిఁ గొనసాగనీవల
దూరుచెఱుచు కుజనుఁజేరదగదు
ఊర్విచెఱుచునూరనుండంగ వలవదు
తన్నుచెఱుచు పుడమిఁ దలఁగవలయు. 16

క. ధనలోభి కర్థమిచ్చియు
ధనగర్వికి దండిమిడియు తామసమూర్ఖుం
డని నట్లయాడియును బుధ
జనులకును యథార్థగతియుఁ దెలుపగవలయున్. 17

క. ధననష్టియును విచారము
వనితాజారతయు ప్రాప్తవంచనమునుకై
కొనమియును భంగపాటును
ఘనుఁడెవ్వఁడు నెఱుఁగకుండఁ గప్పగవలయున్. 18

క. విభున కనుకూలభార్యయు
విభవము సంతోషమునకు విడిపట్లు నిజ
ప్రభువును వశవర్తియునగు
శుభమూర్తికినిది యతలఁప సురలోకమగున్. 19

క. ఆపదవచ్చిన కరవున
భూపతియలిగినను రిపుఁడు వోడిచిన దుఃఖో
ద్దీపనమున పితృభూమినిఁ
బ్రాపొందిన వాఁడె తనకుబంధువుఁడరయన్. 20

క. బహువిధభోజన శక్తియు
మహి(శౌర)తిశక్తియును సమంచిత విభవో
ద్వహనమున దానశక్తియు
నహహాతపః ఫలములనుచు నందురు పెద్దల్. 21

క. వేదంబుఁ జదివి జపహో
మాదులు నడపుచును నృపుని ననవరతాశీ
ర్వాదములఁ గొలుచు విప్రునిఁ
గాఁనక పురోహితుడగఁ గైకొనవలయున్. 22

క. ఏదేశంబున నిజవి
ద్యాదరణము మన్ననయుఁ బ్రియంబునువిబుధా
హ్లాదము చుట్టములును లే
దాదెసనొక దివసమైన నద్దా మెయుండన్. 23

క. ధనమునకు ఫలముదానము
ననుభవమును వేదఫలములన లాహుతులున్
వనితరతి పుత్రఫలమును
వినికికి నడవడియు ఫలమువివరింపఁ దగున్. 24

క. ఖలునందు మంచివిద్యయు
కులహీనుల నంటియున్న కొమ్మయు విషమం
కలితమగు నందు నమృతము
మలగతకాంచనము గొనుట మంచి గుణంబుల్. 25

క. అరులిరువురు గలిగిననం
దొరుఁ జుట్టముఁ జేసి యవలి యొరునణపఁదగున్
చరణంబుముల్లు ముంటనె
వెరవునభేదించినట్టి విధము దలిర్పన్. 26

క. వ్యవహార క్రయవిక్రయ
వివిధార్జనలందుద్యూతవేళలయందున్
యువతీ సంగమములయెడ
వివేకజనుల్ లజ్జ జాఱవిడువగ వలయున్ 27

క. లోకాపవాద భయమును
స్వీకృతదాక్షిణ్య ధర్మశీల వ్రీడా
శ్లోకములులేని నరుతో
నేకాలము జెలిమి సేయ నేలా శుభముల్ 28

క. నరపతి భృత్యుని భావము
పరికింపగవలయు పనులు పంపెడిచోటన్
పరిశీలింపక పంపిన
విరసంబునుఁ గార్యహానియు వేగమవచ్చున్. 29

క. మతిగలిగి ధైర్యవిద్యా
న్వితుఁడై తగుమాటలాడు నేర్పెఱిఁగి పరేం
గితములఁ గనుగొని మెలఁగెడు
నతఁడుమహీపతికి దూతయగు తలపోయన్. 30

క. ఒకపరిఁ జెప్పినకార్యము
వికలముగాకుండ వ్రాసి విద్యాన్వితుఁడై
సకలజనంబులు వొగడఁగ
సకలజ్ఞుఁడు కరణమనఁగఁ జను లోకమునన్. 31

క. బలయుతుఁడై యింగితచే
ష్టలు దెలిసి కురూపిగాక శౌచాత్మకుఁడై
యలపెఱుఁగక నృపహితగతి
కలవడు ప్రతిహారి సుజనుఁడని పొగడువడున్ 32

క. కులశీల సత్యధర్మము
లలవడి తను నెదిరి నెఱిఁగి యానొననగన్
లలితప్రవీణగుణములు
గలవాఁడధిపతికి రాచకార్యమునడుపున్. 33

క. ఆయుర్వేదచికిత్సో
పాయంబులు దెలిసి చదివి యార్యత్వంబున్
గాయసుకుమారతయుఁ గల
ధీయుక్తుఁడు వైద్యమునకు దేవరగాఁడే. 34

క. దుష్టవ్యసనుని మూర్ఖునిఁ
గష్టుని దుర్వ్యయుని నప్రగల్భుని భీతున్
భ్రష్టుని నిష్ఠురభాషణు
నిష్టుండని యధిపతిత్వ మీయరు రాజుల్. 35

క. కొంచెపువాఁడాడిన క్రియ
నంచిత సుగుణాఢ్యుఁడేల యాడును బెక్కుల్
కాంచనము మ్రోయ నేర్చునె
కంచువెసన్ మ్రోగినట్లు గణనకు మీఱన్. 36

క. దుర్గుణులు మూర్ఖజనులవ
వర్గవినాశకులు వారి వర్జించి శుభా
నర్గళపండితు నొకనిఁ ద్రి
వర్గప్రదు నేలవలయు వసుధేశునకున్. 37

క. ఒరునర్థము దానెఱుఁగుచు
నొరుఁడాత్మార్థంబు నెఱుఁగకుండఁగ మెలఁగన్
బురుషుండు బ్రతుకునవయువ
పరికరములు దాఁచు కచ్ఛపంబును బోలెన్. 38

క. హీనజనుఁడైన నధికవు
మానవుఁడగు నేని బలసమగ్రత మెఱయున్
దానిలువవలయు సింహం
బేనుఁగుపై శశము మీఁద నెత్తిన భంగిన్. 39

వ. మఱియు రాజహంసుం డిట్లనియె. 40

క. అబ్బినదాఁకా(?)జ్ఞానము
ప్రబ్బినగతి నూరకుండు ప్రాప్తంబైనన్
గొబ్బున నైకొనుఁ గొక్కెర
యుబ్బున మనుజునకు నిదియ యుచితముగాదే. 41

క. కాలమున మేలుకొనుటయు
నాలంబునఁ బారకునికి నాప్తులకెల్లన్
బాలిడుట బలిమిరతియును
నాలును కుక్కుటమునందు నరుడెఱుఁగఁదగున్. 42

క. రతిగూఢత్వము దూరే
క్షిత(?)యునుఁ గాలమున గ్రాససంగ్రహము బ్రమా
దితలేమి యనాలస్యముఁ
బ్రతివచ్చును కాకియందుఁ బంచగుణంబుల్. 43

క. వైశంబ మేలుకొనుట య
నాలస్యము స్వల్పభుక్తి యధిపతి హితమున్
మేలిమగునిద్ర శౌర్యము
కౌలేయగుణంబులారు కని మనవలయున్. 44

క. అలసియును మోపుమోయుట
చలికిని వేడిమికి నోర్చిచనుటయు తుష్టిన్
మెలఁగుటయు గార్దభమునకుఁ
గలగుణములు నరులు మూఁడు గనికొనవలయున్. 45

క. ముందటఁ బ్రియమును పిదపన్
నిందయుఁ బచరించు దుర్వినీతాత్ముని బా
యందగు గుత్తుక విషమును
బొందగ ముఖ దుగ్ధమున్న భుజగముకరణిన్. 46

క. కులవిద్య మిగుల నుత్తమ
మలవడ వాణిజ్యకృషులు నవి మధ్యమముల్
కొలుచుట యధమంబారయఁ
దలమోపెడి బ్రతుకు మృతివిధంబగు తలపన్. 47

క. కొఱగాని బాంధవంబును
కొఱగాని మహీస్థలంబు కొరగాని నృపుల్
గొఱగాని పత్నియును దను
నెఱుఁగక మును విడువవలయు నీహితబుద్ధిన్. 48

క. చదువని విద్యవిషంబగు
ముదుకనికిని దరుణి విషము మునుదారిద్ర్యా
స్పదునకును గోష్ఠి విషమగు
తుదినరగని భుక్తివిషము దుష్టాత్ములకున్. 49

క. ఉరగంబు మహాక్రీడ(?)
యుర్యురగముకంటెను ఖలాత్ముఁ డుగ్రుండట్లా
యురగము మంత్రౌషధముల
విరియునుఁ గొండీని మాటవిరియక పెరుగున్. 50

క. మునులకును రూపు తాలిమి
వనితలకుఁ బతి ప్రియంబు వర రూపు గళ
స్వన మెపికములకు రూపము
కొనఁటికి రూపంబు విద్యగుణమై యుండున్. 51

క. తొండవులకుఁ జీరముఖ్యము
పడఁతికి ముఖ్యంబు గుబ్బపాలిండ్లు సుహీన్
వడువునకు విద్యముఖ్యము
కుడుపునకు ఘృతంబు ముఖ్యగుణమై యమరున్. 52

క. బలరహితు బలము నరపతి
జలములె మీలకును బలము చదలు బలంబౌ
పులుఁగులకు రోదనంబే
బలమగు బాలురకు సర్వభామల కుండున్. 53

క. కరటికిని వేయి చేతులు
హరికిఁ బదియు బండి కైదుహస్తంబులు దు
ష్పురుషుఁవన దూరముననే
పరిహరణీయుండు మిగుల బాంధవుఁడైనన్. 54

క. ఉపకారికాఁగ వలవదు
రిపునకుఁదడమాత్యవరు వరించియభీష్టా
ద్యుపకృతు లతనికిఁ జేయుచు
నృపులాతనివలనఁ గార్యనిర్ణయముసగున్. 55

క. హితుఁడైనవాఁడె చుట్టము
హితరహితుఁడు చుట్టమైన నెడరే కోరున్
జతరోగి కడవిమందులు
హితులై రక్షించుగాన నెఱుఁగఁగ వలయున్. 56

క. గిరిగిరిని మణులుగలుగవు
కరికరికిని మౌక్తికములు గలుగవు ధరణిన్
నరులెల్ల సజ్జనులుగా
రరయఁగ మలయజము దొరక దడవులనెల్లన్. 57

క. గుడికిని రవ్వైనచోటును
పడియుండెడిచోటు పత్రభాజనమును నుం
డెడుచోటు పీకకంబు(?)జ
గడమాడెడుచోటు విరివిచాలగ వలయున్.[1] 58

క. కులమును రూపమువయసునుఁ
గలిగియు విద్యావిశేషగతి లేకున్నన్
తలపరు మనుజులు గహన
స్థలమునఁ బూఁచున్న బ్రహ్మతరువును బోలెన్. 59

క. ఉపకృతిఖలునకుఁ జేసిన
నపకృతియేచేయుఁ గాక యాప్తుఁడగున దా
కృపగలిగి పాలువోసిన
కపటంబున పాము విషము గ్రక్కకయున్నే. 60

క. జలరుహనాళంబున జల
ములలోతును వినయశీలములచేఁ గులమున్
బలుకుల విద్యయు శాంతిన్
గల తపమును నెఱుఁగవచ్చు ఘనులకునెల్లన్ 61

1. యతిభంగముగాఁ గాన్పించుచున్నది.

క. తురగములచేత, నావులు
పరవనితలచేతఁ గులముభామలు కావ్యో
ద్ధరణములచేత శ్రుతు ల
ల్లురచేతను సుతులు హీనులుగ, గావలెసెన్, 62

క, ధనికునకు నిచ్చుదానము
వననిధి పైఁగురియు వాన వాంఛాతృప్తిన్
దనియని విప్రులకును భో
జనమిడుటయు మూఁడువృథ లుచర్చింపంగన్. 63

క. కులహీనునకును విద్యయు
లలనకుఁ గూరగాని రతియు లక్షణహీనుం
గలిమియుఁ బొందును నొకచోఁ
గులశైలముమీఁద వానగురిసిన భంగిన్. 64

క. భేరీశబ్దం బామట
ధారాధరగర్జితంబు దశకమున, మహో
దారుఁడు లోకత్రయమునఁ
బేరెన్నికగాంచు జగము ప్రియమున బొగడన్. 65

క. తనయింట మూర్ఖపూజ్యుఁడు
తనయూరం బ్రభువు పూజ్యతరుఁడగు రాజున్
దనభూమిఁ బూజితుండగు
విను పూజ్యులు సకలమునకు విద్యావంతుల్. 66

క. పులకండపు పాదునఁదగ
మొలపించిన వేపవిత్తు మొలకకు జాలన్
జలువఘటించి (నము)ధురము
గలుగని గతిఖలునకేల కలుగును! గుణముల్. 67

క. నిత్యంబుగాదు విభవ, మ
నిత్యము దేహంబు నిత్యనిహితంబగుగా
మృత్యువు, గావున నిత్యమ
నిత్యంబును ధర్మవృత్తినిలుపఁగ వలయున్. 68

క. నీచునెడ నీచతయును స
దాచారునివలన సాధుతాపూజయు దు
ష్టాచరితువలన నతి దు
ష్టాచరణముచేసి రేని నఘమేలబ్బున్. 69

క. అలసునకు విద్యవొందదు
కలుగదువిత్తంబు విద్యకలుగయేనిన్
కలిమిం బాసిన మిత్రులు
గలుగరమిత్రులకు నేల కలుగున్ ఫలముల్. 70

క. అనిచిన పరిమళవృక్షము
వనమున నొకడుండి వనము వాసించుగతిన్
తనయుండుత్తముఁ డన్వయ
మునఁగలిగిన వంశమెల్ల ముదమును బొందున్. 71

క. పట్టినప్రమాఁకున, ననలము
పుట్టినవనమెల్లఁ గాల్చు, పోలిక ఖలుఁడై
పుట్టినసుతుఁ డన్వయములకుఁ
దిట్టును అట్టును ఘటించి తేజము చెఱుచున్. 72

క. మొదలను సమస్తవిద్యలు
చదువుట వయసునను ధనముసాధించుట సం
పదమీఁద ధర్మికాడగు
దుదినేమియుఁజేయ నరుఁడు దొరకమి కతనన్ (?) 73

క. అక్షరమొక్కటి నైనను
శిక్షించిన గురువు సేవసేయని మనుజుం
డక్షణము శునకయోనుల
నక్షీణతఁ బుట్టి మాలఁడై జని యించున్. 74

వ. మఱియు సునీతి వర్మయిట్లనియె. 75

క. ఏపాటిమేలు దొరకిన
నాపాటికి సంతసింతు రార్యజనంబుల్
కాపురుషలోభి మానవు
లాపోవక మఱియు మఱియునాసింతురిలన్. 76

క. తేలునకు తోఁకవిషమగు
వ్యాలమునకుఁ బండ్లవిషము వనమక్షికకున్
బోలంగ శిరము విషమగు
కాలినఖలునకును విషము కాయంబెల్లన్. 77

క. వ్రణమాశించును మక్షిక
రణమాసించును ధరిత్రిరమణుఁడు కలి దు
ర్గుణమాసించును నీచుఁడు
గుణిసంగతిఁ గోరుసాధుకులుఁడే ప్రొద్దున్. 78

ఆ. సిగ్గువడినలంజ చెడు సిగ్గు లేనట్టి
కులవధూటి వోలె యిలకుఁ దనిసి
సంతసించు నృపుఁడ సంతుష్టవిప్రుని
పగిదిచెడును సత్యభాషణంబు. 79

క. మృగచండాలము గాడిద
ఖగచండాలంబు కాకి కడుఁ గోపమునన్
దగిలినముని చండాలుఁడు
జగతిన్ దూషకుఁడు సర్వచండాలుఁడగున్ 80

క. తల్లియు నిల్లాలునుదన
యిల్లరసిన నడవియై నిల్లగుచి దిదాఁ
జెల్లకయుండిన నరునకు
నిల్లఁది దానడవియగును నెఱుఁగఁగవలయున్. 81

క. హాలికునకుఁ గరువుజేరదు
కలుగదుమాటాడకున్న కలహము జపికిన్
గలుగదు పాపము జాగర
కలితునకును భయములేదుకదు సూహింపన్. 82

తే. రాష్ట్రమొనరించు పాపంబు రాజుఁబొందు
క్రతువుపాపంబు తత్పురోహితునిఁబొందు
భార్యచేసిన పాపంబు భర్తఁబొందు
శిష్యుచేసిన పాపంబు చెందుగురుని 83

ఆ. హితులు దెలిసిరేని హితులకు హితులయిన
వారుదెలియ నట్టివారివలన
మంత్రమవియుఁగాన మంత్రియొక్కఁడుదక్క
నొరులుమంత్ర మెఱుఁగ కుండవలయు. 84

క. బలయుతుఁడు గాగమంత్రిన్
మెలపంగావలదు నృపతిమెలపెన యేనిన్
బులికిం బక్కర యిడుకొని
కలహమునకు నెక్కిపోవు కరణియకాదే. 85

క. సుతుకడకు గురువుకడకున్
పతికడకుఁ వేల్పుకడకు జనపతికడకున్
బతికడకు బ్రియముగోరెడు
సతఁడూరకరిక్త చేతనరుగుట తగునా. 86

క. బలయుతుఁడు వైరమొత్తిన
బలహీనుఁడు ప్రియముచెప్పి బ్రతుకుట గాకా
నెలవు దిగవిడిచి పోవక
నిలుచుట హరిఁజెనకి కరటినిలుచుటగాదే. 87

క. ధనికుఁడు గావలె గాదా
చనవరిగావలయుఁగాక జనపతిగొలువన్
మనుజులకు ముక్తికొఱకా
తనువలయఁగ సేవచేయఁ దత్పరబుద్ధిన్. 88

క. వల్లభునకలిగి తాఁజెడు
వల్లభుఁడలిగినను తానవశ్యమును జెడున్
ముల్లుపయిఁ బడిన తానా
ముల్లుపయిం బడినరఁటి మొగచిఱుఁగుగతిన్. 89

క. మహానీయ భోగసంపద
మహీనాథునికంటె రాజమాన్యులకంటెన్
బహులముగఁ జూపవలవదు
బహుమానము తప్పుసిరియు భంగముపొందున్. 90

క. కలిమిగల దినములందునె
కలరాప్తులు బంధుజనులు కాంతలుభటులున్
కలిమఱఁగినఁ దోఁబలుకరు
కలిమియెచుట్టంబు దలపఁగా మర్త్యులకున్. 91

ఆ. అలవిగాని పనికి నాసించుదుర్మతి
వెతను బొందుతాపగతులడిందు
నిడుమనొందు మానమెఱుఁగక చేటొందుఁ
గానవలవదలవిగాని పనులు 92

ఆ. ఈఁగిలేనివాని నిమ్మనువాఁడును
వ్యసని వ్యసన ముడుగు మన్నవాఁడు
పందెఁబోటునకునుఁ బనిచిన వాఁడును
నెరయ శత్రులగుట నిశ్చయంబు 93

క. ఆయవ్యయముల లోపల
నాయమునకు వ్యయముమిగుల నల్పంబైనన్
శ్రీయగు సరియగు నేనది
పాయదు వ్యయమధికమైనఁ బాయును సిరియున్. 94

క. పలువురు మెచ్చఁగ సభలోఁ
బలికిన పలుకొప్పుఁ జిలుకపలికిన కరణిన్
బలుకక యసహ్యముగదాఁ
బలుకుట యది గార్దభంబు పలుకుటగాదే. 95

క. మునియును శకునజ్ఞుఁడు దనుఁ
బనిచిన పనికొకనిఁ డానెపనిచెడు వాఁడున్
జనిరాని వాఁడు కంబపు
వెనుకకుఁ జనువాఁడు భృత్యవృత్తికి నధముల్. 96

క. చల్లని మాటలచేతను
నెల్లపనులు దీర్పవచ్చును నిదియెట్లన్నన్
చల్లనియేరులు గావే
పెల్లగిలంగొట్టు పాఁతుపెకలం గిరులన్. 97

ఆ. స్వామిపగిదిపంచ సంవత్సరంబులు
పదియువత్సరములు బంటువలెను
అంతఁబదియునారు హాయనమ్ములునిండ
మిత్రువలెనుఁ బుత్రుమెలపవలయు. 98

క. బాలస్త్రీరతి మాఁపటి
వేళల యెండయును వండువిడిచిననీరున్
వేలిమిపొగయును రాత్రిఁటి
పాలును నాయుష్యకరము పరిశీలింపన్. 99

క. బాలార్కుఁడు శవధూమము
లోలస్త్రీరతియు పల్వలోదకము నిశా
వేళలదధి భోజనములు
హాలాహల గళునకైన నాయువునణఁచున్. 100

క. పురుడునకు నిచ్చుత్యాగము
శరబడి(?) దలపోసియిచ్చు శాకము గూత్రాం
తరములనొసఁగెడు నీఁగియు
సిరికిన్ మోసంబుగాఁగఁ జేయదె మనుజా. 101

క. ప్రాణంబు సకలజనులకు
వానయ యవ్వానతఱచు వచ్చినదిట్టం
బూనుదురుగాన పరిచయమే
నరునకైన మానహీనతఁ జేయున్. 102

క. తనసిరిలోకములకుసిరి
తనదారిద్ర్యమ్ములోకదారిద్ర్యమగున్.
తనబ్రతుకు జగముబ్రతుకుట
తనమృతి జనమునకు మృతియుంద థ్యంబరయన్. 103

క. అలుక తనకుతయ మగుటయు
నలిగించినవాని నామమణఁగద యేనిన్
పొలయులుకగాక యదియును
నలుకా! తలపోయ నెట్టియధమునకైనన్. 104

చతుర్విధవృత్తము

పనసరసాల పాటలుల పాటిగనుత్తమ మధ్యమాధముల్
వినబడుచుండ్రు పూయకఫలించియుఁ బూచి ఫలంబునొందియున్
ననిచిఫలంబు లూనకవినాశము బొందినయట్టిపోలికన్
మునుఫలమిచ్చి పూచిఫలముల్ ఘటియించియుఁబూచి పండకన్. 105

వ. అంతవివేకసముద్రుం డిట్లనియె. 106

ఆ. వడ్డికిచ్చుటయును వాదంబుసేఁతయు
కరిశనంబు[1]పొత్తు కాంతవరుస
ద్యూతమాడుటయును నొకనింట నుంటయు
జగడమునకు మొదలి సంచకరువు. 107

క. కలవాఁడె బుద్ధిమంతుఁడు
మలినుఁడె యవివేకి వ్యసనమనుజుఁడె భూతం
బిలులేనివాఁడె వేఁదుఱు
కలహియె పెను చిచ్చు తలపఁగా నెల్లెడలన్. 108

క. ఉరగము కంటెనుఁగొండీ
డరయఁగనధికుండు దలప నహిగరమొకనిన్
బొరిగొను గొండీఁ డొఱచెవిఁ
గఱచిన మఱియొకని ప్రాణకాంతులు దఱుగున్. 109

క. కులజుండొక్కఁడు చోరకే
కులమును సాధింపరాదు గొడ్డలియటవీ
కులజమగు కామకతమునఁ
బొలియింపదె బహుళవివిధ భూరుహసమితిన్. 110

---

1. సఖ్యము.

క. దీపనభుక్తియె పథ్యము
రాపొమ్మనకిచ్చు వాఁడెరసికుఁడు తలఁపన్
కోపింపనివాఁడే ముని
పాపమునకుఁ దలఁగువాఁడె ప్రభువు ధరిత్రిన్. 111

క. పగలేని వాఁడె మనుజుఁడు
తగవెఱిఁగెడునదియె వారతరుణీమణి స
వ్వగలేనివాఁడె ధనికుఁడు
నగచాట్లంబడని వాఁడె యనుభోక్తయిలన్. 112

ఆ. యెదురగురుల బంధుహితులను బిమ్మట
బంటుబానిసలను పసులవెనుకఁ
బొగడఁదగును బుత్రుఁబొగడకు మెప్పుడు
పొలఁతి చావకున్నఁ బొగడవలదు. 113

క. అలజడి చుట్టము మనసునుఁ
గలవన్ సేవకుని మనము గలిమఱఁగినచో
నలివేణిమనసు నాపదఁ
జెలిమనసునుఁ గానవచ్చు చేష్టలచేతన్. 114

ఆ. అవగుణంబె వెదకునల్పుఁడ మేధ్యంబె
వెదకు పందిగతి వివేకిమంచి
సాధు గుణమెతలఁచు జలమునందునుపాలు
తెలిసి కోలు హంస తెఱఁగుదోప. 115

క. వెలయాలు జాతిపిల్లియుఁ
చిలుకయు బెస్తయును పూర్వసేవకులనితా
వలవదునమ్మఁగ నొండొక
తలపెత్తిన వెళ్ళబారఁ దలపుదు రెవ్వరున్. 116

క. అనల ఋణవైరి శేషము
లును పంగావలదొకింత యుండెనయేనిన్
వనమెరియు నప్పువెరుగును
తనువడఁగును గాన తీర్పఁదగు నివియెల్లన్. 117

క. పరివారంబునుఁ బ్రజయును
నరిజయమును భూపతులకు నాభరణంబుల్
పరికింప గనకరత్నా
భరణంబులప్రియము మోపు పరికింపంగన్. 118

క- బాలకుఁడు నాథుఁడైనను
బాలిక గృహకర్త్రయైనఁ బలువురు మనుజుల్
వాలాయకాంద్రు నైనను
పాలసు విభుఁడైన నింటి భాగ్యముదప్పున్. 119

క. అలుకయు రతాగుణమును
గలుగక యలమటయతనకు కార్యంబులుగా
మెలఁగెడు భూపతిఁ గొలుచుట
పులిసాధని(!) నమ్మిచేరఁ బోవుటగాదే. 120

ఆ. ఆత్మబుద్ధి లెస్స అంతకంటెనుపర
బుద్ధిసంపదలకుఁ బ్రోఁదిసేయ
ఖలునిబుద్ధి కీడుకామినీ జనముల
బుద్ధిప్రళయమునకుఁ బుట్టినిల్లు 121

క. తనయులకు మంత్రులకుహిత
జనులకు మిత్రులకు నాత్మసంపద పాత్రీఁ
జనుగాని చనవుపాత్రీఁ
జనదవనీశులకు కార్యసరణుల దలఁపన్. 122

క. వేళెఱింగి సస్య (మలికెడు)
పాలికుగతి కార్యగతుల నయ్యెడు వేళ
న్నేలింపకున్న, దోషం
బాలస్యమునందు గరళమగు నమృతంబుల్. 123

క. మానంబె కోరునుత్తమ
మానవుఁడు, మధ్యముడు ధనముమానము గోరున్
మానంబు విడిచి, ధనమే
మానుషమనికోరు, నధమ మానవుఁ డెందున్. 124

ఆ. ఆత్మశక్తిఁ బడయు నర్థముత్తమము పి
త్రార్జితంబు మధ్యమాహ్వయంబు
మాతృవిత్తమధమ మార్గంబు, స్త్రీవిత్త
మధమమునకు నధమమనిరి మునులు. 125

ఆ. అన్నమునకు నధికమష్ట గుణంబులు
పిష్టమంతకంటె నష్టగుణము
పాలు దానికంటెఁ బలలమష్టగుణంబు
నాజ్యమష్టగుణము నంతకంటె. 126

క. తనచేతఁజాలనొచ్చిన
మనుజుని నాసన్నుఁజేసి మనుపుట, సర్పం
బునుఁ దోఁకనఱికి క్రమ్మఱఁ
దనచేరువ నుంచుకొనఁగ దలఁచుటగాదే. 127

క. దినకరుఁడుష్ణము మఱియు
ద్దిన కరునకు నుష్ణమగ్ని దిన నాథహుతా
శనులకు నత్యుష్ణము దు
ర్జనముల వాక్యములు సకలజగములయందున్. 128

క. చందనము చలువ జగములఁ
జందనమునకంటెఁ జలువ చంద్రుఁడు మఱియు
చ్చందనచంద్రులకంటెను
పొందుగ శైత్యములు సుజన పురుషుల పలుకుల్. 129

క. కులపత్ని యొక్క-తియు, మఱి
హలయుగమును, నందనత్రయంబునుఁ బదియా
వులు మధ్యరాష్ట్రమునుఁ, దగ
ఫలియించెడునిలయు, నునికి పట్టుకునమరున్. 130

ఆ. కన్నెరూపుగోరు కనకంబుఁ గోరును
దల్లి చదువుగోరు తండ్రి బంధు
జనము కులముఁ గోరుసౌఖ్య భోజనమిల
జనముగోరునిదియ జగతినురవు. 131

ఆ. గుఱ్ఱమునకు మోపుగుణమును గన్నకుఁ
దల్లిగుణము పుడమి పుట్టుగుణము
నవనినిర్జరులకు నాచారగుణమును
దెలిసికొనఁగ వలయుఁ గలిత బుద్ధి. 132

క. తమవారి బాసినను, ను
త్తమ మిత్రుండైన మిగులఁ దాపముసేయున్
గమలంబు నీటఁబాసిన
కమలాప్తునివేఁడి చేతఁ గమలినభంగిన్. 133

వ. రాజవాహనుమంత్రి శ్రుతకీర్తి మఱియు నిట్లనియె. 134

క. న్యాయమునఁ బెరుగు ప్రజ, నర
నాయకునకు సిరియుఁ బెరుగునానాఁటికి న
న్యాయంబుఁ దలఁచుధరణీ
నాయకునకు సిరియుఁ బ్రజయునాశముఁ బొందున్. 135

క. ఖలజనుల తోడఁ బుట్టినఁ
గలిసినఁ జిత్తంబులెనసి కదియకయుండున్
జలములనె పుట్టిపెరిగిన,
నలతామర పాకునీట నంటని భంగిన్.(?) 136

క. చులుకని వారలఁ గూడిన
చులుకదనంబగును స్థిరవిశుద్ధాత్ములకున్[1]
శిలలటువరదల సంగతి
జలములలోఁ దేలినట్లు చర్చింపంగన్. 137

క. విఱుగంగఁ దగదు భటునకు
విఱుగంగాఁ జెల్లు భూమివిభునకునాజిన్
విఱిగినను బసిఁడికలశము
గొఱయగు మృద్ఘటము విఱిగికొఱమాలదొకో. 138

ఆ. చందురుండు మిగుల చల్లనివాఁడన
విరహిజనులకెట్టు వెట్టయయ్యె!
అట్లుగాన మనుజుఁడందఱికిని నొక్క-
చందముననె భక్తిజరుపఁగలఁడె. 139

క. సేయఁదగునట్టి పనికిని
జేయనుపాయంబు సఫలసిద్ధి వహించున్
వేయేల! కాకతాళ
న్యాయం బగుఫలము ప్రాప్తమగు నరుకరణిన్. 140

క. పరికింపఁ బురుషునకునా
భరణముధైర్యంబు, యతికిఁబదవియె యోగా
భరణంబు శాంతి, స్త్రీకా
భరణము లజ్జాగుణంబు భావింపంగన్ 141

1. కదియక్రకునికిన్.

వ. ఇట్లు సునీతివర్మయు, వివేకసముద్రుండును శ్రుతకీర్తియును, దండ్రి
యగు రాజహంసుండును నానానీతి విశేషంబు లెఱింగించి సుతు
లను దిగ్విజయార్థంబనిపినంజని, వనంబున నొక్కచో నవధూతఁ
గని వానితో సఖత్వంబుచేసి తదుపదిష్ట మార్గంబున రాజవాహ
నుండు పాతాళబిలంబు ప్రవేశించుచు నాత్మామాత్య పుత్రులనుప
హారవర్మ పుష్పోద్భవార్థపాల సోమదత్తులు మొదలయిన
తొమ్మండ్రను వెలుపల నునిచి యొక్కరుండును వసుంధరా రం
ధ్రంబు ప్రవేశించి. 142

ఆ. పావకాదివిఘ్న పటలిని నిర్జించి
యురగలోక కనకపురముఁగాంచి
యందుమయుని పుత్రియైన కాళిందిని
ననుభవించి వనిత దనకు నొసఁగ. 143

క. ధరియింప క్షుత్పిపాసలు
వారయని రత్నమున నర్ఘ్యమును గైకొనిత
ద్ధరవెడలి, రాజవాహనుఁ
డరుగుటగని, నిలువుమనిన, నంగనకనియెన్. 144

క. మిత్రుడవన్యపుఁ జుట్టము
మిత్రునిఁబోషించుకంటె మేలునుఁ గలదే
మిత్రులఁబాయుట మిక్కిలి
ధాత్రింబాతకము గాఁగదలఁపుడు రాద్యల్ 145

ఆ. అరులఁజూచి దుఃఖమందంగ, మిత్రులు
సిరులఁదేల రాజ్యచిహ్నలందు
నాత్మదేశ మేలునది వైభవముగాఁక
యన్యదేశవాస మదియుమేలె, 146

వ. అట్లుగావున నాత్మమిత్ర పరిత్యాగంబును బరదేశభోగంబునుసుచి
తంబుగాదని కాళిందినొడంబరచి, పాతాళంబు వెలువడి మిత్రులం
గలసియుండు నప్పుడు పుష్పోద్భవుం డిట్లనియె. 146

ఉత్సాహం :
రాజవాహనముమ్ముఁ బాసిధరాకరంధ్రమునీవు వి
భ్రాజమానుఁడవగుచుఁ జొచ్చినంబ్రాప్త దుఃఖముబొందిమే
మీజగంబున సంచరింపుచు నిమ్మహీస్థలి నున్నస్వా
రాజసన్నిభుఁ బట్టికొనిరొక రాజధానికి వచ్చితిన్. 147

ఆ. వాఁడు చెలిగాఁగ నప్పురవరముఁ జేరి
బంధుపాలుని సఖ్య సంప్రాప్తినొంది
వాఁడునేనును శకునంపు వాంఛనరుగ
నొంటిఁదత్పుత్రి చింతింపు చున్నవేళ. 148

వ. మత్సఖుండైన చంద్రపాలుని శకునంబునకుఁ బెట్టి నేనబ్బాలచం
ద్రికంగామించి తదనుమతంబునఁ దత్పూర్వపతిని వధియించి యు
క్కామినిం గైకొంటి మన. మప్పురంబునకుఁ బోదమని రాజవాహ
నుం దోకొనియవంతికింజని. 149

క. కుసుమపుర మేలునీతం
డసదృశగుణశాలి యనుచు నాప్తులకెల్లన్
వెసఁజెప్పచుఁ దత్పురవర
వసుధేశ్వరు పుత్రినయ్యవంతీకన్యన్. 150

ఆ. రాజవాహనునకు రమణిగాఁ జేయుదు
ననుచుఁ బాలచంద్ర నతివకడకుఁ
బనిచి ప్రియము దెలిసి పణఁతికై తాఁదిరు
గాఁడుటయును దెలిసి పీడలేక. 151

వ. రాకపోకలు సేయుచుండు నంత నొక్కనాఁడు

క. హితుఁడైన సోమదత్తుఁడు
సతియునుఁ దాఁగూడివచ్చి సమ్ముఖమైనన్
క్షితిపతి సుతుఁడును స్నేహం
బతి శయముగ నెట్లువచ్చితని యడుగుటయుఁన్. 153

వ. అతం డిట్లనియె. 154

సీ. పురవీధినొక్క యద్భుతపు రత్నముగని
యది దరిద్రుండైన యవని సురున
కిచ్చినఁ దలవరు లిదిరాచసొమ్మని
పట్టిన నన్నుఁజూపె బ్రాహ్మణుండు
వారును నను బట్టి కారాగృహంబున
సంకెలఁబెట్టి రా జనులగూడ
నంతలా చోరుండమ్మాన సారుని
నరిగెల్చి కూఁతునయ్యవని పతినిఁ

తే. బట్టికొనిపోవ నేను దత్ప్రజలకూడి
సంకెలనుఁ బాసియమ్మాన సారునకును
రణసహాయంబుపడ మంత్రి రాజసుతను
నాకునిప్పింప వచ్చితి నరవరేణ్య 155

వ. అనిన సంతసిల్లి యున్నంత. 156

ఆ. ఇంద్రజాలి యొక్కఁడేతెంచి, యీరాజు
కూఁతు నీకుఁబెండ్లిసేతుఁజూడు
మిపుడెయనుచు మాళవేశ్వరు ముందట
కరిగివిద్యఁజూపు నవసరమున. 157

క. ఏనింద్రజాలికుండను,
భూనాయక ! మూఁడులోకములు రప్పింపం
గానేర్పు గలదు తగువరు
నీనందన తోడఁగూర్తు నిజముగ ననుచున్. 158

ఆ. అయ్యవంతిఁ బెండ్లియాడెడు గంధర్వుఁ
డిపుడెయనుచు నృపతి కౌతుకచేసి
యతని సమ్మతమున సుతకు వైవాహికా
లంకృతులు ఘటించి లలితముగను. 159

వ. రాజవాహనం బురస్కరించుకొని గంధర్వసమూహంబునఁ బొడ
చూపునట్లుగ మాయవన్ని యవంతీకన్యకం దెచ్చి రాజవాహను
నకు వహ్నిసాక్షిగ బెండ్లిచేసియనిపిన, నయ్యింద్రజాలిబలంబుల
దృశ్యంబైన రాజవాహనుండవంతీసహితుండై యప్పురంబున
రహస్యవృత్తిం జరియించుచుండునంత. 160

తే. మాయగంధర్వుఁ గల్పించి మత్తనూజ
నెత్తుకొనిపోయె నెవ్వఁడో యిప్పురమునఁ
బట్టితెండని తెప్పించి బందిపెట్టి
పుత్రిపైఁగూర్మిఁ జంపక, భూపసుతుని, 161

ఆ. అంత చండవర్మయనురాజు తనకూఁతు
నడుగ నీకయున్న నాతఁడలిఁగి
దండు గదలివచ్చి దారుపంజరమున
నున్ననయ్యవంతి నుత్పలాక్షి. 162

చ. ప్రియమునఁజూచి సంకిలియఁ బెట్టినరాణువనెల్ల భీమని
ర్దయత(రవృత్తిఁబంపి) భటరాజిపెసంజని రాజవాహు ని
ర్దయతను దెచ్చిసామజము పాదమునన్ పెసగట్టఁబంచినన్
రయమునఁ జండవర్మ నొకఅట్టడి భృత్యుఁడు చంపెనాదటన్ 163

తే. గజముచంపక దైవయోగమునఁ బాద
బంధనము ద్రెంచి మావంతు పట్టుకొలుచు
నంతమావంతు తలఁగొట్టిహస్తిఁ బరపి
వీడుమట్టించె నాబాల వృద్ధముగను. 164

వ. అంత. 165

క. అపహార వర్మయను పూ
ర్వపు మిత్రుఁడువచ్చి చండవర్మను, వెసనే
నపగత జీవునిఁ జేసితి
నృప! నిను సంకెళ్ళనిడిన నీచాత్మకునిన్. 166

వ. అనియివ్విధంబునఁ దొల్లిరాజవాహనుతోఁగూడ దిగ్విజయార్థంబు వెళ్ళివచ్చినకుమార నవకంబును నటుక్రితంబు వ్యవహార తీర్థయాత్రా భ్రాంతులై పోయిన మువ్వురును రాజ్యంబులు వడసిన వారలుగావున చండవర్మకు సహాయులౌట రాజవాహనుపైఁగవిసి తెలిసియప్పన్నిద్దఱు నతనింబట్టబద్ధునిం జేసిసేవింపుచు నొక్క-నాఁడు. 167

క. అపహార వర్మయిట్లను
నృపనందను రాజవాహునిం గనుంగొనియో
తపనప్రతాప! యువ్విం
ధ్యపుగిరి మముడించి నీవుదలఁగిన పిదపన్. 168

ఉ. భూవర! మిమ్ము నేవెదుకఁ బోవుచు జైనులపల్లెఁగాంచుచోఁ
గ్రేవలనేడ్చుచున్న యొక కేవలిఁ[1] గాంచి యదేలయేడ్చెదో
పావనమూర్తి! యన్ననుఁబల్కెఁగనుంగొని యేమి చెప్పుదున్.
గావరమొత్తినాఁడు గలకర్బుర[2]మెల్లను వేశ్యకిచ్చితిన్. 169

1. కేవలి - సన్యాసి
2. కర్బురము – బంగారము.

వ. అదియునుంగాక. 170

క. కోమటి కుబేర దత్తుఁడు
శ్రీమంతుఁడు తనదుకూఁతుఁ జెలువనునాపైఁ
బ్రేమ గలదాసి, నాకీ
దేమో ! నేఁబేదననుచు నిందతిలోఁ గన్. 171

ఆ. అనుచుమతియు నేఁడ్వ నావైశ్య తనయు నేఁ
బెండ్లి సేతు నీవు పెట్టినట్టి
వారవనితసొమ్ము నేరుపునను దెచ్చి
యిత్తునీకు మఱుఁగ కింటనుండు. 172

వ. అనియూరడంబలికి యప్పురము ప్రవేశించి కపటద్యూతక్రీడ గలు
వు ధూర్తులయొద్ద నిలిచి వారలకు నాటచెప్పిన వారలిగి నీవాడ
నేర్చిన రమ్మనిన నేనును నట్లకాకయని కూర్చుండి పాసికలు కై
కొని యప్పుడు. 173

క. పాసికలఁ గపటవిద్యా
భ్యాసముభావించి చూచి పందెంబునకుం
జేసితగిలించి ద్యూతో
ల్లాసంబున శతసహస్ర లక్షలొందుల్. 174

వ. అంత. 175

క. అపహార వర్మయనియెడు
కపటికిఁబురి దిరుగనువుగా దనుచును స
త్కృప వెరవు చూపుకై వడిఁ
దపనుండస్త్రాద్రిఁ గ్రుంకెఁదమ్ములు మొగుడన్. 176

క. వీటఁగల వీధి వీధుల
చోటెఱుఁగన్ రాక సర్వశూన్యంబగుచున్
గాటుక కరాటమునకున్
బాటై తిమిరమ్ము భూనభస్థ్సలిఁ గప్పెన్. 178

వ. అప్పుడు. 177

ఆ. ద్యూతమాడి తనకునోడినకితవుండు
విత్తమునకు వానివెంటఁ గొనుచుఁ
బోవఁబ్రొద్దు పోయిపురమునఁ జెఱుగంత
సొమ్ముతోడ మెలఁగు సుదతిఁగాంచి. 179

సీ. ఈదాంగ ప్రొద్దు నీవెచ్చటి కరిగెదు
తొడవులతోనన్నుఁ దోయజాక్షి
యనియెఁ గుబేరదత్తుని తనూభవనేనుఁ
దమ్ముమా తండ్రియు దారుడనెడి
యూరవ్యసుతునకు నుద్వాహ మొనరింతు
నని వాఁడు పేదైన నతనికీక
యొందు వైశ్యునికీయ, నున్నాఁడు మున్నియుఁ
బలికినాతఁడె, నాకు భర్తయగుటఁ

ఆ. ప్రియముగలదు, వాఁడు పేదైనఁగా నిమ్ము
వానియింటికరుగవలసి యిప్పు
డరుగుచున్నదాన, ననుటయు నినువానిఁ
గూర్తుననుచుఁ దోడుకొనుచు నరుగ. 180

ఉత్సాహం :
పారి దిరుగపురము వీరభటులు దివ్వెలెసఁగన
చ్చేరువకును వచ్చుటయును జేడియకును బుద్ధి సం
చారమెల్ల చెప్పి యపుడు గర్వదష్టుకై వడిన్
నేరనుఱుగు దారఁగఁ ద్రెళ్ళనొచ్చిమూర్ఛవోయినన్. 181

వ. యక్కన్యకతలవరులం జూచి యిట్లనియె. 182

క. పరదేశులమిా, రాతిరి
పురమున నిచ్చోట నిద్రవోయినతఱి, మ
ద్వరుఁ బాముగఱచె వీనికిఁ
గరుణన్ విషవైద్యమిచ్చి కావరె యనుచున్. 183

క. పలవింపఁగొన్ని మందులు
తలవరులాతనికిఁ బెట్టఁదత్ఫణి విషమున్
దొలఁగినవలె నుత్థితుఁడై
యలి కుంతలఁ, గొనుచు నయ్యుదారుని కడకున్. 184

వ. చని యక్కన్యకం దెచ్చితి, మిమ్మిరువుర బ్రాణిగ్రహణంబు వొన
రించెద ననిన, నిరువురు సంతోషించుటయు నయ్యుదారుననుమతి
నక్కాంత నింటికనిపి వాఁడునుఁ దానును గూడుకొని. 185

చ. బలపముఁ గావిచీరములబంతి కసీఁసపుగోక, చొక్కమం
దుల ముడి సన్నిసంహతి చతుష్టము దీపవిరోధిపేటి కు
క్కల వదనంబు కట్టసెలకట్టియు, మాఱుశిరంబు సన్నచె
ప్పులు దొనకోల వాలుకయు భూషణరాజిగఁ జోరమూర్తియై. 186

వ. అవ్వైశ్యునింటికిం జని.

ఆ. గోడ బ్రాఁత బ్రాసికూర్చుండి భూమికి
మ్రొక్కి గోడనేల చెక్కఁ ద్రవ్వి,
కనుమచేసి లోనఁ గాళ్ళలను మునుసాచి,
యరసిచొచ్చి యర్థమంత దేవి. 187

చ. అనుపమవస్తువుల్ గొనుచు నంగడికిన్ గొని తేర నారెకుల్
గని పరతేరనగ్రమున గంధగజేంద్రము నిద్రవోవ, నం
తను బడఁద్రోచి యేనుఁగు నదల్చుచు నెక్కి ఛటాలిఁదోలి వై
శ్యుని శుభగేహముల్ చదిపి యున్నతభూజము కొమ్మవట్టుచున్. 188

ఆ. అంతఁదెల్లవార నవనీరుహాముడిగ్గి
యయ్యుదారు నింటికరిగి వాఁడుఁ
దానుఁగూడి బుద్ధిఁదలఁచి చర్మపుదెత్తి
భూరిరత్నభర్మములు ఘటించి. 189

వ. తదీయమహాత్వంబు గఱపి భూపాలుః సమ్ముఖంబునకుఁ బొమ్మనిన నతండును నదిగొనిచని. 190

ఆ. దానధర్మములకు ధనమెల్ల వెచ్చించి
పేదవడితినని, కుబేరదత్తుఁ
డాదినాకు నిత్తునన్న, తనూభవ
నీయుననిన, రోసి యిల్లువెళ్ళి. 191

తోటకము :
అడవికి నేగి రయంబునఁ దనువున్
విడువఁగఁ జూచిన విశ్వేశ్వరుఁ డ
య్యెడమత్కరశర మంటఁగఁ బట్టెన్
బడగగుచర్మపు భత్రికనిచ్చెః. 192

క. ప్రతిపై, యిదిపూజింపుము
ప్రతిదివసములకు లెక్కబంగరులిచ్చున్
జతురతఁగొని చనుమనియా
సితికంఠుండనుప నిచటుచేరితి నృపతీ. 193

వ. ఈచర్మభత్రికవలన, నిష్టార్థంబులు గురియు రత్నంబునుగాంచితి ననిన విని నీకొట్టనేయుండనిమ్మని యాయుదారునింట చర్మభత్రి రత్నంబులున్నవని యుపహరించిన వారిదండింతు మనిపురంబునఁ జాటించి యింటికనిపిన, నపహారపర్వం గూడి సుఖంబుండె నంత. 194

క. ఆరత్నచర్మభస్త్రుల
కారణమున నాకు ధనముగలిగెననుచు, న
య్యూరఁగలయిండ్లు ద్రవ్వియు
దారుని నపహారవర్మ ధనికునిఁ జేసెఁ. 195

ఆ. అంతఁదనకు మిత్రుఁడైన విమర్దు సా
ధకునిఁ జేసి యర్థదత్తుఁగొలువఁ
బెట్టి వాఁడు వానికట్టడ దినమునుఁ
దనకు వచ్చిచెప్ప, వినుచునుండె. 196

సీ. పురిలోనఁ గామమంజిరి యనుకన్నియ
సయిదోడురాగమంజరి యనంగ
నంగనామణి నాట్యమాడఁగ నేఁజూడఁ
బోయి, మోహింపఁగఁబొలఁతి నన్నుఁ
జూచి కామించిన, సుందరిమఱియన్యుఁ
బిలువక నామీఁది ప్రేమఁబొరల
నవ్వారకామిని యన్నలు తమ్ములుఁ
దల్లియు నృపతికిఁ దద్విధంబు

తే. సెప్పుటయు భూమి నాయకుఁ డప్పురమున
పల్లవుండెవ్వఁడీ వేశవనితఁ గోరలు
వానిదండింతునని వాడ వాడలందుఁ
గంచుఘంట సెలంగఁజాటించుటయును. 197

ఆ. అంతనర్థపతికి నాపుగాఁజేసిన
హాళాంతగాని కొక్క యుపమ చెప్పి
హట్టమునను దారుఁడనుమని, పంపిన,
ననితోఁ, బురజనంబు వినఁగ నతఁడు, 198

సీ. శంకరుఁడిచ్చిన చర్మభస్త్రికపైఁడిఁ
గురియంగధనినంచుఁ గ్రొవ్వియోరి!
మాలికకును మాఱుమలసెదవటు చూడు
మనిన నుదారుండు సాక్షిపెట్టి
వచ్చినాకెఱిఁగింప వాఁడెఱుంగకయుండ
నడురేయి యిల్లు కన్నంబువెట్టి
చర్మభస్త్రికరత్న సహితంబుగాఁ గొని
చనియేను రాగమంజరికినిచ్చి

తే. బొంది వచ్చితినంతట ప్రొద్దువోను
దారకుని లేపిదొంగలు ద్రవ్వి రత్న
చర్మభస్త్రులు గైకొని చనిరటంచు
కూయువెట్టించి, యూపౌరుగులకుఁజెప్పి. 199

వ. అయ్యుదారుండును రాజసముఖంబునకుఁజని యర్థదత్తుండు మదీ
యరత్న చర్మభస్త్రికలు దివియించెనని విన్నవించిన, నతనిఁబట్టి
తెప్పించిన నేఁదీయించుటలేదనిన, నుదారుండిట్లనియె. 200

తే. గతదినంబునఁదన కూర్చు హితుఁడునన్నుఁ
బౌరజనములు సాక్షిగాఁ బ్రల్లదంబు
లాడిబ్రతుకుదుగాకని యరిగి వాఁడు
నురగె రమ్మని పిలిపించునరవరేణ్య! 201

ఆ. అనినఁ బిలువఁబంపెనా యొంతగాడునుఁ
దనకుఁ గఱపినట్ల తలఁగిపోయె
వానిఁదెమ్మటంచు వసుధేశ్వరుఁడు నర్థ
పతినిఁబట్టి కొట్టి బందిఁబెట్ట. 202

వ. అంత,

క. తిత్తియురత్నముఁగానక
సత్తుగఁదనకొసఁగుననుచు జలజాసన సం
పత్తి దినవ్యయముసేయుచు
హత్తిననుంగలయుచుండు నంతట యేనుకా. 104

వ. ఈతిత్తికథ బయలుపడకుండంగొనువాఁడన్నై యుదారునికిం దిత్తి
యున్న నెలవెఱింగించి రాజున కెఱింగింపు మనిపంపిన. 205

సీ. రాజైనసింహవర్మక్షమాధిపుఁగాంచి
కంటినాసొమ్ము కీఁగడ, నృపాల!
రాగమంజరియింట రత్నంబుఁ దిత్తియు
నున్నవి పిలిపింపుఁడువిదననుడు
నటమున్న యేను దదంగనయింటను
నున్నవాఁడను గాన నన్నతోడ
నజినరత్నంబు ఛత్రి ? యు మీగృహమ్మున
వసియించునని సింహవర్మయెఱిఁగి

తే. యడుగమిముఁ బిలువఁ బంపిన నర్థదత్తు,
వారుమారాగమంజరివంక వత్తు
రెవ్వఁడిచ్చెనొ యనుచు భూమీశునొద్ద
ననకయుండిన నపరాధులగుదు రిరు. 206

క. అనియేనుదలఁగుటయు న
మ్మను జేశుని భటులు రాగమంజిరిఁ గొంచున్
జనుటయు నరపతి యడిగిన
వనితయు, నేఁజెప్పినట్టి వచనమెపలుకకా. 207

వ. ఆ, తిత్తియు రత్నంబును దెప్పించి యుదారునకిచ్చి యర్థపతిం దల
దెగవ్రేయుమని పంపిన నుదారుండు సింహవర్మ పాదంబులం

బడి వైశ్యుండు వధ కర్హుండుగాఁడని, పురంబు వెడలఁ గొట్టించి
ప్రాణంబు రక్షించిన నయ్యర్థదత్తుండు సంతోషించి తనకూఁతు,
నతనికిచ్చి సుఖంబుండె. 208

ఉ. అంతట రాజమంజరిగృహంబున సీధురసంబుఁ గ్రోలియే
కాంతమయపుర్రంబు చిఱుఁగ్రంతలనేగఁ దలారిమానుసుల్
చెంతల డాసి పట్టుకొని చేతులఁగట్టిన నన్ను నేను నా
ప్రాంతమునందు వెళ్ళఁ గెళవారసిదూతికగాంచి యాఁదటల్. 207

వ. దాని రాగమంజరి దూతిక సృగాలికగా నెఱింగి డగ్గరంబిల్చి
యిట్లంటి. 210

ఆ. ఆత్మమిత్రుఁడగు నుదారుని సొమ్మును
రాగమంజరింట రవణములును
మఱియు నూరగలుగు తెరవల సొమ్ములు
దాహరించినట్టితస్కరుఁడను. 211

ఆ. ఇచటఁగట్టు వడితినిఁక వీరికెఱిగింప,
నెపుడుజావుదప్ప దిందువలన!
మిమ్ము జెఱుపనెల్లి మీసొమ్ము మీకిత్తు
ననుచుఁగొన్ని కఱపియను పుటయును. 212

క. దూతికతోనేమనునో
యీతండని పొంచియుండి యెఱిఁగి తలారుల్
భూతలపతియను మతమున
రాతిరియే బందినిడిరి రాజవరేణ్యా. 213

సీ. అపరదినంబున నాసృగాలికచ్చి
తిట్టుచు మాసొమ్ము తెరవుచెప్పు
మిచటదాచితినన్న నిందురమ్మని చేరఁ
బిలిచితన్మిషమున లలనకంటి,

సంభాలికనియెడు నధిపు పుత్రిక మీఁదఁ
గాంతకుఁడను బందికర్తగులు
నటువంటి శృంగార నటనలు గల్పించి
యబ్బాల యెఱుఁగనియట్లు జరుపు

ఆ. కాంతకునకు మదన సంతాపముదయింప
గంధపుష్పవీటికలు ఘటించి
కాంతుఁడని పెనసుచుఁ గైకొని తగిలింపు
వనితయని పెనసుచు వానిమ్మ(?) 214

వ. అనినకఱపిన నదియు నట్లచేయుచు సంబాలికకు నర్మసఖియై
వర్తింపుచుండె నంతనొక్కనాఁడు 215

క. ఆరాజవదన సౌధపుఁ
జేరువ పారువము దిరుగఁ జెంగలువనున
ప్పారువమువైవఁ గాంతకు
పైరాలిన, దూతయదియ ప్రకటముచేయున్. 216

గీ. కాంతతమ్మయనుచుఁ గాంతకునకునిచ్చు
వానితమ్మ పారవైచివచ్చు
పుష్పగంధములును బొలుతుకముడిపూఁత
లనుచు నిచ్చువానివైన నణఁచు 217

వ. అంతనొక్కనాఁ డద్దూతికంజూచి కాంతకుం డిట్లనియె. 218

గీ. ఇట్టిబాలనాకు నేగతిఁ బ్రాపింప
ననువుసెప్పు మనిననని యెదూతి
సంకెలందునున్న చౌర్య విధిజ్ఞుండు
కన్నపెట్టఁగలఁడు కన్నెకడకు. 219

వ. ఆకన్నంబునంజని నీవా కన్నియం బొందుమనిన నట్లకాకయని
కారాగృహంబునకేతెంచి యచ్చటి కావలివారలంజూచి యిట్ల
నియె. 220

క. ధనమడుగు నేనృపాలుఁడు
చనుడితరవు వారనుచు సరహాస్యముగా
జనుల వెడలించి రాతిరి
ననుసంకెల లూడ్చుటయు ఖననమిడి నంతన్. 221

ఉ. కన్నము త్రోవనేగ సమకట్టిననుంగ్గని నిండుప్రాణియై
యున్నను మోసమంచు నన్నను క్షణంగింప నీదలంపనేనుం నా
సన్నయెఱింగి కొంతకుని జంపి కరాంగుళిముద్ర గొంచునా
కన్నము వెంట నేగి పొడగాంచితి నిద్దురపోవు కన్నియన్. 222

వ. రాగమంజరి గృహంబు ప్రవేశించి విగళితశృంఖలుండనై సృగాలి
కాసాధకుండనై యస్మత్కృతంబైన కన్నంబునంజని రాచకన్నెను
రాత్రియెల్ల ననుభవింపుచుండనంత నొక్కనాఁడు. 223

సీ. ఆముద్రయంగనహస్తశాఖఁ దగిల్చి
యంగనయంగుళీయకము గొనుచు
తనరూపు మక్కడ్యతలమున లిఖయించి
తాంబూలకల్క మాస్థలినిడైచి
ధరణికినేతెంచి తనమీఁది వరకాని
నాప్తుగాఁజేసి నెయ్యంబుగదుర
నీకేనుమేలు సన్నిహితంబుఁ జేసెద
నాచెప్పినటువలె నడువుమనుచు
వాఁడైన నీదుశత్రుండు చనిపోయె
విప్రుఁడనుచు రాజుకెఱుఁగఁజెప్పు
మనియు నతఁడు గలపనగు గాకయుని చండ
ఘాతకుండు చనియెఁ బ్రీతితోడ. 224

వ. అంతనపహారవర్మయు సృగాలికతోడ రాగమంజరి గృహమ్మున
కరుగునప్పుడు. 225

చ. తలవరులేగుదేరఁ గని దగ్గఱ వచ్చుసృగాలిఁ జూచియో
నలఁతుక! వెఱ్ఱివాని గతి నేఁదిరుగాడెద వారుచూచినన్,
బలుకుముపీఁడు మద్విభుఁడు పట్టుడుకట్టుడటంచు వారినేఁ,
గలఁచెదఁ బట్టనీక వెడకారులు బల్కుచుఁ గొట్టబోవుచున్. 226

క. అనిచెప్పి యాతలారులు
తనుఁజేరఁగవచ్చునట్టితరి భ్రాంతుని లా
గునఁ గఱవఁదిట్టగొట్టన్
జనుటయునెడ గలసి వారు చనుటయు నేనున్ 227

వ. రాజమంజరిగృహమ్ముఁ బ్రవేశించి విగళితశృంఖలుండనై సృగాలికా
సాధకుండనై యస్మత్కృతంబైన కన్నమ్మునఁ జని రాత్రులెల్ల
రాజకన్య ననుభవింపుచుండ నంత నొక్కనాఁడు. 228

చండవర్మయపుడ చండ సింహునిఁబట్టి
కూఁతుఁ బెండ్లియాడఁ గోరుటెఱిఁగి
జలజముఖని విడువఁజాలక యచ్చండ
వర్మఁజంపి నిన్నువచ్చి కంటి. 229

వ. అనిన సంతసిల్లి రాజవాహనుండుపహారవర్మంజూచి నన్నుఁబాసి
నీవెచటనుండితివనిన నిట్లనియె. 230

గీ. ఏ విదేహనగరికేగి తపస్వినీ
మఠముచేరియుండ మానికాంత
నన్నునాదరించి ననుఁ జూచి వగచిన
నేలవగచితనిన నింతి పలికె. 231

సీ. ఆరాజుహంసుఁడ క్షాతిశేనొచ్చిన
తరిజ్ఞాతినికటుఁడు దర్పవృత్తి
రాజసన్మంత్రిఁ గారాగృహంబునఁబెట్టి
యభిషిక్తుఁడై రాజ్యమనుభవింప,
మత్పుత్రియును నేను మహిపతిపుత్రుల
దాదులమైన కతంబునందు
నేడ్పదనాకూఁతు రీవికటేశ్వరు
సతికల్పసుందరి సకియగాన

గీ. యనుదినంబును వచ్చునన్న రసిపోవ
ననఁగ, నేతెంచెనదియును నంతలోన
వచ్చి యంతఃపురంబుల వార్తలెల్లఁ
జెప్పుచోఁజెప్పె నొకసుద్ది చిగురుబోణి. 232

చ. కొనఁటి మగండు తానగుటకుం దగ, నంగవికారి మూర్ఖు నె
మ్మనము గరంపలేని యసమర్థుఁడు వీఁడు విభుండుగాఁగ, నే
మన నీఁకనొల్ల, సత్యమను మానముద్దక్కి సుర్యాపవంతు నొ
క్కనిననుఁగూర్పు వేగమని కామిని నాకెఱిఁగించె నంబికా. 233

గీ. ఇతఁడు సుకుమారమూర్తి వీఁడెవ్వఁడొక్క
వీఁడువచ్చినఁ గొనిపోయి వెలఁదిగూర్తు
ననుచు నాయమ్మ యనుప నయ్యతివ నన్ను
దోడుకొనపోయి యక్కాంతతోడఁ గూర్చె. 234

క. ఆవేళ కల్పసుందరి
భావజహాతినన్నుఁబట్టి పైఁబడుటయు నో
హో వలవదేను జెప్పిన
యావిధ మిలావాచరించి యుంటుము వన్నున్. 235

వ. అవ్విధంబెట్టిదనిన నీవిభుతో ననుకూలవై నీ కురూపత్వంబు మానునట్లుగా హోమంబుచేసి యాదేశంబు నీవిచారం బగ్నిదేవునకు విన్నవించిన సురూపవంతుండ వగుదువని యొకతపస్వి నాకుం జెప్పె నేకాంతంబున నియ్యంతఃపురిం జేరు మనుమనినఁ గల్పసుందరి యియ్యకొని విభునకట్ల యెఱింగించుటయును. 236

క. సుకుమారత్వము గలుగును
వికటాకృతి మాన హోమవిధి సేయింతున్
సకలము నెఱుఁగఁగ నని, జన
నికరము వినఁ జాటఁ బంచి నృపవరుఁ డంతన్. 237

సీ. విప్రవర్గము హోమవిధి సేయనంతి పు
రంబునఁ గేళిగేహంబునందు
పగలెల్ల నాహుతుల్ పావకుపై వ్రేల్వ
గను గాన రానిచోటను వసించి
పూర్ణాహుతికి రాత్రిప్రొద్దు వోయిన విప్ర
వర్గంబు పరిజనవరుల ననిపి
దేవియుఁ దానగ్ని దేవుని డగ్గఱి
సచివులతోడి విచారకథలు

నాత్రపహారవర్మ నణఁగించు తెఱఁగును
కావుచేరి మానికంబుగొనెడు
వెరవు సెట్టిఁబట్టి విత్తంబుగైకోను
తలఁపునగ్ని వినఁగఁ బలుకునపుడు. 238

క. కరవాలు వట్టుకొని నే
ధరణీపుకంఠంబు దునిమి తనువును శిరమున్
స్ఫురితాగ్ని కుండమున స
త్వరముగఁ బూర్ణాహుతిగను వైచితి నృపతీ. 239

వ. అవ్విధం బాచరించి హోమకుండంబుగప్పి కల్పసుందరికి భయంబు దీర్చి సంభోగించి తద్విభుని యాభరణంబులెల్లఁ దాల్చి యుద్దేవికై దండయాయ నంతఃపురంబుఁ బ్రవేశించి సురూపవంతుండనై తినని, వనితాజనంబుల కెఱింగించునంత ప్రభాతంబగుటయు. 240

చ. జనపతి హోమమార్గమునఁ జక్కనిరూపముదాల్చె నంచు భూ
జనములు (మంత్రులున్ హితులు) సజ్జనవర్గమువచ్చి కాంచుచో
మనుజవరుండు ప్రాప్తులగు మంత్రులఁ జేరఁగఁబిల్చి దండుగన్
గొనకుఁడు సెట్టికాఁపులనుఁగోరి ప్రహారునిబంది మాన్పుఁడీ. 241

క. అనుటయు వికటుండీతం
డనుమానము లేదు నిన్ననాడినమాటల్
వినిపించె నంచు ముదమున
ననుఁగొల్చిరి మంత్రివరులు నానాజనముల్. 242

వ. ఏనును మజ్జనకుండైన ప్రపహారవర్మం బట్టంబుగట్టి యువరాజునై రాజ్యంబనుభవించుచుండి సఖుండైన చండసింహునికి సహాయుండనై చండవర్మంజంపి నిన్నుఁ బొడగంటిననిన సంతోషించి యర్థపాలునింజూచి యిట్లనియె. 243

క. ననుఁబాసి యెందుఁబోయితి
వనియడిగినఁ గాశికరిగి యచ్చట వసియిం
చిన పురుషవీరు నొక్కనిఁ
గని యిచ్చటనుండె నేమిగారణమనినన్. 244

గీ. నామ (మునఁ బూర్ణచంద్రుఁడనంగ[1])నుర్విఁ
బరగువాఁడను నేఁ గామపాలుకడను
నర్మ భృత్యుండనై యొక్కనాఁడు స్వామి
నడిగితిని యెవ్వరవు చెప్పుమనిన నతఁడు. 245

1. "నామధేయమి పూర్ణచంద్రుండనంగ" మూలము.

గీ. ఏనురాజహంసు హితమంత్రి యగుధర్మ
పాలుసుతుఁడఁ, గామపాలనామ,
మిలఁబరిగ్రహించి యీవారణాశికి
నరుగుదెంచి యిచట సధిపుతనయ. 246

వ. కామించి దూతిముఖంబునఁ దదీయవృత్తం బెఱింగి చోరమార్గం
బున నక్కన్యం బొందుచుండునని చెప్పెనంత. 247

త. నిర్భరముగాఁగఁ గన్యక
గర్భము ధరియించి బిడ్డఁగనుటయు నేనా
యర్భకుని వతలవేయఁగ
నర్భకు నొకయక్షవనిత యందుక పోయెన్. 248

గీ. పోయియక్షకన్య పుత్రునిగాఁ బెంచి
చండవర్మమనుమ సంతతైన
ఘోషమంత్రిజేసి ? కొలువంగఁ బెట్టినఁ
గొలిచె మద్విభుండు కలితబుద్ధి. 249

క. ఆకామపాలుఁ డిటువలె
భూకాంతునిఁగొలువ నొక్క భూతదినమునన్
భీకరకోపోద్ధతిను
శ్లోకుండాకామపాలులోచన యుగమున్. 250

వ. ఛేదింపుండని పంపిన శత్రుపాణులు దగ్గఱు వంతలోనఁ గాంతి
మతి పుత్రుం డక్కామపాలుని తనయుండు గావున నొక్కనా
గంబు గొనివచ్చి కామపాలు దగ్గఱవిడిచి కఱచెనని విమతుండొక్క
మంత్రించి యప్పుడు. 251

గీ. రాజపుణ్యుఁడగుట ప్రాశానకలుఁగక
కండ్లువుచ్చుమనియోఁగాకవీని
దైవమేలకాచుధరణిప ద్రోహిని
సర్పమగుచుఁ గఱచి చంపుగాక. 252

క. అనికామపాలు పత్నికి
ననుగమనముసేయ ముదలయడిగాత్మనికే?
తనమునకుఁ గొంచుజనియ
ద్దినపతి గ్రుంకుటయు రాత్రిఁ దెగరాదనుచుఁ. 253

సీ. ఆరాత్రి పూర్ణచంద్రుఁడాఖ్యుఁడు నేనును
కుఖననంబొనరించి ఘోషుకడకుఁ
జని భూమిపతిధరా సదనంబు నందిడి
కామపాలుని రాజుగాఘటించి
యువరాజనై యేను నుర్వీతలంబేలి
యాసింహవర్మసహాయుఁడగుచు
చండవర్మనిమీఁద జనుదెంచి యిచ్చోట
నినుగన వచ్చితి మనుజనాథ

యనిన సంతసించి యారాజవాహనుం
డెదురనున్న ప్రమతి నీక్షణంబు
చేసి నీవునన్ను బాసెటు? వోయితి
చెప్పుమనినవాఁడు చెప్ప దొడంగెఁ. 254

క. నేనట వింధ్యాచలభయ
కానకమునకరిగి విప్రుఁగాంచి తదీయ
ప్రాణహిత మాచరించిన
నానిర్మలగుణుఁడు నాకు ననుకూలుండై. 255

గీ. అఱుగుదేరహస్తి యను పురంబునకేగి
యాఁడరూపుచేసి యవనిసురుఁడు
తనయయనుచు నన్ను ధరణిపుకడఁబెట్టి
యవనిపతికి విప్రుఁడప్పగించి. 256

గీ. ఎవ్వరును లేరునాకు నియ్యిందువదన
నొందియొకచోట నిలుపఁగులోచితంబు
కాదుగావున దీని నీకడనుబెట్టి
పోయి యరసెద దీనికిఁ బురుషునొకని. 257

వ. నేఁదిరిగి వచ్చునంతకు దీనిబోషింపుఁడనుచు నప్పగించిచనిన
నభ్భూపాలుండును నన్ను నంతఃపురంబున కనిచి దేవికి సమర్పిం
చుటయును. 258

క. దేవియుఁ దనయాత్మజకు మ
హీవాసవతనయఁ బ్రోవనిచ్చిన నేనా
భూవిభుని తనయనొయ్యన
భావజకేళికిని మఱపి పతివలె నుంటిన్. 259

సీ. అంతట సుతకు స్వయంవరోత్సవము భూ
వరుఁడు సేయఁగఁబూని వసుధఁగలుగు
రాజనందనులను రప్పింప, నేరాజ
సుతపంపునను, నలంకృతి ధరించి
జనపాలపుత్రుల సంగతిఁ గూర్చున్నఁ
బడఁతి మధూకపుష్పముల దండ
నామెడఁ దగిలించిననుఁ జెట్టవట్టిన
నధిపుసమ్మతిఁ బెండ్లియాడి నేను

నృపతి తనరాజ్యమిచ్చి నన్నుపచరింప
వసుధయేలుచు నీసింహావర్మనకును
దగునహాయతకే తెంచి ధరణినాథ
నిన్నుఁబొడగంటి ననినను నృపవరుండు. 260

వ. దైవబలంబునకును సంతసించినవాఁడై, మంత్రగుప్తునిం జూచి
నన్నుఁబాసి నీవెచ్చట నేమిచేసితనిన నతండిట్లనియె. 261

గీ. దామలిప్త (ముగలపురిఁ) పురంబునఁ[1]
బువ్వుఁదోట కేనుబోయి యచట
కందుకోత్సవమునఁగడు నొప్పునృపపుత్రి
కందుకావతనెడు కన్నెఁగంటి. 262

క. అక్కన్యక యవ్వనినే
నక్కాంతనుదూతిఁజేసి యనిపిననదిదా
నక్కన్య యగ్రజాతున
కక్కథ యెఱిఁగింప నన్నునంబుధి వైచెన్ 263

తరల :
కలమువట్టుక యేనుదైవముకతనఁ బ్రాణముగల్గియ
క్కలముచేరి హితుండనై రిపు గర్వముల్ విదళించి య
క్కలననెప్పటి వార్ధిలోఁబడి గట్టుచేరి తటాంతర
స్థలము కాననవీధి కాతుసతన్విఁజూచి భయంపడన్. 264

వ. అద్దానవి యిట్లనియె. 265

క. ఈలాగున నేటికినీ
వేలావనవీధి దిగుగవిప్రుఁడ! యనినఁ
నాళీక వదనపైనా
మేలూలినకతన ననిన, మెలఁతుక పలికెన్. 662

---

1. "దామలిప్తమనెడు నామము గలపురిఁ" అనుటయుచితము.

క. కామినులు పాపములకుఁ
సీమలు తత్ప్రియమునమ్మి చేరెనయేనిన్
గామితములుడిగి యాపద
లామనుజుని కొటనిక్క మది యెట్లనినన్. 267

సీ. పుడమినింద్రికతాఖ్య పురమున విప్రులు
గలరుముప్వురు వారు కరవునందు
నాఁకటి కోర్వక యాంధ్రను భక్షింపఁ
గడఁగొట్టువాఁడాత్మ కాంతఁదినక
యాభూమినుండక యన్యభూమికినేగ
దనకాళ్లుచేతులుఁ దినియె నొకఁడు
నామొండి మోచుకయఁ యాతఁడు బోషించు
పరిసరంబైన కూపంబునఁగదు
నంబువర్ధిఁ ద్రావనధిపతి నందులో
మునుఁగద్రోచి మొండి మోచుకొనుచు
గోప్యమయిన పాదుగుడిచేరి యామొండిఁ
బొందగోరుటయును బొందకతఁడు. 268

క. పాపముగట్టకు తల్లివి
రూపడఁతుక! యనెదునంత నొక్కఁడుదివియఁ
గూపంబువెడలి విప్రుం
డావురికిని రాఁగజరభియవ సీపతికిన్. 269

గీ. మొట్టవెట్టిపతిని మొండిగాఁజేసిన
పాపివీఁడె యనుచు భర్తఁజూప
విప్రునట్లుకుఁడనిన వెలఁదుకపతి మొండి
నడిగినట్లుకుఁడనిన నడిగివారు. 270

వ. అమ్మొండి వానిచేత నావృత్తాంతం బెఱిఁగి రాజానుమతంబున
నాజంత కర్ణ నాసికాచ్ఛేదనంబుచేసి వెళ్ళగొట్టిరని మఱియును. 271

సీ. రమణీయమగు మధురాపురంబునఁ గాల
కంటకుండనువాఁడు కాంతయందుఁ
బాయ(నిరతి) చిత్రపటమున రూపంబు
వ్రాయించిచూచునే వంకలందు
నంతట నొకసిద్ధుఁడన్య దేశీయుండు
చిత్రిత కామిని చెలువుఁజూచి
వ్యభిచారియిది పిన్నవయసు నాఁడిప్పుడు
గరితయైయున్న దెక్కడికిఁ జనక

యనినన క్కాంత చెలివోయియంగనకును
జెప్పెసంతతి శోకమందు సిద్ధుఁడెఱుఁగు
కాంత! పాదంబుచూచి యెకనఁగనేర్చు
ననినఁ దోఁకొనిరమ్మన్న నతనిఁ గొనుచు. 272

వ. లోనికిఁ జనితెర యవ్వలంగామిని నునిచి పాదంబుచూఁపు మనిన
నది యట్లచేసిన 273

గీ. చేతిచిఱుగత్తి నూరువు చించికాలి
యందేఁగొనిపోయి యక్కాంత యధిపుతోడ
బోయినటువంటి నిశిప్రేతభూమి చొచ్చి
శవములను దించునాస్థితస్థలికిఁ జేరఁ 274

వ. అదలించి శూలంబునం బొడిచి కాలియందియవుచ్చి కొంటిని
యిదెయందియ తదూరుదేశంబు ఘాతయుం జూడుఁడనిన నక్కా-
లకంటకుండదివీక్షించి దానినడరికిం గొనిచని గళంబునఁ
బాశంబు దగిలించి పోవుటయును. 275

గీ. సిద్ధుఁ డచ్చ[illegible] రజ్జువుద్రెంచి
కాంతతో ద[illegible]సించెఁ
గానకపటులెలుఁ గపటంబులోడన
బొందుసేయకున్నఁ బొందరాదు. 276

వ. అనిచెప్పిన కందుకావతింబొందు మాయోపదేశంబుచేసి రాక్షసి
చనియె నేనును నక్కందుకావతిని భోగించి దానితండ్రిం జంపి
యతని రాజ్యమున నభిషిక్తుండనై సింహవర్మకుఁ దోడువచ్చి
నిన్నుఁ బొడగంటి ననియెనంత. 277

సీ. మాతృగుప్తుండను మంత్రిపుత్రునిఁజూచి
యెచటికిఁ బోయినీవేమి చేసి
తనిన నేనొక పురియర్ధరాత్రంబొక
సిద్ధుండు హోమంబుసేయ నాతఁ
డెఱుఁగనిచో డాఁగియేనుండి మఱివాఁడు
దైత్యుఁబుట్టించి కర్దమునివనితఁ
దెమ్మన్ననటవోయి తెచ్చునంతకుఁద్రోవ
కడ్డంబు చనియేను నబ్జముఖిని

నచ్చట నెపెట్టి నిన్నురమ్మనియె సిద్ధు
డనిననదియట్ల చేయనయ్యతివ విభుఁడు
గదియవచ్చినఁ బఱచి రాక్షసుఁడె యనుచుఁ
బమ్మరింపుచు నేమేనిఁ బలుకుచుండ. 278

వ. ఆభూపాలుం డాత్మకాంతకు భూతప్రవేశంబైనదని రక్షావిభూతు
లరయుచో నేనొక యతినై రక్షోఘ్న మంత్రంబుపదేశించెదనని
రాజునకు విన్నపంబుసేయించి యూరివెలుపలి పద్మాకరంబున
మధ్యరాత్రి స్నానంబుసేయ వినియోగించి యప్పుడభ్భూపాలునిం
జూచి యిట్లంటిని. 279

క. నీమంత్రుల కెఱింగించి మ
హామంత్రముఁగొనుము దీననంగము నాత్మ
శ్రీమహిమ నొందు నని య
భ్భూమిపునకుఁ జెప్పిపనుపఁ బోయానరసిజ. 280

గీ. నీరుచొరని పెద్దనీరాటిలోఁజొచ్చి
యబ్జమండ వీధినడఁగి యుండి
నీటఁగ్రుంకు వెట్టునృపుకంధరముఁ ద్రెంచి
కడువలోనఁబెట్టి కదలియేను. 281

క. ఆరాజుపత్నిఁ బొంది య
వారణ రాజగుచు సింహవర్మకుఁ దోడై
యోరాజహంస నందన!
నీరూపముగంటి ననుచునృపు నలరించెన్. 282

వ. రాజవాహనుండు విశ్రుతుండను వానింజూచి నీవెందువోయితనిన నతండిట్లనియె. 283

క. చూపట్టెడు వింధ్యాటవిఁ
గూపము దరినేప్పు బాలకునిఁగనియేలా!
వాపోయెదనిన మత్పిత
కూపంబునబడిన నిట్లుఁగ్రోల్చెద ననినన్. 284

గీ. అధరామరేంద్రు నంధువు వెడలించి
ప్రహిఁబడంగనేల ప్రాప్తమయ్యె
ననిన విప్రుఁడనియెనన్నసే నొకరాజు
సచివవరుఁడ నాదుచరితవినుము. 285

వ. వసంతభానుండనురాజు అనంతవర్మయను రాజుంగెల్వ నిశ్చయించు సమయంబున వసంతభానుననుంగు మంత్రి చంద్రపాలుండు కపటోపాయంబునఁ దండ్రితో నలిఁగివచ్చినవాఁడై యనంతవర్మ ప్రధానుండైన విహారభద్రుండు కార్యసహాయుండు గాననంత వర్మంగొలిచి యుండినంత. 286

వ. పఱిలు వసంత వర్మనృపు వశ్యునిఁగా నొనరించి దుష్టతల్
గఱపి ప్రజావిరుద్ధగతుఁగా నడిపింపుచుఁ జంద్రపాలుఁడ
త్తెఱఁగు వసంతభానునకుఁ దెల్లముగా నెఱిఁగించి పంపె నీ
వఱిమిఱి దండురమ్ము వసుధాధిపునీకని నొప్పగించెదన్. 287

గీ. అన వసంతభానుఁ డాజికి నరుదేరఁ
దానసంత వర్మదండునకును
మొనకు ముందరకును నని సేయనొల్లక
చన వసంతవర్మఁ జంపిరపుడు. 288

వ. ఇవ్విధంబున నంతవర్మం జంపి వసంతభానుండు రాజ్యంబు గైకొని
పాలింపుచున్న చంద్రపాలుండప్పుడు. 289

ఉ. ఆజిననంతవర్మ తెగటాఱిన నీపరివారమెల్లన
వ్వాజుల దంతులన్ యువతివర్గము రత్నవిభూషణంబులన్
రాజసమొప్పఁ గొల్లగొనిరారు భజింపగ నంచునమ్మహీ
రాజున కింపుగానొడివి రాష్ట్రవిభేదము చేసియుంతటన్ 290

క. పరివారము వాఁడై తా
ధరణీశుని వెళ్ళఁగొట్టి తారాజై నన్
బురమేలు తొంటినరపతి
సరసిజముఖసుతునిఁగొంచుఁ జననొక పురికిన్. 291

గీ. ఇట్లుమాహిష్మతి పురికేఁగియుందు
మంత్రి వసురక్షితుండున్న మందిరమున
కరుగుటయువాఁడు విధవనయ్యతివఁ బొందఁ
గోరుటయు సమ్మతంబునఁ జేరకున్న. 292

వ. తత్పుత్త్రు వధియింపందలంచిన నయ్యనంత వర్మదేవి తనపుత్త్రుం డైన వీని నాకప్పగించి రక్షింపుమనిన వీనింగొని వచ్చియీనూతి కడ జలపానార్థంబు డిగ్గి యీనూతంబడి నీచేత నుద్ధరింపంబడితి నని యిట్లనియె. 293

క. నీవామాహిష్మతి పురి
కీవేళ నె యరిగి జననికెఱింగింపు మహీ
దేవుని కడనున్నాఁడని
యావలికథ యొకరహస్య మదియెఱిగింతున్. 294

సీ. మారణమంత్ర సమర్మకంబగునొక్క-
పువ్వుల దండయప్పోలఁతి కిమ్మ
తన్నెవ్వఁడాశించెఁ దద్భూమి పాలుని
గళమున వైచినఁ బొలియు నతఁడు
వెలఁదుక తనపుత్త్రు వింధ్యవాసినిసింహ
మైదాఁచినది తెచ్చునాత్మ(భువికి)
ననిపంపనేనేగి యాపుష్పమాలిక
యిచ్చినందనుకథ యెఱుగఁజెప్పు

నంతవసురక్షితుఁడు (కాంత) ననుభవింప
నరుగఁదేరఁ బతివ్రత నైతినేని
వీఁడుమృతిఁ బొందునని దండ్రవేయఁటయును
బ్రాలె నిర్జీవియై వసురక్షితుండు. 295

వఁ అద్దివసంబుననే నాడీజంఘుండను విప్రుండు కుమారునిం గొని తెచ్చె పరివారంబును నద్దేవి మహాపతివ్రతయని సంతోషించిరి. నేనును నారాజపత్ని మేనత్తయగుట తదీయ పుత్త్రునిం బట్టంబు గట్టి రాజ్యంబు సేయుచుండునంత. 296

గీ. ఆ వసంతభానుఁడా మిత్రవర్మని
పురి యరాజకమునఁ బొందె ననుచు
నార్తివచ్చుటయును నే వాని వధియించి
బాలకుని నె పట్టబద్ధుఁ జేసి 297

వ. మాహిష్మతీ విదర్భాపురంబు లేలింపుచు సింహవర్మకు సహాయుం
డనై వచ్చి యిటమిమ్ముఁ బొడగంటిననిన సంతోషించి యాత్మీ
యంబైన కుమారదశకంబునుఁ గూర్చుకొని తదీయ రాజ్యసహి
తంబుగ రాజవాహనుండు స్వకీయంబైన కుసుమవతీ పురంబేలు
చుండె. 298

క. అనినారదుండు మఱియును
జననాయకకథలుగొన్ని జరపెడువాఁడై
వినుపింపఁ దొడఁగె నబ్బలి
దనుజేంద్రుఁడు ముదమునొంది తనుగనుఁగొనగన్. 299

ఉ. పుణ్యుఁడశోక దత్తుఁడను భూసురవర్యుఁడు గాంచెభీకరా
రణ్యము భీమరాక్షస శరణ్యమును ధృతశూల నేత్ర కా (?)
రుణ్యము గంధదంతి మదరోపిత సింహకరాళహుంకృతా
గణ్యము మాంస భుక్పటల కంఠగుహామిమరుద్ధ పుణ్యముఖ్. 300

గీ. కాంచి యందునొక్క కనకపంకేరుహ
సరసిదరిని రాక్ష (సపరివృతుని)
గదియ నరుగుటయును గనికాంత భామలఁ
బలికె విప్రురాకఁ దెలియనడిగి. 301

క. జడనిధి పాథఃపూరము
నడుమను నొకచిత్రకూట నామద్వీపం
బుడుపదము మోచియున్నది
తడయక చనుమచటి యక్షతనయలఁ జూడగ్. 302

సీ. అనిచెప్పి నిజరాక్ష సాకృతి నెడఁబాసి
యరిగె శాపవిముక్తుఁ డగుచునసుర
బ్రాహ్మణుండును తనభాగినేయుండగు
శక్తిదేవునకు నాజాడచెప్ప
ధరణీసురుండబ్ధి తటమునకును జని
తాళేశ్వరునకు పుత్రత్వమొంది
జలధిపై వేఁటకుఁ జనివానితోఁగూడ
ప్రవహణం బబ్ధిలో భగ్నమైన
విధివశంబున నొకవట వృక్షమబ్ధి
జలముపైఁ దోఁపనత్తరు శాఖవట్టి
వార్ధిమునుఁగకయుండ, నవ్వటముశాఖ
నున్నగృధ్రంబు వలికెనయ్యుర్వీసురుని. 303

జలధరవృత్తము.
వెఱవకయుండుము విప్రయటంచున్
గఱచుక యేఁగుచు ఖచరుండతన్ (?)
పఱచుచునొప్పదిఁపంబు నడించెన్[1]
గిఱికొనియందుల కిన్నర కాంతల్. 304

గీ. విప్రుఁ బొడగాంచి యచటికి వేఁ గవచ్చి
రంగు చంద్రప్రభయనెడి యతివయోర్తు
హస్తిమల్లోపమగు (?) మదహస్తినెక్కి
వచ్చెనింద్రాణియనుఁ బోలెనచ్చటికిని. 305

వ. అంత.

క. సాంద్రతరస్మిత నిర్జిత
చంద్రప్రభ కుచవిలిప్త చంద్రప్రభనా
చంద్రప్రభఁ గనుగొని ద్విజ
చంద్రుఁడు స్మరరాహుగిళిత చంద్రుండయ్యెన్. 306

1. పఱచుచు నాద్వీపమునడించెన్,

వ. అప్పుడు. 307

గీ. జగతిసురునిఁజూచి చంద్రప్రభయు మది
మన్మథాస్త్ర బాధ్యమాన యగుచు
పలుకులందు గమనభావంబు దెలిసి యి
ట్లనియెఁదనదు భావమాతఁ డడుగ 308

క. శశిఖంధుండు మజ్జనకుడు
శశివదనలు ముగురునాకు సహజాతలు త
చ్ఛశివదనల లోపలనను
శశిప్రభయటంద్రు ఖచర జాతులమగుటన్. 309

వ. అట్లుగావున మదీయగృహంబున కరుగుదెమ్మని తోఁకొనిచని
పూజితుంజేసి యవ్విప్రున కిట్లనియె. 310

గీ. శాపముక్తి మనుజసంగతి గల్గుమీ
కనుచు తొల్లిగిరిజ యానతిచ్చె
నట్లుగానమాకు నధిపతి వీవని
ధరణిసురుని గలసి తరుణిమణులు (?) 311

వ. అందుగర్భంబుదాల్చి చంద్రప్రభ యాశక్తి దేవునకిట్లనియె. 312

సీ. విప్రదత్తుండను విప్రుండు జాబాలి
శిష్యుఁడు తద్యోగ సిద్ధికొఱకు
విద్యాధరీగర్భ విదళనం బొనరించి
గురువులకిడి భుక్తిగొన్న వెనుక
తచ్ఛేషమించుక తాభక్షణముచేసి
బేతాళవాహుఁడై పృథ్విబాసి
రమణీయ విద్యాధరత్వంబు
ప్రాపించెగావున నీవునాగర్భదళన

గీ. మిప్పుడొసరింపుమనిన నయ్యిందువదన
భ్రూణహత్యకునే నెట్లుపోదుననిన
నతివనిజ ముష్టితనగర్భమలవరించి
శక్తిదేవునకీయ నాజగతిసురుఁడు 313

చ. కరకమలంబునాఁపనది ఖడ్గగతిఁ నిజముష్టి నొందినన్
ధరణిసురుండు విస్మతుముఁ దాల్పనభంబునవాణివల్కె భూ
సుర వరఖడ్గమందుకొనఁజొప్పడు ఖేచరసిద్ధినీకు నీ
పురమును యత్రరాజ్యమునుఁ బొల్తులు జేరుదురన్నవిప్రుఁడున్. 314

క. విద్యాధరుఁడై నలువురు
విధ్యాధర సతులు దనకు వెలఁదులు గాథ
వ్యద్యుమ్న నగరమేలుచుఁ
బ్రద్యుమ్న క్రీడ భోగభాగ్యుండగుచున్. 315

ప్రగుణవృత్తము :
నృపతిన్ వతా్స
ధిపునిన్ భూదే
వపతిన్ ప్రీతిన్
సపదున్ గాంచెన్. 316

వ. అంత 317

చ. హిమగిరి వజ్రనాథశిఖరేశుఁడు వజ్రశిఖాశరీరి వ
త్సమనుజ నాథుఁగాంచితడు దారకథల్ వినుతించిపల్కె నీ
కొమరుఁడు సర్వవిద్యలు నకుంఠితశక్తిఁబరిగ్రహించిశం
భుమహిత సత్యవాగ్గరిమ బొందువిద్యాధర చక్రవర్తిగన్. 318

క. ఆద్యుఁడు సూర్యప్రభుఁడను
విద్యాధరు మాడ్కి సర్వవిద్యలుగాంచున్
విద్యోత మూర్తిఁగొనిచను
నుద్యోగితవచ్చినాఁడ నుర్వీరమణా! 319

వ. ఆసూర్య ప్రభుచరిత్రంబు వినుపించెద వినుమని యిట్లనియె. 320

క. చంద్ర ప్రభుఁడను రిపునృప
(సాంద్రతమోవిధుఁడు) కీర్తి చంద్రికచేతన్
చంద్రవితానితసుదిశా
సాంద్రతలుండగుచు సర్వజగములు నేలెన్. 321

వ. అక్కాలంబున 322

గీ. మయుఁడు చంద్రప్రభుని సభామంటపమున
కరిగియుండంగ నావేళ నచ్చటికిని
నాకపురినుండి యేతెంచినాక మౌని
యింద్రునానతి నెఱిఁగింప నిచ్చగించి. 323

క. వచ్చిధరణీశవరుచే
నర్చితుఁడై మౌని పలికె నమరేంద్రుఁడు ని
న్నిచ్చట రుద్రాధ్వరమున
కుచ్చరితము చేసెఁజేయు ముచి తమయేనిన్. 324

చ. అనిమయుండు వల్కె సుగుణాకర రుద్ర మఖంబుఁ జేసి య
య్యనలల లాటుచేత విజయుంబు వరంబుగ నందనేల ము
న్ననిమిష యూథనాథుఁడు శతాధ్వరముల్ దగఁజేసికాదొకో!
దనుజులకోడి పారుట వృథామఘు సంహతులెన్న నేటికిన్. 325

క. అనిమయుఁడు పలుకు పలుకులు
వినినారదుఁడరిగె జంద్ర విభుఁడును దనవం
దను డగు సూర్యప్రభు న
ద్దనుజ స్రష్టకు బ్రియుంబు దలకొనినిచ్చెన్. 326

క. శుభముహూర్తంబున సూర్య
ప్రభునకు భూతాసనంబు బంధురహేమ
ప్రభఁగ విమానమ్మును నతి
విభవముగా నొసగికొనుచు వెడలెన్ బురమున్. 327

సీ. అట్లు సూర్యప్రభునతలంబునకుఁ గొని
యరిగి మయుండు ప్రహ్లాదముఖ్య
దైత్యాధిపతులనందనల కరగ్రహ
ణంబొనరించి యన్నాకపతికిఁ
బ్రతిగాఁగ విద్యాధరత్వ దీప్తునిఁ జేసి
మాయాది విద్యాసమర్థుఁ జేయ
నింద్రుండు మనుజునికీ విద్య లేటికి
నిచ్చెదరనిదూతఁ బుచ్చుటయును

బలియుఁ బ్రహ్లాదుఁడును మయుఁ బలుకుమనినఁ
బలికె నింద్రుండు తగవేమి పట్టిచెప్పెఁ
దాను వృత్రాది రాక్షస తతులయెడల
నెట్టి తగవున నడచె దానెఱుఁగడోటు! 328

క. అనిదూత వోయిచెప్పిన
వినిశ్రుత వర్మనెదు మనుజువిభు బుత్రునిఁగా
నొనరించి సూర్యవిభుతో
ననికినిఁగొని తెచ్చె నిర్జరావలి గొలువన్. 329

చ. మయుఁడు పురారి సత్కృప నమర్త్య విభీషణమైన సాయకో
చ్చయమును జాపమున్ నృపతి చంద్రభపుత్రునకిచ్చి దానవ
ప్రియముగ నాజికిం బనిచి భీషణదానవ సైన్యయుక్తుఁడై
రయమునఁ దత్సహాయ తదురంబొనరించె సురేంద్రసేనతోన్. 330

వ. అంత. 331

క. దివసకరుడ_స్తమించిన
గవిసెనుతిమిరంబు దిక్కికాయముగప్పన్
దివమునుఁ బుడమియు, సామజ
నివహావిలమైన కువలనిధియును (?) బోలెన్. 332

గీ. ఆజిఁజాలించి యంత సూర్యప్రభుఁడు
విబుధవైరులు దానును విశ్రమించి
యొక్కకథ చెప్పనొడఁగె తద్యోధులకును
శ్రవణపుటముల నమృతంపు జల్లుచినుక. 333

సీ. విక్రమసేన భూవిభుఁడ వంతీశుఁడా
తని మంత్రిగుణసంతుఁ డనెడువాఁడు
నృపతికి విమమరిపుఁడు పెట్టించిన
నెఱిఁగించి యెడపాలనే పడంచె
విభుఁడేటిలో స్నానవిధిఁ దీర్పనక్రంబు
వట్టిన నసిదానిఁ గొట్టివైచె
మఱియు నుగ్రపు ఫణిగఱచిన విషమొక్క
పడిన నిజేశ్వరు ప్రాణమెత్తె

నట్టిసచివుఁడు విభుకృపా ప్రాప్తుఁ డగుచు
నంతిపురినున్న వేళయు నధిపుఁగొలుచు
నట్టిచో భూమిపతిభార్యయభిలషించి
పట్టుటయును నంటకున్ననుఁ బడఁతియలిగి. 334

క. మఱుపడ పతిముందటఁ గొ
న్నఱవులు వచరించి మంత్రియల్లుఁడు నన్నుం
బఱచెనని యూత్మనఖముల
కెఱువులతని వనుచుఁజేరఁ దివిసటు చూపెన్. 335

ఉ. ద్రోహిప్రధానియంచు తలద్రుంచగ పంచినవాఁడుమున్నె యా
యూహయెఱింగి పాసి చనియొక్క మహీసురమంత్ర విద్యచే
బాహుబలంబు గాంచి నిజపార్థివునిం దెగటార్చి తద్ధరా
వాహినులన్ వరించె గుణవంతులకున్ సిరిపొందకుండునే. 336

క. అనిచిత్రకథలు హితునకు
వినిపింపఁగనంతనిశకు వేఁకువబొడమెన్
దనుజేంద్ర హృదయచింతా
ఘనతిమిరముతోడనంధకారము విచ్చెన్. 337

క. శౌర్యతరవిమత శిక్షా
వార్యక్రోధమున నరుణవర్ణం బగు నా
నూర్యప్రభువదనంబన
సూర్యప్రభయంకురించె సురపతివంకన్. 338

దోదకవృత్తము :
వాసవుఁడాశ్రుత వర్మనుఁ గొంచున్
గాసిలి వచ్చిన గార్మికశక్తిన్
రాసులుగా సురరాజి శిరంబుల్
భూసతికిన్ మణి భూషలుచేసెన్. 339

వ. మఱియును. 340

చ. హరవరలబ్ధశక్తి నమరాధిపతిన్ శ్రుతవర్మతోడనం
గరమునఁదోలి దానవనికాయము ప్రస్తుతిసేయ శూలి ఖే
చరకుల చక్రవర్తి పదసంస్థితుఁ జేయఁగ దివ్యకన్యకా
పరిణయవృత్తిఁ జెంది నిజపట్టణ భూస్థలికేగ నున్నతిన్, 341

వ. అని యుపన్యసించి. 342

ఉ. శ్రీసుదతీకపోల తలచిత్రలతాపరిణద్ధ సద్య శో
భాసిత కుంటముక్కలపిన భైరవపాత్ర హృదంతరాళ సం
వాస వివేశ పాదయుగ వాసవముఖ్య సురేంద్రమానసా
ధ్యాసిత కామితార్థ ఫలదాయక! వేంకటశైల నాయకా! 343

క. వర విభవకుంటముక్కల
వరపిన భైరవసుధీరవత్సల లక్ష్మీ
గురుకుచకుంకుమ పంకిల
సురభికళాకలిత వక్ష! సురముని రక్షా! 344

మత్తకోకిల :
కంటకప్రతి పక్షదానవఖండనస్ఫుట మండనా
కుంటముక్కల పిన్నభైరవగోత్ర రక్షణ వీక్షణా!
మంట పాద్యుపహార మోహితమానసీ వర దేవతా!
ఘంటికాయుత వేదనూపుర కల్పకాశ్రిత కల్పకా! 345

గద్య. ఇది యష్టభాషాకవితా ప్రవీణ నవఘంటసురత్రాణ సూచనా
మాత్య పుత్రసుకవిమిత్ర వినయ విద్యావిధేయ యెఱ్ఱయనామ
ధేయ ప్రణీతంబైన సకలనీతి కథానిధానంబునందు చతుర్థా
శ్వాసము.



# పంచమాశ్వాసము

శ్రీదయితాకరుణా సం
పాదిత శ్రీకుంటముక్క భైరవ హృదయా
హ్లాదన కారణ ధారణ
వేదాంభోరాశిపాథ! వేంకటనాథా! 1

వ. అవధరింపుము నారదమునీంద్రుండు బలీంద్రున కిట్లనియె. వత్సేశ్వ
రునకు వజ్రప్రభుండను విద్యాధరుం డిట్లనియె. 2

సీ. ధరవితస్తా తటి తక్షశిలా నామ
పురవరం బేలెడి భూప సుతుఁడు
ధర్మాత్ముఁడు కళింగదత్తుఁ డప్పురి వణి
క్తనయుండు ధనవంతుఁడనెడివాఁడు
జినమునికిని సేవ సేయుచుండి తదాజ్ఞ
కులవర్తనమునకుఁ దలఁగుటయునుఁ
దజ్జనకుఁడు భూమిధవునకు వినిపింపఁ
దనయుని ధర్మసాధకునిఁ జేయు
మనుచు నృపతియు నవ్వణిక్తనయుఁబట్టి
చంపుడని తండ్రి ప్రార్థింపఁ జంపకతని
నాఁక పెట్టించి మాసద్వయంబునకును
బుద్ధిలేకున్నఁ జంపుదు సిద్ధమనుచు. 3

వజ్ర వృత్తము:
దనదత్తుండును ధరణీపతిచేఁ
దనకుం బ్రాణ విదళనంబనుచున్
దినమున్ భుక్తి విధిక్రియలుడుగన్
దనువెల్లన్ గృశతన్ వహియించెన్. 4

గీ. నెలలు రెండుచనిన నృపతి వైశ్యతనూజుఁ
గృశశరీరుఁజూచి ఖేదమొదవి
యేనుచూపు మార్గమీక్షింపు మననట్ల
కాశ యనిన రాజుకరుణతోడ. 5

ఉ. తైలఘటంబుమోచికొనిత త్క్షణమాత్రముఁ జిందకుండ నీ
సాలముచుట్టునం దిరిగి సయ్యనరమ్మది చిందెనేని ని
ర్మూలము చేతునన్న నది మోచిచలింపఁగఁ జూచి యాత్మ నీ
లీలనె దృష్టిచేర్చిన ఫలించు విముక్తియు వంశధర్మముల్, 6

గీ. అనుచు నుపదేశమొనరించి యతని ననిపె
నాకురంగాఖ్యుఁడత్తుఁడు ద్యద్విభూతి
నాత్మసతి తారకాదత్తయనెడు నింతి
సౌహృదశ్రీలు విలసిల్ల మోహియగుచు. 7

వనమంజరి :
నరపతిగర్భ భరాలసభావ పినద్ధ వినప యోధరన్
గరిగమనన్ విజనంబగు వేళలఁగామితార్థము లిచ్చుచో
సరసిరుహానన పూర్వభవాంచిత సారచిత్రకథావళుల్
పరమముదంబునఁ జిత్తమువొంగగఁ బ్రస్తవంబులనెన్నఁగన్. 8

సీ. గర్భంబుతోఁగలగాంచి తారాదత్త
పతితోడఁదన పూర్వభవచరిత్ర
మిట్లనె సురభినానెసఁగు విద్యాధరి
శాపానఁ బుట్టినజలజముఖని
దైవతలక్ష్మి నిధర్మదత్తుండను
జనపతి సతినన్యజన్మమునను
కుంభదాసన వైశ్యకులమునఁ బుట్టితి
దేవదాసుండ నుద్వాజుని సతిని

గీ. కరవుచేనొచ్చి యాఁకటఁ గ్రాఁగ విప్ర
భోజనము వెట్టుచును వారిభుక్తశేష
మస్మదధిపతి భుజియించి యల్పభుక్తి
శోషతనుఁ బొంది భర్త్రయసువులఁ బాసె. 9

క. ఏనుఁదదను గమనంబున
భూనుత జాతిస్మరత్వమునఁ బుట్టితినాన్
మానవపతియుం దెలిసెను
ధ్యానంబున నాఁటి దేవదాసుఁడ ననుచున్. 10

గీ. పొలఁతి ! జాతిస్మరత్వ విభూతిమనకుఁ
బొడమె పుణ్యంబు చేసని భూవరుండు
తల్లిదండ్రులు, మామ, మాతామహుఁడును
సకల జనములు ధర్మంబు సాటిగలరె! 11

సీ. మందాకినీతటమహిని విప్రుండు చం
డాలుండు తనదు ప్రాణములువిడువ
నిరశనవ్రతపర నిష్ఠనుండుచు మత్స్య
ఘాతకు ల్మీనభక్షణముసేయ
విప్రుండువారల విధివేడ్కఁగనుగొనఁ
జండాలున కనదసహ్యమైన
ప్రాణికింబ్రాణి నాహారంబుసేయు నీ
ప్రాణమేటికి నని యాత్మదలఁచి

గీ. యంత మృతిఁబొంది యిరువురునమర పురికి
నరిగి క్రమ్మఱజనియించిరవనియందు
జాలిసుతుఁడయ్యె విప్రుండు శ్వపచుఁడధిప
నందనుండయ్యె హింసలఁగానంగఁ దగదు. 12

క. హింసింపఁ దలఁచువాఁడును
హింసింపఁగఁ జూచువాఁడు హింసాపరుఁడున్
హింసాకర్మలచేతను
హింసింపఁగఁ బడుచునుండు రేపుట్టువులన్. 13

వ. అదియును వేదోక్త ధర్మంబైన హింస నిర్దోషమనంబడు నది
యెట్లనిన వినుమని యిట్లనియె. 14

సీ. కుండినపురమున క్షోణీసురుని శిష్యు
లావు దేఁబోయి క్షుధార్తినొంది
యజ్ఞమంత్రముల నయ్యావును విశసించి
భక్షించి గురులకాభంగిఁ జెప్ప
సత్యంబనొడివితి రత్యంతమోదంబుఁ
బ్రాపింపుఁడ నివారిఁ బలికె ద్విజుఁడు
కానసత్యవిశుద్ధమానవోత్తములకు
సకలసంపదలును సంభవించు

విగతసత్యుని సతియైన విడువఁజూచు
చిత్రకథవినుమొకటని చెప్పఁదొడఁగె
క్షితితలేశుండు విక్రమసింహుఁడనఁగ
నతఁడు యుద్ధంబుగోరిన ననియె మంత్రి. 15

ఉత్సాహ:
బలితనూభవుండు మునుపు పార్వతీమనోహరున్
గలహమడిగి విష్ణుచేతఁ గరములెల్లఁ బోవఁడా
వలదు పోరుగోర రాజవరుల కట్లయేని కా
నలకు వేటపోయి మృగవినాశనంబుసేయు వే! 16

చ. సచివుఁడుబుద్ధిజెప్పిన రసాతల నాథుఁడు వేఁటయేఁగి త
ద్విచికిల కుంజమధ్య విని వేశుల నిద్దఱఁగాంచి యుమ్మలీ
మ్లుచులను భీతి వారిఁదనముందటకిం బిలిపించి! యేల యీ
రిచట వసించినారనిన నిట్లనిపల్కె నొకండు భూపతీ. 17

క. వినుము నృపాలక! జననీ
జనకులఁ బెడబాసి బాల్యసమయంబున బ్రా
హ్మణసుతుఁడ నయ్యునాయుధ
జనసాహాయ్యమున భ్రష్టచర్యుఁడనైతిన్. 18

గీ. అంత నొక్కవేళ నంగడి నొకబండి
యెక్కి పెండ్లికొమరుఁ డింతిఁగొనుచు
వచ్చుచోట రాజవారణ మెగిచిన
పడుచు డించివాఁడు పాఱుటయును. 19

మత్తకోకిల :
కన్నెభీతిఁ దలంకనే నాగంధదంతికి నడ్డమై
వన్నెఁదప్పక యుండడించిన వారిజానన కన్నులన్
సన్నసేయుచు నాథునొల్లక స్వామివీవని ప్రేమతో
నన్నుఁజూచిన దేవతాసదనంబునం బడియుండితిన్. 20

గీ. మామయెఱుఁగకుండ మధ్యమనిశయందు
భోజనంబు గొనుచు పొలఁతివచ్చె
దానిఁగొంచువచ్చి దాఁచితి ననుచును
నిజము పలుకుటయును నృపతి మెచ్చి. 21

క. ఆకన్యక నావిప్రునిఁ
గైకొమ్మని ముదలపెట్టి కన్యయువానిన్
గైకొనియె రహితసత్వ
వ్యాకులతాతరులకేల వలతురు కాంతల్. 22

వ. అనిచెప్పినంత కళింగదత్తునిభార్య తారాదత్త పుత్రింగాంచిన సంతోషరహితుండై సచివులంజూచి కన్యకాజన్మ దుఃఖోపశాంతి గా నిట్లనియె. 23

గీ. ధరనహింస కంటె ధర్మంబు సన్యాస
పరతకంటె ధనము కరుణకంటె
పరమమైన మోక్షపదమును లేదని
దయయుక్షమయు మునులు దాల్తురెపుడు. 24

తరల :
ధరణినాథుఁడు దొల్లిభార్యలు దానువేఁటకునేగి మ
ద్యరసముంగొని (చొక్కి) నిద్రితుఁడైనఁ గాంతలు తాపసే
శ్వరు నిసన్నిధినున్న భూపతి సౌప్తికంబున బాసి దు
ష్కరతపోనిధి గాముకుండని ఖడ్గసంహతి చూపినన్ 25

క. మునివరుఁడు క్షమయుఁ గరుణయుఁ
దనకుఁ దను ప్రాణములుగఁ దాలిచినృపనం
దనుమీఁద నలుగఁడయ్యెను
ముని తనువును ఖడ్గధార మోవకయుండెన్. 26

వ. మఱియునొక్క కథవినుమని కళింగదత్తుఁడప్పుడు. 27

గీ భార్యవరుఁబాసి వైరాగ్య పరతనరుగ
ధవుఁడుప్రార్థించి పట్టినఁ దరుణివలికె
కాయమస్థిరమందు భోగంబుదలఁప
స్వప్నసౌఖ్యంబు వినుమని వనితమఱియు. 28

క. పలలాస్థి సిరామేదః
కలిలానిల చర్మపూతిగంధస్థితులన్
వలకాఁడు దనువు సరిగాఁ
దలతురు పరమాత్మ విదులంతప్పర దృష్టిన్. 29

గీ. అనివిరక్తి పీడనాడినఁ దెలిసివై
రాగ్యవృత్తిఁ బొందిరాజ తనయుఁ
డన్యదృష్టులుడిగి యాత్మయందునె దృష్టి
నిలిపిముక్తినగర నెలవుఁగొనియె. 30

వ. అనివిరక్తభాషణంబు లుపన్యసించు కళింగదత్తునకుం బురోహితుం
డిట్లనియె. 31

ఉ. తొల్లిసుషేణ భూపతి వధూరతి హాటకకూట వాటికా
ఫుల్లవనాంత వల్లరుల పొంతఁ జరింపుచుఁ గాంచెనిర్ఝరీ
హల్లకగంధి రంభయనునంగ్గన నజ్జలజాత నేత్రయున్
సల్లలితాను రక్తి నృపచంద్రునిఁ జూచెవిలోలదృష్టులన్. 32

క. ప్రేమాతిశయిత నిర్జర
కామినియు సుషేణ నృపుఁడుగల సిరియంతన్
భామసుతఁగాంచి యపుడా
భూమీశ్వరునొద్దనునిచిపోయెన్ దివికిన్. 33

ఉ. కన్యసులోచనాఖ్య క్షితికాంతుఁడు పెంచఁగ వృద్ధిఁబొందగాఁ
గన్యను కశ్యపాత్మజుఁడు గైకొనె మామయు రంభకోర నా
సన్నుతగాత్రిఁ దెచ్చెనిజసంచితదివ్య తపోర్థదాతయై
కన్నెలుగారె తండ్రులకుఁ గామితమోక్షము లిచ్చుదేవతల్. 34

గీ. అనుపురోహితు వాక్యంబు లాత్మనిలిపి
కన్యఁబోషింపఁ బెరిగె నక్కాలమునను
మహితసోమ ప్రభానామమదిర నేత్ర
మయుని సత్పుత్రి రాజకుమారిఁగూడి. 35

వ. బద్ధసఖ్యలై సౌధాంతరంబున రహస్యంబున నిట్లనియె. 36

క. అన్యులెఱుంగక యుండన్
గన్యా సఖ్యంబు మనకుఁ గావలయుఁజుమీ!
అన్యాయం బంతఃపుర
విన్యాసము యోగికైన విమలేందుముఖీ! 37

సీ. పుష్కరావతి యనుపురమున గూఢసే
నాఖ్యుండు నృపసుతుండందునొక్క
యూరుజ తనయుండు కూరిమి చెలిగాఁగ
దాదితోఁ గాఁగ యాత్రలకు నరిగి
యొకచోటఁ బరిజనయుక్తుఁడై వసియించి
దాదిపీఠించి మోదమున నొక్క
కథచెప్పుమనినిద్ర గదిరినఁగనుమూయు
దాదియునిద్రించెఁ దత్క్షణమున

వికతనిద్రుండు కోమటి వినుచునుండ
దివ్యకాంతలు పలికిరి దివివసించి
కథలు వినవచ్చితిమి మనః కౌతుకమున
నకటనిద్రించెదరు మూఢులట్లవీరు. 38

వ. ఒక్కహారంబునుపలంబు లుడుపదంబునం బొడగట్టెడునవిగైకొన్న
నుత్సుతశతంబును విన్నను రాజపుత్రుండు మృతుండగునని యెరి
గిన నిద్రారహితుండైన వైశ్యకుమారుండు విని ప్రభాతంబున
రాజపుత్రునవి యుంటనీయక కొనిచని శ్వశ్రూగృహంబున నునిచి
శతక్షుత ప్రతీకారార్థంబు చింతింపుచుం బ్రచ్ఛన్నుండై యారాత్రి
యచట వసియించునంత. 39

క. క్షుతశతములకును దీవన
లతిశయముగ నొసఁగి కల్యమగుటయు వెడలెఁ
క్షితిపతిసుతుఁ డంతఃపుర
గతుఁడై వైశ్యుండు ద్రోహిఖండింపఁ దనక. 40

గీ. ఈతఁడుపకారిగాని యహితుఁడుగాఁడు
వధయొనర్పకుఁడని దివ్యవాణిపలుకఁ
గాచిరటుగాన వ్యాళ సంకేతముసింహ
కంఠవసతియుగాదె భూకాంతమైత్రి. 41

వ. అనుటయు నక్కళింగ దత్తతనూభవ యిట్లనియె. 42

సీ. యజ్ఞస్థలంబను నగ్రహారమునందు
ధనహీనుఁడగు విప్రతనయుఁ డొకఁడు
కట్టెలుమోపుగాఁ గట్టియెత్తగలేక
పడి వ్రణమైనఁ జేపట్టియొక్క
యెడబిశాచమువచ్చి యేమైన మందిచ్చి
పుండుమాన్చిన విప్రపుత్రకుండు
హితబుద్ధి వాటింపనింటి వారికినెల్లఁ
బుండ్లుగావించియు బూమెచేసి
కూఁతుఁగైకొని పైశాచకులముఁ గలసి
చనియె నటుగాన రాజ పిశాచములకు
నంతరము లేదు నమ్మిన యట్టివాని
భంగపరతురు చెఱుతురే పట్టులందు. 43

వనమయూరము :
ఈగతి మహీశసుత యిష్టసుఖ గోష్ఠిన్
సాగతముచూప మయసంభవయు నంతన్
నాగధరకేగె నరనాథ సుతయున్వై
రాగముసహిపక సుఖోర్జితమునొందెన్. 44

ఉ. అంతఁగళింగదత్తుఁడు నిజాత్మజ దానవపుత్రికాసమా
క్రాంతమనస్కయై రుచులుగానక మేనుకృశించుచున్న భూ
కాంతుఁడు వైద్యులంబనుపఁగామిని హస్తముచూచి మోహవి
భ్రాంతియకాన రోగమని పల్కినఁగూఁతురు చెప్పనంతయున్ 45

ఉ. అంతఁ గళింగదత్తుఁడు నిజాత్మజ యమ్మయజా సఖీత్వని
ష్క్రాంతిఁ గృశించునే యనఁగఁ గ్రమ్మఱ నమ్మయపుత్రి వచ్చినన్
సంతసమంది పూజలు ప్రశస్తముగా ఘటియించె నంతన
భ్యంతరవాసఁ జేసిన ప్రియంబున భూపతి సమ్మతించినన్. 46

క. మయపుత్రి చెలియఁ దోడ్కొని
స్వయంప్రభయను దనభగిని సన్నిధికిఁ గడున్
రయమున నరిగర్వితయై
వియదట యానమునఁ బురికి వేగమె మఱలెన్. 47

గీ. మఱియు నొకనాఁడు మయజ నమ్మగువ యనియె
సుదతి మీయత్త వారిల్లు చూడవలయు
ననుడు శ్వశ్రూగృహంబు దుఃఖాయతంబు
సర్పసంశ్రిత చందనశాఖవోలె. 48

వ. అదియెట్లనిన, 49

సీ. ధనపాటలీపుర ధాముండు పాటల
పుత్రకుండును వణిక్పుత్రుతనయ
కీర్తిసేనానామ కీరభాషిణి దేవ
సేననాముని పత్ని చిగురుబోఁణి
పురుషుఁడు పరదేశమునకుఁ బోయెదనన్న
నత్తమామలు దుష్టులనివచింప
.....................
.........................

గీ. వేశ్యవైతివి నాయిల్లు వెళ్ళుమనిన
దైవగతి నిల్లు నిశయందుఁ దస్కరుండు
త్రవ్వుటయు నింటిలోఁగల ధనముఁగొనుచుఁ
గన్నమున వెళ్ళి పురుషసంగతికిం బాసి
సార్థసంగతిఁ గానస్థలికి నరిగె, 50

సీ. తరుకోటరంబున దానవితనసుతు
    లాహారమడుగ నిట్లనియె నెల్లి
నరపతికినిఁ బుట్టుశిరమున నొక నొప్పి
    యది వైద్యులకు నసాధ్యంబుగాన
నేర్చిన దలనెల్ల నెయ్యంటి కాఁపుచు
    శ్రుతులందు నులివేఁడి ఘృతముఁ బోయ
శమియించు వేకున్న జచ్చుఁగావునఁ జేత
    బలిచేతురందులఁ గలుగుభుక్తి

యనుచుఁ జెప్ప నూరుజాంగన విని యంత
వేఁగుటయును వైద్యవేషమునను
బురమునొచ్చి నృపతిపరిజనాహూతయై
మొలఁతనొప్పి మాన్చి మేలువడసి. 51

క. ఆనగరికి నాత్మేశుఁడు
దీనారశ్రయుతనరుగుదెంచిన గనియా
మానినియుఁ గలసె నివివో
మానినులకు సత్తవారిమంచి గుణంబుల్ 52

పీరభద్రభూషణము :
ఆకళింగదత్తు పుత్రియాదితేయ కాంతచే
నాకథాక్రమంబు వించునబ్జనేత్ర నీపతిన్
నాకుఁజూపు మన్నఁ శ్రీదనందనుండు మత్రియున్
నీకు నెట్లుచూపవచ్చు నీవుకన్యవో సఖీ ! 53

క. అని చెప్పి ప్రొద్దుగూఁకిన
జనియోమమయపుత్రి యంతసౌధాగ్రమునన్
వనితవసియించి యభ్రముఁ
గనుఁగొనఁ బొడఁగట్టె నొక్కఖచరుఁడు మింటన్. 54

శా. ఆవిద్యాధరనందనుండు గనియెన్ హార్మ్యాగ్రభాగంబునన్
శ్రీవర్ధిష్ణు శరీరమూర్తి యగు రాజీవాక్షిం గందర్పద
ర్పావేశావృత దేహుడై యకట మర్త్యస్త్రీకి మోహించితిన్
నావిద్యాధర భావమేలయని స్వాంతప్రాప్త చింతాత్ముఁడై 55

క. హరుఁగూర్చి తపముచేయుచు
పురహరవరలబ్ధ గాఁగ పొలఁతుకఁ బడయున్
వరియించె వరము జన్మాం
తరమున నక్కాంత గూడఁదత్పర దృష్టిన్. 56

సీ. అంతకళింగ దత్తాఖ్యుండు దనపుత్రి
సేనజిత్తునకీయఁ జిత్తగింప
నాళిసోమప్రభ నడిగెసేన జిదాహ్వ
యుఁడు ప్రియుండుగ జనకుఁడు వచించె
నెట్టివాఁడతఁ డన్నఁగట్టఁబో! వాఁడేల
కొన టట్టివిభు నీవుగూడు టెల్లు
కౌశాంబియేలు వత్సేశుండు నీకునుఁ
దగుఁగాని యన్యుండు దగఁడు సకియ!

తొల్లివాసవ దత్తయన్ దోయజాక్షి
యతనికులపత్ని గాంచినయాత్మభవుడు
భావివిద్యాధరత్వ సంప్రాప్తినొందెఁ
గానవత్సేశ్వరుఁడె పతిగాఁగ వలయు. 57

గీ. తన్వి నినుఁ జూచెనేని యుద్ధరణి వరుఁడు
తనదుతొల్లింటి వాసవదత్త విడుచు
సిద్ధమిది యిట్టికార్యంబు సేయుమనివ
దైవమునుగూర్చు సర్వంబు దైవికంబు. 58

వ. అదియెట్లనిన. 59

సీ. విక్రమసింహ పృథ్వీపతి నందన
సుభగుని నొకరాజ సుతునిఁ జూచి
సఖిచేతఁ బిలిపించి సంకేతగృహమున
నతనితో రతికేళి ననుభవించి
జనకుండుమః కాలమున వానిచేకూఁతుఁ
బెండ్లిచేసెదనని పిలువఁబంపి
గాంధర్వమున మున్నెకలయుట ధాత్రిచే
నెఱిఁగిమంత్రులకెల్ల నెఱుఁగ జేసి

యర్హుఁడనివారు చెప్పినహర్షమొంది
యాత్మనందన నిచ్చి రాజ్యార్థమిచ్చెఁ
గానదైవికమునఁ బొందగలుగు సదృశ
పతులవిధివ్రాతఁ దప్పనే భామినులకు. 60

సీ. మఱియుదరిద్రుండు మహిసురుఁ డొకఁడు
ధనవర్ధరాసురు దాసుఁడగుచు
నావిప్రసుత పెండ్లి కనుకూల దినమున
సందడి యగుడు నాసందునందు
కన్యకగొనుచుఁ దస్కర మార్గమున రాజ
గృహము బ్రవేశించి కుహకవృత్తి
నరపతిప్రశ్న కుత్తరమిచ్చి మెచ్చించి
పృథ్వీసురునిసుతఁ బెండ్లియాడి

భూపకరుణను సంపద్విభూతిఁ దాల్చె
నట్లుగావున పూర్వభాగ్యమునఁ జేసి
తగినవరులను (కలియుట తరుణులకును)
నమ్మకుండినఁ జాతమురమ్ము నృపుల 61

క. అనిచెప్పి మయతనూభవ
జనపతిసుతఁగొనుచు గగనచరయానమునన్
గొనిచనిసేన జితుండను
మనుజేశ్వరుఁ జూపి సకియ మదిఁగని యంతన్. 62

క. వత్సేశ్వరుఁ జూతము నయ
నోత్సవమగు ననుచు నరిగి యుర్వీస్థలిశ్రీ
వత్సాంకుకరణి బుధజన
వత్సలుఁడగు రాజు కేళివనమునకు దిగెన్. 63

క. ఆరాజునంతలోపల
నారామము చూచువేడ్క నరుదెంచిన యా
పేరెత్తి మయతనూభవ
యారాజతనూజ కతని యాకృతిజూపన్. 64

ఉ. నివ్వెరపాటునం బొడమునేత్ర జలంబులు తెప్పలాఁగ జౌ
జవ్వనజారుదేహలత చంచలమందఁగ స్వేదముబ్బ లే
నవ్వులు జెక్కులం బొలయ నాన యొకించుకజారఁ జూచె నా
పువ్వులవింటివానిసరి పోలెడువత్సధరాధి నాథునిన్ 65

గీ. అట్లువీక్షించి మయపుత్రికనియె నింతి
యవనిపతి నన్ను వరియించు నంతదాఁక
నిచటవసియింపు మనిననయ్యింతి వలికె
వేగిరింపకు నేఁబోయి వేగవత్తు. 66

వ. అదియెట్లనిన 67

క. ఈతఁడు మంత్రియుగంధరు
నీతిన చరియించు నెట్టి నియమములందున్
గాతరభావము వలవదు
నాతి! యనుచుఁ బోయె మయుని నందనయంతన్ 68

ఉ. అంతకళింగసేన ద్విజునాప్తుని వత్సనరేంద్రు పాలికే
కాంతమునందుఁ బంపితనయాగమనం బెఱిఁగింపుమన్నవా
డంతయునేగి చెప్పుటయు నద్ధరణీవరుఁడాత్మ నెంతయున్
గాంతివహించి మంత్రి యుగంధరరాయనికి న్వచింపుచున్. 69

క. కోరంగఁదగు పదార్థము
చేరినవేగంబనరుఁడు చేకొనకున్నన్
జేరినరత్నం బొల్లక
వీఁటిఁడిమై గాజుపూస వెదకుటగాదే. 70

గీ. గృహము గట్టించు వైవాహ కేళికనిన
నట్లసేయంగనొక్క విద్యాధరుండు
పురికినేతెంచి వత్సభూభుజునకనియె
నీపురంబునఁ గొన్నాళ్లు నిలుతుననుచు. 71

సీ. అట్టివిద్యాధరుండాది కళింగసేనా
నురాగంబున హారునిగూర్చి
తపమాచరించి యుత్తరుణిఁ బొందగఁగోరి
యత్తేశపుత్రుఁడై యవతరించ్చెఁ
గానవాతఁడె వత్సకాంతుని పురినిల్చి
మాయచే నక్కాంత మందిరంబుఁ
జెందిరాత్రికళింగసేన నుభోగించి
కన్యకఁగాంచి యక్కాంతకిచ్చి

చనియె నిదివత్సవిభునకు సచివవరుఁడు
తెలియఁ జెప్పిన కాంతపైఁ దలఁపువిడిచె
మదనమంచుక నాఁగయమ్మగువపుత్రి
సకలవిద్యలునేర్చె శైశవుని వలన. 72

ఉ. వాసవదత్త తజ్జనని వార్తకుసంతసమంది యంతలో
నాసుదతీతనూభవ ప్రియంబున నంతిపురంబులోనికిన్
దే సఖిఁబంపి యాత్మసుతు ధీరునినన్నర వాహదత్తునిన్
వాసవభోగిఁ గూడబహువైభవముల్ గృపచేసి పెంచుచున్ 73

వ. అంత. 74

క. నరవరుఁడు వత్సభూపతి
నరవాహన దత్తుఁడనెడు నందనునకుని
ద్ధరణికి యువరాజుగ సు
స్థిరమతిఁ బట్టంబుఁగట్టె శ్రీవిలసిల్లన్. 75

చ. కులజులమంత్రి పుత్రకుల గోముఖముఖ్యుల పుత్రుగొల్వని
శ్చలమతినప్పగించి నిజసైన్యములన్ సమకొల్పనూనును
జ్వలమతి పెండ్లిసేతునని వచ్చిమయాత్మజ దివ్యశిల్పికా
వలిరచితోరుగేహములు వత్సమహీపతికిచ్చె బ్రీతయై 76

గీ. అంతనొకనాఁడు వత్సేశు నంతికమున
కంగనలువచ్చి మేమువిద్యాధరాధి
విద్యలము నీకుమారుపై వేడ్కవొడమి
వచ్చితిమి పొందెదము నరవాహనునిని. 77

క. అని సకల విద్యలాతని
తనువొందినపూర్ణతుహిన ధామునిరీతిం
దనువమరఁగ విద్యాధర
ఘనరాజ్యసుఖంబు గలిగెఁ గౌతుకమొదవన్. 78

వ. అన్నరవాహదత్తుండు మదనమంచుకా పరిణయోత్సుకుండై గో
ముఖాదిమంత్రి పుత్రులతోనుచిత కథాగోష్ఠినున్న సమయంబున,79

ఉ. అంతకళింగసేనతన యాత్మజ నన్నరవాహనాఖ్యు శు
ద్ధాంతముసేయ వత్సవసుధాధిపుతో నెఱిఁగింపబంపిను
స్వాంతత తత్కర గ్రహణ చర్యఘటించిన ఖేచరేంద్రుఁడై
యింతయు నేలె యక్షులు మహీజనులున్ వినుతింపఁ బూజ్యుఁడై. 80

సీ. ఉద్యాన వనమున నొకనాఁడు నరవాహ
నుండు కేళీరతి నుండునంత
నిద్దఱు నృపసుతు లేతెంచి మ్రొక్కిన
నెవ్వరుమీరన్న నిట్టులనిరి
వైశాలికాపుర వరుఁడు నందనభూమి
పతిపుత్రులము వాదమతులమగుచు
వచ్చినారము గజవాహాది కత్వరి
తములకుఁ బణము పంతబు జేసి

దేవమాలోని వాదంబు తీర్పవలయు
నచటికే తెమ్ము నావుడు నరద మెక్కి
యరిగె వారును దానునప్పురము సొచ్చి
యంతిపురివారు పూజింపనధి వసించి. 81

గీ. వారు దెచ్చినట్టి వారణఘోటక
జవము చూచి మెచ్చి సామజము నె
గెలువుచేసి వారిచెలియులఁ గైకొని
యాత్మపురికి మగుడనరుగు దెంచి. 82

క. జనకునకు మ్రొక్కి భూపతి
యనుపగ కనకాసనమున నున్నట్టితఱిన్
జను దెంచి యొక్కకోమటి
వినమితముఖుఁడగుచు పతికి విజ్ఞాపించెన్. 83

సీ. కుసుమసారుండను కోమటి లంబేశు
పుత్త్రుండఁ గలమెక్కి పోవనంత
నుసువాయువశమున నొకదీవి చేరిన
నదియేలుభూపతి నాశ్రయించి
యప్పురివైశ్యకన్యకఁ జూచిమోహించి
యడిగిననీయక యతివదొలఁగ
నంబుధియానపాత్రంబున నిడిపంపఁ
గలముభగ్నంబైనఁ గన్నెయొక్క
దీవిచేరిన నేనునత్తెరవ చనిన
త్రోవనేయొక్క కలమెక్కి పోవనదియు
భంగమునుఁబొంద నేనొక పలకయెక్కి
సింహళద్వీప మొయ్యన చేరియుందు. 84

గీ. తరుణి బాడఁగంటి నచటమతంగమౌని
పుత్రిపోషింపఁ బెరుగునప్పువ్వుబోణి
పూర్వజన్మంబు ఖచరసంభూతయగుట
చంద్రసేనాభిధాన యచ్చంచలాక్షి. 85

క. అదియును నేనును గలము న
ద్రిదశ మునీంద్రుండు వనుపదేశంబుకు న
మ్మది యేగుబోట యక్షుడు
నిదితముగావించె మున్ను విద్యాధరిగాన్. 86

క. నరవాహున కెఱిగింపుము
సరసిజముఖి నీకువలదు చనుమనుటయు నే
నరుదెంచితి ననునాలోఁ
గరిగమనయు నరుగుదెంచె ఖగయానమునన్. 87

ఇంద్రవజ్రవృత్తము

ఆకాంతనయ్యూరుజుఁ డప్పగింపన్
తత్కాంతపుత్రుండును సంతసించెన్
నాకేశ విద్యాధర నాథులాజ్ఞన్
శ్రీకాంతరూపంబు చెన్నుమీఱరన్ 88

సీ. అంతఃపురంబులో నారావముదయింప
నదియేమి యనిసఖునడుగుటయును
మదనమంచుక నొకమాయావి గొనిచనె
శయ్యపై లేదుభూ జనవరేణ్య!
యనుటయు విరహదుఃఖాక్రాంతుఁడై నిద్రఁ
బొందంగఁ గలనొక్క పూవుఁబోఁణి
పానుపుపైనున్న భావంబు దోఁచిన
మదనమంచుక యని కదియఁ జూచెఁ

గన్నుగవవిచ్చి చూచినఁ గానరామిఁ
గళవళంబొంది యెప్పటఁగన్నుమూయ
వచ్చివిద్యాధరీ చంద్రవదన యొకతె
యెత్తుకొనిపోయెఁ బ్రేమవత్సేశు సుతుని. 89

ఉ. ఆగతిఁగొంచుఁబోయిమలయాచల కందరగంధపల్లవా
భోగితశయ్యఁజేర్చుటయుఁ బొల్తుకనాత్మవధూటియంచు సం
భోగముచేసి వేఁగుటయు బుష్పసుగంధినియన్య రూపమై
నాగరి కత్యమున్నెరపి నన్మది తాత్మకుఁ జైనయం తటన్. 90

వ. ఒక కథఁ జెప్పందొడంగె. 91

సీ. పిడియనికరివెంటఁ బడినను నొకవృద్ధ
జంబుకి యొకముని శరణుచొరఁగఁ
కరుణించి ముని తన్నుఁగరిణిగాఁ జేసినఁ
గూడిపద్మియు డావికోస్కదీక్ష

పద్మంబులకుసరః పఙ్కంబున మునుంగ
జంబుకిమఱియొండు సామజంబు
గలసి తొల్లిటి కరిఁగారింపఁనలఁచిన
నదిభద్రకుల జాతహస్తి యగుట

మానిపంపున బఙ్కనిర్మగ్నమైన
పద్మివదలించె సుజనుఁడా పన్నుఁగాచు
కరణినట నక్కయునుఁబోయె గప్పదూటి
కానయీవట్టి మోహంబుఁగడవు మదిని. 92

వ. అనివిద్యాధరి యిట్లనియె. 93

సీ. వామదత్తుండను వసుధామరేంద్రుఁడా
హారార్థమైయొక్క యవనిసురుని
నర్థించి భుక్తిగృహంబునఁ గూర్చుండి
యంతటలేచి గేహంబువెడలి
క్రమ్మఱవచ్చి భుక్తగ్రాసియైద్విజుం
డడిగినవవ్విధ మతఁడువలికె
మద్భార్య నిరతముమహిత సైరిభపాలు
మరగిన దనుచు నామస్మమెల్ల

నాకుఁబినతండ్రి చెప్పిన నమ్మియేను
పోయిచూచిన వెఱవక పొలఁతిగొట్టి
నంతనెనుపోతనై వానినడపఁగదియ
గట్టిరిద్దఱి సాలలోఁగంబమునను. 94

వ. అప్పుడు. 95

గీ. ఒక్కవ్యవహారి కొనిగన్న నెక్కుదూర
మఱుగ ననుఁ జూచి యొకసతి కరుణ నొడమి
దివ్యదృష్టిని నాగతి తెలిసి గంగఁ
దానమాడించి మహిమత మానుపుచును. 96

క. తనకూఁతుఁ గాంతిమతియను
వనితను నాకిచ్చి యనుపస్వగృహంబునకున్
చను దేర భార్య నన్నుం
గనిగుఱ్ఱంబైన సాలఁ గట్టిరి దానిన్. 97

గీ. కట్టిదినమును దరటుసఁ గొట్టుచుండి
యట్లు సేయంగఁ బోయితి ననుచుఁ జెప్ప
నంతఁ జనుదెంచె యోగసిద్ధాభిదాన
కాంతిమతితల్లి మంత్రసంగతునిఁ జేయ. 98

క. ఆవిప్రుఁడు శ్రీపర్వత
దేవునికృప యతుఁడైన దివ్యాంగనయై
యావనిత నన్నుఁ గాంచె గు
ణావృత నే లలితలోచనాభిధనైతిన్. 99

క. అనిలలిత లోచనాసతి
తనవృత్తాంతంబు చెప్పధరణీపతినం
దనుఁడును విహరింపుచు నట
చని కాంచెను జలజనిధిని శైత్యాంబునిధిన్ 100

కవిరాజవిరాజితము

కనుగొని పంకజగంధి మనోహరకామిని మన్మథమంచికనె
మ్మనమున దోఁచి సరోవరమంగన మాడ్కి వహించిన నాతుఁడై
వనజములక్షులు తూఁడులు బాహులు వారి తరంగలు కౌనువళుల్
గనయము చక్రయుగంబిది తథ్యము కామిని యేయని మోహితుఁడై

సీ. పడియున్న సన్మునిఁ బ్రవరుఁడొక్కఁడువచ్చి
శిశిరోపకృతులను సేదదేర్చి
మదనమంచుకయని మఱియును పలికింప
మునియాశ్రమమునకుఁ గొనుచు నరిగి
యేటికి విరహాగ్ని నెగిచెదు నీ కాంతఁ
బొందెదు మోహంబు పోవవిడువు
తొల్లియయోధ్యాధి వల్లభుండగు మద
మత్తజుండు మృగాంకదత్తుసకును
నాప్త మంత్రులు పదురు గుణాకరాదు
లందు లోపల ......పరాక్రముండు
స్వప్నమునఁ గన్న యొక్కయాశ్చర్యమైన
కథవచింపంగ దొడఁగె సకౌతుకముగ. 102

సీ. చీఁకటినిశ నొక్కసింహమునను బట్ట
జెదరకయేను దజ్జిహ్వానఱుక
నది భూతమైననేనడిగితిని మృగాంక
దత్తునకే కాంతతగిన భార్య!
యనియెను జైనభూజన పతికందర్ప
సేనుని తనయ రాజీవనేత్ర
యశివశశాంక వత్యభిధాన యనితిరో!
ధాన బొందెనన చంద్ర దత్తుఁడనియె
నేనుకలగంటి యడవికినేగి డప్పి
నవసి జలమానఁ జనుచు శాత్రవులఁ గెలిచి
శివునినేత్రంబు జఁధి సంసిక్త రక్త?
కటుడనై హారకలితాత్మ కంఠినైతి! 103

క. అనుటయు మంత్రికుమారులు
వినినీకు శశాంకవతియ వేగమెచేరున్
మనమున నూరడు మన నృప
తనయుండిట్లనియె మంత్రి తనయులతోడన్. 104

సీ. కందర్పసేనుఁడు తక్కటబలుండడిగిన
నిచ్చునో యీఁడో ! నిజేచ్ఛుఁడతఁడు
మగధాధిపతి కాశి మహీపతికూఁతురు
నడిగిన నీకున్న నతని మంత్రి
యతిరూపులై శిష్యులరుదేరఁ గాశికి
నరిగి రాత్రి చరింప హస్తిపాలు
పొలఁతి దొంగలు గొనిపోవఁ బల్కెను నన్ను
విడువుండు వేగముద్విభుఁడు వచ్చు

ననిన వారు విడకచనుటయు సిగ్గున
విషముద్రాఁగి కరిణి విభుఁడు వడిన
కపటి తపసివిషము గ్రక్కన నడ
గించి చోరముషితపత్ని చొప్పుచెప్ప. 105

గీ. వాఁడుచెప్పినఁ జని చోర వధయొనర్చి
పత్నిగొనివచ్చి యతనికి భక్తిమ్రొక్కి
యతనిఁదనయిల్లు చూడరమ్మనుచుఁ గొనుచు
నరిగి తనయింట నునిచిననర్ధరాత్రి. 106

ఉ. నాగమొకండు వచ్చి మదనాగము ముక్కునఁబట్ట నేనుగా,
నాగవిషాగ్నిఁ గ్రాలనది గ్రక్కునడించి నృపాల పూజ్యుఁడై
యాగురుమూర్తి తత్తనయనాత్మ నృపాలుని సొమ్ముచేసె నీ
యోగి సముద్ధరించిన మహోన్నత సిద్ధులుచేరకుండునే. 107

సీ. తక్షసిలాపురీధవుఁడు భద్రాత్ముండు
పుత్రార్థియై యష్ట పుష్కరమున
శ్రీఁగూర్చి హోమంబు సేయనొక్కటి దక్కు-
వైన హృదబ్జంబునందు వ్రేల్వ
మెచ్చికుమారుని నిచ్చినఁ బుష్కరా
త్ముండని పెంపంగసుతుఁడు పెరిగి
. . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . .

గీ. తామ్ర లిప్తాఖ్యపురమున ధర్మసేనుఁ
డనెడు వైశ్యుఁడు చోర ప్రవర్త్తుఁడగుచు
హంసమిథునంబు జూచుచు నసువు విడిచె
నతనిభార్యయు పతితోన నగ్నిఁజొచ్చె. 108

క. ప్రాణాంతంబున నరుఁడే
ప్రాణిని వీక్షించు నవ్యభవమున వాఁడా
ప్రాణియగుఁగాన నూరుజ
సూనుండును హంసయయ్యెను సుదతీయుతుఁడై. 109

సీ. ఆగతి హంసయై యభ్రపదంబున
లలనయుఁ దా గమలంబు గఱచి
చనుచోట నొకభిల్లి శరమున నేసిన
నలినంబు తద్వదనమున బాసి
సిద్ధుఁడు పూజించు శివుమీఁద పడుటయు
నది పూజ గా హరుఁడ వధరించి
భూవిభుఁజేసె నప్పువ్వుబోణియు వేగ
విద్యాధరత్వంబు వెలయఁ దాల్చె

ననిన మునిపతి యాపుష్కరాక్షునకును
బ్రియము రెట్టింపఁ గన్నియఁ బెండ్లిచేసి
యనుపుటయు వ్యోమగతిఁ బురికరిగి రాజ్య
మనుభవింపుచు నుండె మహావిభూతి. 110

వ. అనియిట్టి చిత్రకథా వినోదంబులం బ్రొద్దు పరపుచు మృగాంక
దత్తుండొక్కనాఁడు మృగాంకవతీ విరహంబు సైరింపఁజాలక
ప్రధాని పుత్రులతోఁగూడ మహాటవికిం జని యందు. 111

క. శశశోణిత లోహితుఁడై
దశశతకిరణుండు చరమదశ బ్రాపించెన్
దశదిశలు కృష్ణనాగపు
దశపొందిన రవియు భోగతలమణియయ్యెన్. 112

వ. అంత. 113

క. రాతిరనుభిల్లి కర్ణపు
కేతకి గతి చంద్రుఁ డుదయగిరియెక్కిన శా
లీతరుణి శ్రుతి కరోట
శ్వేతద్యుతి యగుచుఁ జంద్ర బింబం బమరెన్. 114

వ. అంతనటనొక్క బ్రాహ్మణుంగని యందు. 115

గీ. ఆమృగాంకదత్తుఁ డాప్తులుఁ దానొక్క
శుష్కతరువు నీడ సుప్తిఁ బొంది
మేలుకనియు చూడ మెలకువ నాచెట్టు
పండుటయునుఁ దినిన బ్రాహ్మణుఁడయి. 116

ఉ. తానునువచ్చి తత్ఫలవితానము భుక్తిగొనంగ వారలా
శ్రమాని తెలంగ దేటిదన బ్రాహ్మణుఁ డిట్లని పల్కెఁ వీఁడయో
ధ్యానిలయుండు విప్రుఁడి తెనాత్మతనూజుఁడ నేను శాపమర్క
గానివహింప మతిత ఫలంబులు నాకిడిపోవసమాడఁగన్. 117

క. ఆ పండ్లన్నియు మెసఁగితి
నాపితకోకమైన నిడిక స్నాతుండై తు
త్తాపంబున మజ్జనకుఁడు
కోపించి శపించె శుష్కకుబ్జమై యుండఁగా. 118

వ. మీఁరీఫలంబు లుపయోగించుటంజేసి శాపముక్తుండనైతి మీ
రిక్కడికి వచ్చుటంజేసి......యేనింద్రజాల శిల్పకళాచతురుం
డను నిన్నుఁగొల్చెదననిన పరిగ్రహించి మృగాంకదత్తుం డతండా
ప్తుండుగా దక్షిణదిశకుం జని. 119

సీ. కరిమండితంబగు కాననంబున శక్తి
రక్షనాముండు కిరాత విభుఁడు
మున్నుగా నొకవృద్ధమునిఁగాంచి సేవింప
ముని మెచ్చి పాదలేపన మొసంగ
నది పాదములఁదాల్చి యభ్రయానంబున
నరిగి వింధ్యాద్రి కందరము నందు
ఖదిరకీలకబద్ధ కాయుఁడై పొల్చెడు
మునిగాంచి యందఱు మునికిమ్రొక్కి

యతికి పరిచర్య సేయ నవాంబుజాక్షి
యచటి కరుదెంచి చనుదోయి నతని మోప
చిత్తమగలిన హోమంబుసేయ మఱచి
యన్నియును నొక్క పరియ హోమాగ్నివైచె. 120

వ. అంత. 121

గీ. ఒక్కభీకర ఫణి మీఁద నుఱుకుటయునుఁ
దలఁగకట్లుమృగాంకదత్త ప్రముఖులు
ఖడ్గములు దాల్చికవిసినఁ గాంచి వారి
కలిగి పెడబాసి పొందు మీఁరనిశపించె. 122

క. పారావతాఖ్య మునియునుఁ
ప్రారంభము విఘ్నమైన భ్రష్టైపోయెన్
వారును నొండొరువులకును
దూరంబై చనిన నృపతి దుఃఖాతురుఁడై 123

క. శ్రుతధియుఁడు తనకు మిక్కిలి
హితుఁడెటవోయెనొ యనంగనే తెంచనియెన్ (?)
క్షితివరనిను వెదకుచు నొక
యతివరుఁడగు బ్రహ్మదత్తుఁడనుమునిఁ గంటిఁ. 124

వ. అతని కిట్లంటిని. 125

సీ. పరమాత్మనేవచ్చు తెరువున నొక కుంభ
కార చక్రమును భృంగవ్రజంబు
వెలఁది గోఖురములు విషమునిర్గుండియుఁ
తలమీఁది వేణుకాదండమునను
దేజంబు దశబాహుదీప్త సింహంబును
గణనాయకుని బొడగంటిమనిన
భవము నక్రము భృంగపటలంబు బంధులు
గొంతి మహామాయ గోఖురములు

గీ. పాపపుణ్యంబులు విషంబు కూప నరక
మింద్ర భూజంబు నాకము హీనతేజ
మమృత మామృగ వరుండు మృగాంకదత్తుఁ
డా భుజంబులు పదియు వయస్య సమితి. 126

వ. గణపతి ప్రసాదంబున మృగాంకదత్తుఁడు శామినివరింప గలండని
బోధించెననిన శ్రుతధి వాక్యంబులఁ గొంతదేరి తత్సహితుండై
నర్మదకుంజని. 127

సీ. అచ్చటమాయావరుండనుభిల్లపతితోడ
మైత్రి వాటించి తన్మందిరమున
వసియించి యొకరాత్రి యశివట్టుక మృగాంక
దత్తుఁడరుగుచు నొక్క తస్కరునిని
దాఁకియెవ్వఁడవన్న తస్కరుండను నీకు
మిత్రుఁడ నయ్యెద మెలపుమనిన
వాని మావటివాని వాకిటివానిఁగా
నెఱిఁగి కాముక వృత్తి నేగువాని

తే. వెంటనే యేగి యమ్మహీవిభునిభార్యఁ
జండకేతుఁడు భూఘనచ్ఛిద్రమునను
జారుఁడై పొందఁగనుగొని సరభసమునఁ
జండకేతుని యింటికిజని విభుండు. 128

క. ద్వారమునఁగట్టినట్టి మ
యూరము మెడత్రాడు విడువను జ్వాలుఁడగుచున్
జేరెన్ భీమపరాక్రమ
ధీరుండను మంత్రిసుతుఁడు తేజోనిధియై. 129

ఉ. భీమపరాక్రమున్ సచివభీమునిగాంచి మృగాంకదత్తుఁడీ
వేమిటికిట్టులైతివన నిట్లనియెన్ నృపనిన్ను బాసియు
ద్దామమహాటవిం దిరిగి దాహమునంగడు దస్సి శాల్మలీ
భూమిజ మూలదేశమున భూమిపయింబడి మూర్ఛపోయినన్. 130

గీ. వృద్ధపథికుఁడొకఁడు వేగమ నన్నుఁ దేర్చి
మత్ప్రయాసమెల్ల మదిఁదలంచి
తగులె దుఃఖపడగ దైవికమున కని
కథ వచింపఁ దొడఁగెఁ గరుణతోడను. 131

క. కోసలపతి విమలాకరుఁ
డాసుభగుతనూజుఁడు కమలాకరుఁడంగ
శ్రీసాహిత్యన్మథుఁడు వి
భాసితుఁడని యొక్కయర్థి పద్యముచదివెన్. 182

వ. అదియెయ్యదియనిన, 183

ఆర్యా :
కువలయ భూషణమతులం
గుణనిలయం కవి సహస్ర సమ్మృష్టమ్
హంసావళిర్న రమతే
కాంతం కమలాకరం విముక్తా్వద్య. 184

క. అని యార్య చదువుటయున
జ్జనపతి యువ్వంది నడిగె చది వినపద్యం
బున కేది కారణంబన
విను కమలాకర ! తదీయవృత్తాంతంబుల్. 185

సీ. విదిశాపురతమా త్రిదశేశ్వరుఁడు మేఘ
మాలినాఁగలఁడు శ్రీమండనుండు
హం సావళీనామ యతని తనూభవ
పంచాస్త్రి మోహన బ్రహ్మవిద్య
యాకన్యకను సత్తనాచార్యగృహమున
వసియించితినిఁ జూచువాంఛ జేసి
యంతటనొక్క నాఁడశ్వాల జనకుని
యాస్థానమున నాట్య మాచరింప
గీ. అంగహారాది విద్యలభ్యాస సరణి
దేశనృత్యమ్మునకు సమాదేశమునను
దండ్రియునుఁ జూచువారలుదన్నుఁ బొగడ
లాస్యమొనరించె దృష్టి విలాస మమర. 186

ఆర్యా:

జయతిసనాభిసరోరుహ
మధుకర పటలై రివాహితాకారః
కోపి శ్రీముఖ చంద్రే
యత్కాంతిర్భవతి లాంఛనచ్ఛాయా. 187

క. అంత దినాంతంబున భూ
కాంతుఁడు చాలించి యనుపఁ గన్నియకును నిం
తింతఁజని నిన్ను వ్రాసితి
నంతః పురభిత్తి వనితలద్భుతమందన్. 188

గీ. భ్రాంతు పగిది నీ విభావంబుగొని యాడ
చిత్రలిఖిత బింబ చిహ్న చూచి
కన్యయందు తగిలి కామాగ్ని పరి
తప్త మానయగుచునున్న మతి నెఱింగి. 189

వ. మేఘమాలి యాత్మతనయ హంసావళి విష్ణుపూజార్థంబనిపె నట
మున్నతదాలయంబుననున్న వాఁడ నగుట నప్పుడు నేను విష్ణునిట్లు
స్తుతించితి. 140

దండకము

జయజయ జగన్నాథ లోకైకనాధార మానాథా లోకేశ నాకేశ
ముఖ్యా మరాధీశ కోటీరకోటి స్ఫురత్కోటి రత్న ప్రభాజాల
సందీప్త పాదారవిందా చిదానంద! నందాదిగోపాల బృంద
ప్రియాస్పంది బృందావనాంతోల్లస ద్రాసకేళీ నటద్వల్ల వీచారు
వాల్లీసకప్రీత చిత్తాంతరంగా! కృపాపాంగ! అంగీకృతానంగ
లీలా పరిష్వంగ నీలాదితుంగ స్తనీపీన వక్షోరుహాన్యస్త కస్తూరి
కాస్థాసకాసక్త ముక్తావలీరక్తి మాశోభికంఠా! సవైకుంఠ! కుంఠీ
కృత క్ష్వేళకంఠో గ్రహుంకార ఫూత్కార కాళింగ నాగోత్త

మాం గోల్ల సన్నృత్యభంగీ సమాన్నత్య మాలావిహారాగుణా
ధార ధారాధరస్ఫార శోభాభిరామ ప్రభాభీరభామాను భోగాను
రాగా మహాభాగ భాగర్వరాధావధూమన్మథా! రాథమాసో
ద్భవారామభూ మాధవీయూధికా సాధుదామ త్రిభంగీనటద్వేష
ధృద్వేణు సంధానమాధుర్య సంగీతగాథా సమాకృష్ట బింబా
ధరాసీధు మత్తానులాప ప్రమోదా! త్రయీనాథ నాథాను
సంధాన సంసారకంధీశమంధాచలీభూత చిద్యోగ యోగేంద్ర
విద్యా పరబ్రహ్మరూపా జగద్రూప రోపస్ఫురద్వర్తనో త్కర్త
నీయ వ్రతాచార! కైవర్తయోషాభిలాష క్షమాదేవ సేవాప్రసా
దావతారా! సముద్ధార (హ్మాద్య, ప్రపంచాద్య! ఆద్యంత
మధ్యాదిరాహిత్య సాహిత్య నిత్యత్వసత్య స్వభావా! సుజ
ద్భావ! భావావబోధ క్రియాజాల! దుర్మానవ వ్రాత కర్మా
ద్వరోద్భూత లోకాధిదూరా చిదాకారకారంభ సృష్టి ప్రజా
రక్షణాక్షీణ దాక్షిణ్య దీక్షానుకంపా కటాక్షా! సురాధ్యక్ష!
యక్షేశమిత్ర త్రినేత్రాంగనాస్తోత్రపాత్రాది నామస్ఫురద్రామ
సోమా పరంధామ ధామాధిపాబ్జాంబకోద్దామ దీప్తిఛటానిర్జ
లోత్ఫుల్లపద్మా! మహాపద్మపద్మోత్పల వ్యూహసంవాహి నీరో
హిణీకుండికావారి వృత్తాంతరస్నాన శుద్ధాంగవైదేశిక ప్రాప్త
కైవల్య భోగప్రదాన ప్రదాతా విదాఖ్యాత! ఆఖ్యాత కీర్తి
ప్రతాపోజ్జ్వల............వాఙ్మాధవ క్ష్మాధవాధీశసంతర్పితా
త్మాది నానావిధైశ్వర్య నైవేద్యసంతృప్త చిత్తాంత రంగా!
త్రయీరంగ! రంగత్సముత్తుంగ భంగచ్ఛటాజృంభ జంభారి
ధిక్కుంభ! అంభోనిధి ధ్యాన సన్మానసానూన గుంజన్మృదంగా
ర్భటీ పుంజరంజన్మహా భోగవృత్తాంగనా సంగ సంగీతవిద్యాను
రక్తా! గుణావ్యక్త అవ్యక్తరాగా భ్రవద్భర్మ శాటీకటీరా!
తపస్సార సారామృతాసార ధారా పరిప్లావ సత్యాది
లోకావళీ లోకసంవారణేహా వటక్ష్మాజ శాఖాశిఖాకోటర
స్థాన సంవేశపత్రి వ్రజాలబ్ధ సమ్మాతుడ శ్రీయశఃపూర్ణ దివ్య

చ్చరిత్రా! మహాచిత్ర! చిత్తాయుహూర్జస్వలద్బా మృకండ్వాత్మ జన్మార్చనా నిర్జితోష్ణాతనూ కృష్ణ కృష్ణా! ప్రలంబఘ్న సంజాత రాజత్సుభద్రాకృతి క్రీడిత శ్రీశ గౌరీశ వాణీశ మూర్తి త్రయోపాంగదారు స్థితోదార వైకుంఠవాసా శుభావాస వాస వ్యధిష్ఠానయానోచ్చలత్సారధిత్వాపదేశ క్షమాధార కృద్వైరి విధ్వంసనోద్యత్ప్రతాపా! నమద్గోప! గోపద్మనేత్రా రతాసక్త సద్గణ్య మాసీంద్ర పూర్వాచరద్భవ్య చంచత్తపోభంగ వ్యాదీప్తి నిర్వాణ సర్వాభిధానా సమాధాన ఆదానఖేలా బృహత్కుక్షి నిక్షిప్త పంకేజ గర్భాండ సంజాత పుంజీభవజ్జంతు సంతాన వృత్తి ప్రవృద్ధాన (?) దాక్షిణ్యముద్రా! కృపాభద్ర! భద్రా సనాసీన భూపాల భూపాలనాసంతతప్రీత శాంత స్వరూపా! నమద్దేవ దేవేంద్ర ముఖ్యాదితేయారి సంహృత్సహస్రారి బాహాచతుర్వ్యూహితాశేషకైవల్య మాంగళ్యధామా! పటీ హేమ! హేమక్షమాభృత్తు షారాచలాద్యద్రి వర్యాధిక శ్రీల సన్నీలధాశైలాగ్ర సౌధాంతరస్థాధ్వరతోష్కరు పీఠస్థలీ సన్నివేశా ధృవాద్రీశ అద్రీశమూలాలయాదిత్య మాసీంద్ర యోగాంచి తధ్యాన విజ్ఞాన విద్యాసనాథా! జగన్నాథ! నాథాది నాథా! నమస్తే నమస్తే నమః 141

ఆర్య :

జయ కమలా కరలాలిత
చరణ సమాక్రాంత భువన! విశ్వాత్మన్
ప్రకట సుదర్శనకాంత
...పురుషోత్తమ పుండరీకాక్ష (?) 142

క. ఈ కరణిని నుతియింపఁగ
నాకన్నియు మెచ్చి యొక్కయంశుక మీయన్
గైకొంటినంత భూవరుఁ
డాకమలాకరునికిత్తునని తలఁచుటయుఁన్. 143

సీ. కన్నియ నిజసఖి గనక మంజరిఁ దప
స్వినిఁ జేసి కమలాకరునినిఁ జూడఁ
బనిచిననదిచూచి చనుదెంచి యిట్లను
నినుదండ్రి కమలాకరునికి నీఁడు
కటకట యొరున కీఁగాంచి యున్నాఁడ న
సఖి నీవు నాదు వేషంబుదాల్చి
వరియింపుమని నిజాభరణంబు లిచ్చినఁ
దద్వాదితో పాయతం బురంబు

గీ. వెలినిబూరుగు తోట్టిలో నిలువుమనిన
వెఱచి కేసర లతలలో వెలఁది నిలచె
నంత కమలాకరుండు హంసావళినుచుఁ
గనక మంజరిఁ బెండ్లాడి కదలిచనుగ. 144

గీ. కనకమంజరి విభుఁజూచి యనియె నిందు
భూతమున్నది కాల్చుమీ భూర్జతరువు
నన దహింపగ జూచి హంసావళియును
సఖ ప్రమోదించి యక్కట చంపఁజూచె, 145

క. అని డెందంబున నచ్చెలి
నన్నయము దూరుచును నట దినాంతమునందున్
వనరుహలోచన యొంటొక
వనము ప్రవేశించి మోహవశమున వ్రాలెన్. 146

ఉత్సాహ :
తనకుతాన తెలివిబొంది తన్విపద్మసంహతిన్
వనరుహాక్షుఁ బూజచేసి వంతబొందుచుండన
క్కనకమంజరీప్రియుండు కాగఁ గూడియుండగన్
దనువునందు జ్వరమువొడమి దాహశక్తి చూపగన్. 147

వ. అశ్కనకమంజరి కమాలకరజ్వర నివారణార్థంబు శక్తికి నరోప
హారంబు సమర్పించతనవృత్తాంతం బెఱింగిన యశోక కరియను
సఖని బలివట్టందలంచి. 148

గీ. పట్టితెచ్చి విభుని పరకంకన్యెట భూ
స్థలిని ఖడ్గమెత్తి తాన నఱుకఁ
జేర మొత్త యిడుచుద్వార పాలకునిల్లు
చొచ్చి చెప్పెఁదొంటి సుద్దులెల్ల. 149

ఉ. చెప్పిననేమి చెప్పనృపశేఖరుఁ డాసతి దుష్టశీలగా
నప్పుడెఱింగి హాప్రియ మృగాక్షి! లతాంతశరీర యెట్టుగా
నిప్పుల ద్రేలితేయనుచు నివ్వెరగొందంగ వందిమానవుం
డప్పుడు వచ్చి చింతవలదంచును బుద్ధులుచెప్పి యిట్లనుక్. 150

సీ. హరిపూజ చేత హంసావళి నాశంబు
బొందదు వెదకించు పువ్వుబోణి
నానట్ల కావింప నట వీస్థలంబునఁ
గనికొనియేగి తజ్జనకు నింటఁ
బెట్టితిమని నిజభృత్యులు చెప్పిన
జని మేఘమాలితత్సదనమునను
హంసావళిని వివాహముఁ బొంది క్రమ్మఱ
తనపురికేతెంచె ధరణినాథుఁ

గీ. డనుచుఁజెప్ప వినుచునప్పు డుజ్జయినికి
నరిగి యొక్క ముసలి యవ్వయింట
రెండురూకలిచ్చి నిండంగభుజియించి
కుక్కియిడిన నిద్రఁగూరియుండు. 151

వ. అప్పుడు. 152

క. ఆయింటవృద్ధ కామిని
యాయతమతి యవలుపిడికె డలికినపుడే
కోయంగనైనఁ జిదుముచు
నాయవలునుదంచి వండ యాపగ కరుగన్. 153

క. రండచనుదెంచు నంతకు
నుండక యా యవలనైన హూరెముదింటిన్
ముండయు కోపంబునను శి
ఖండింగాఁజేసి త్రాడుగళమునగట్టెన్. 154

క. ననువేఁటగాండ్రు కనుగొని
చని రాజునకిడిన ద్వారసంబంధుఁడనై
జననాథ సీకతమ్మున
మనుజుఁడనై నిన్నుఁగంటి మంటిని యుంటిన్. 155

వ. అనిచెప్పినంత. 156

సీ. ఆ మఱునాఁడు మృగాంకదత్తుఁడు కిరా
తపతితో ద్యూతబాంధవమునడుపు
నవుడు మయూరచోరాదుల వార్రుచ్చి
రాత్రింటి చర్య కిరాతునకును
వినిపింప వాఁడాత్మ వనితను వధియింప
దలచుటయు మృగాంకదత్తుఁడతివ
వధియింపఁగాదని వారింప నదిమాని
శక్తియాగముజేయ జనుని నొకనిఁ

గీ. దెందునావుడు శబరులుద్దండ వృత్తి
బట్టితెచ్చిరి శతవీరభటవిదారు
నతనిఁ దనమంత్రి పుత్రు గుణాకరుఁడుగ
నెఱిఁగి యిదియేమియన నతండిట్టులనియె. 157

క. వింధ్యాటవికిం జని త
ద్వింధ్యాచలవాస గుడికి వేగమ చనుచో
సంధ్యాశ్రయ రుధిరాసవ
గంధ్యాశ్రయమైన యచట కనుగొనునంతన్. 158

క. భయమును బొందగనాపై
దయలో నొక వృద్ధకాంత తగ నిట్లనియెన్
రయమున జనుమిచ్చట సం
శ్రయమనినను నేను దప్పిచని యొకవంకన్. 159

సీ. పాంచాల నృపుద్వార పాలుండు కమలాఖ్యుఁ
డాదత్తచాపుఁడై యడవిలోన
తరుమూలమున నొక్క తరుణి దుఃఖంపగఁ
గని హేతు వడిగినఁ గాంత పలికె
గంధమాలికయను కరటి మజ్జనకుండు
కాలబాహుని పుష్పకాండవహుఁడు
తత్తటిజిహ్వ సోదరుడు కుబేరు శా
పమున రథాంగంపుఁ బక్షియైన

గీ. గిరిజ నాసేవఁగైకొని కరుణఁబలికె
యక్షుమర్దించి యంగుళీయకము గొనిన
వానివరియింపుమనినఁ దద్వ్యధ యొనర్చి
ఇంతిగైకొని చనె తనయింటికతఁడు. 160

ఆ. దేవహూతియనెడు భూవాసవుని పత్ని
భోగదత్తయనెడి పుష్పబోణి
విభుఁడు దీర్ఘమరుగ వెలఁదియుఁ దోటకుఁ
బోయి గార్దభంబు మేయఁజూచి. 161

క. కోలఁగొని దానిఁగొట్టినఁ
గాలొక్కటివిఱిగె దానిఁగని రజకుండా
నీలాలకఁదన్నుటయును
లోలాక్షికిఁ గడుపుదిగిన లోహితమొలికెన్, 162

గీ. ధరణిసురుఁడువచ్చి ధరణీపతికిఁజెప్ప
ధావకునిని విప్రతరుణిఁబిలిచి
వాదు తెఱఁగు దెలిసి వసుధేశుఁ డిట్లని
పలికె సభికులెల్లఁ బ్రస్తుతింప. 163

ఉ. న్యాయముదప్పఁజేసిరి ధరామరపత్నియు ధావకుండు ని
ట్టీయమ వానిగార్దభము హీనపదంబుగఁ జేసె వీఁడుపా
ధ్యాయునిగర్భము న్విలయతంబొనరించెను గావయిట్టి ద
న్యాయముగాకయుండ వినుండందఱు నాదు వివేక వాక్యములు.164

క. నిర్భయుఁడై భూసురసతి
గర్భిణియగుదాఁకఁ జాకిగైకొను ఖరసం
దర్భంబుదాఁక రజకా
విర్భవ వస్త్రములు మోచు విప్రుండనియెన్. 165

వ. అని దుర్వివేక నృపాలుండు దీర్చినన్యాయంబునకు భూసురుండు
దేశత్యాగంబుజేసె నేను గురుక్షేత్రంబున కరుగునప్పుడు. 166

సీ. ఆకురుక్షేత్రేశుఁడగు మలయప్రభు
తనయుఁడిందు ప్రభుఁడనెడి వాఁడు
త్యాగి దుర్భిక్ష విదారిత ప్రజఁజూచి
వరతపంబున హరిపరము గాంచి
కల్పవృక్షాకృతిఁగైకొని వాంఛిత
ఫలదాతయై ధరాప్రజలఁబ్రోచె
నతనిని దానరత్నాకరుడని జన
వితతి వినుతింప వినుచు

గీ. దానమే సర్వజనులకు ధర్మమనుచు
దానమే మోక్షములకెల్ల ధామమనుచు
దానమియ్యఁగ లేకున్నఁ దలఁపవలయు
దానశూరుల నేర్పొద్దు ధర్మవిదులు. 167

వ. అనుచు నచ్చోటు గదలి దక్షిణాభిముఖుండనై యా శబరాల
యంబున కేతెంచిన. 168

తోవకము :
భిల్లులు తాఁకిన భీతిల కేనున్
భల్లపరంపర భగ్నముసేయన్
జిల్లులఁగోలలఁ జించిరి ధాత్రీ
వల్లభ భూతలువచ్చిన...భుఁ. 169

ఉ. చూఁపమృగాంకదత్తుఁడు విశుద్ధచరిత్రులు మంత్రిపుత్రకుల్
ప్రాపులు గా కిరాతవతి బంట్లును దానునుఁ దోడరా విశా
లాపురిఁగూర్చి యేగ విపులాటవినొక్కెడ నిద్రవోవు సం
తాపితుని నిద్రఁ దేర్చుటయుఁ దత్సతివాత్మజుఁ డప్పు డిట్లనుఁ. 170

క. అన్నాగము శాపంబున
నిన్నుంబెడబాసి రత్ననిధియును పురి న
త్యున్నత మూర్తి శతద్వయ
సన్నిధిఁబొడగాంచి యతడు సత్కృతిసేయుఁ. 171

ఆ. యక్షనాథుఁడనుచు నాతని భార్యలు
చెప్పుటయును నతనిచేతఁ దనదు
దుఃఖశాంతియడుగ దురితానుభుక్తికి
దుఃఖమేలరాక తొలఁగిపోవు. 172

క. నిర్ధనుఁడగు నొకవిప్రుఁడు
దుర్ధరతర తపమునందు ధూర్జటివలవన్
వర్ధనముగాంచి యావన
ధూరరయగు యక్షిణీ వధూమణిఁగాంచెఁ. 173

ఉ. యక్షిణికిన్ మహీసురన కంగనయుద్భవమైన నప్పుడా
యక్షిణి భూమిదేవునకు నాత్మజనిచ్చి పినాకపాణి ఫా
లాక్షుని గొల్వనేగిన దదాత్మమనః స్థితి బాయలేక దే
హాక్షయమొందిపోవుటయు నంగనయక్షుని గూడె విప్రునిన్. 174

గీ. అట్టహాసుఁడనెడి నభ్రచరేంద్రుఁడ
య్యక్షిణీతనూజ నబ్జవదన
బలిమిఁబట్టు కొనుచు నలకాపురంబున
కరుగుటయును గిన్నరాధివరుఁడు. 175

క. ఆ యక్షిణీతనూభవ
ప్రాయమునీక్షించి యలిగిపట్టిన వాఁడా
కాయంబువిడిచి హారిగ్రై
పాయకఘోరాటవులను భ్రమతం బాఋన్. 176

గీ. అని శపించిన నక్కన్య నచల పుత్రిఁ
గొలువగాఁబెట్ట నదియునుఁ గొలుచుచుండ
శారదపీఠమైన కాశ్మీర ధరణి
మండలంబేలు నందనమను జవరుఁడు. 177

సీ. ఒకనాఁడు ద్వాదశి నుపవాసమునఁబొంది
కలలోన నాయక్ష కన్యఁగాంచి
దర్పకా నలశిఖా దందహ్యమానుఁడై
ధరణిభారము మంత్రి తతికినిచ్చి
తపమాచరింపుచు తరుణిపైఁ గూర్మిద
శావస్థలనుఁబొంది సమయుతతిని
శంకరరూపుఁడై చనుదెంచి యొకవిప్రుఁ
డనియె భూవరుఁడు దన్నడుగుటయును

గీ. శైవశాస్త్రోక్తమైన భస్మంబుదాల్చి
శ్రీగిరిస్థలిఁ దపమేను సేయుచుండ

శివుఁడు ప్రత్యక్షమై నాకుఁజెప్పె నొకటి
యదివిచిత్రంబు చెప్పెద విదితముగను. 178

గీ. బాణసుతయైన యుష తొల్లి పంచబాణ
తనయు ననిరుద్ధుఁగూడి యా ద్వారవతిని
మండితోద్యాన వాటికా మండలమున
క్రీడసలుపుచు నొకనాడు వేడుకమర 179

క. బాణాత్మజ యిందీవర
బాణాత్మజు గొంచునతలబంధురమయుని (?)
ర్వాణోపవనము కుంజని
మాణిక్య గృహాంతరంబు మరగి చరింపన్. 180

చ. తనయునిమీఁది మోహమున దర్పకుడంబుజ నాభుఁడానతి
చ్చినగతినేగి యచ్చటను శేషవిభూషణుదేవి గౌరికిం
బ్రణుతిచెయనచ్చ సూక్తములబ్రస్తుతిఁజేసిన గీరరూపయై
ఘను ననిరుద్ధుఁజూపుటయుఁ గైకొనిద్వారక కేగెఁబ్రీతుఁడై 181

క. అంతటముని శాపంబున
నంతకపురి కఖలయాదవావలి చనినన్
దంతిత్వగ్ధరు కృపనే
నంతయుబొడఁగంటి బొడమె నాభూపతియున్. 182

వ. అమ్మౌని సహాయుండుగాఁ గాశ్మీరమండలంబున కరిగి. 183

గీ. శారికారూపయగు మహాశక్తి జూచి
దేవిగృపగాంచి కాశ్మీర దేశమునకు
నరిగితద్గంగలోగ్రుంకి యలవుదేతి
రత్నమయమైన యొక్కపురంబుగాంచి. 184

సీ. అప్పురి శ్రీకంఠహాటకేశ్వరుఁగొల్చి
హేరంబు విఘ్నసమేతుఁ బొగడి
యటచని వజ్రమయంబగు నొకమంది
రమ్మునుఁగాంచి తద్రత్నభిత్తి

చేరువనిల్చి తద్ద్వార నిర్గతదైత్య
కన్యల నూర్వురఁగాంచి యందుఁ
గలలోన బొడఁగన్న కామిని యెదురైన
భూనందనాఖ్యుఁ డద్భుతమునంద

కాంతయిట్లని మేదినీ కాంతుఁజూచి
నాకునై వచ్చితివిగదా నాకవసతి
కైననేమగు రమ్మని యతనిగొనుచు
రక్తపూరిత సరసికారమణి యరిగి. 185

గీ. తా తరసపాత్ర భూపతిచేతికిచ్చి
పానమొనరింపు మనిన నృపాలుఁడొల్ల
కున్నశ్రేయస్సు చెడెనని యువిద వగచి
యతని తలమీఁద వైచె నయ్యస్రపాత్ర. 186

క. ఒండొక సరసికిఁ గొనిచని
కాండంబుల నతనిమేనుఁ గడిగది(?)చనియెన్
మండలనాథుఁడు స్వప్నపు
మండనమని తలఁచి దుఃఖమానసుఁ డగుచున్. 187

వ. అచ్చటం బరిభ్రమించుచు నొక్కచోటం బడియున్న సమయం
బున. 188

క. తుమ్మెదలు గుట్టఁబొరలెడు
నమ్మహిపతి గప్పెఁ దపసి యజినముచేతన్
తుమ్మెదలు గుంపుకూడిన
నమ్మునిభూనందుఁ జూచి యపుడిట్లనియెన్. 189

క. జలజభవ జలజలోచన
జలజ కిరీటులు నభేదసాకారులుగాఁ
దలఁచి భజియించు నెవ్వఁడు
నెలమిన్ వానికి ఘటించు నిష్టసుఖంబుల్. 190

గీ. అనుచు మానిపలుక నద్ధరణీశుండు
బ్రహ్మవిష్ణు శివులఁ బ్రస్తుతించి
కరుణ వడసి దైత్యకామిని గైకొని
యాత్మపురికి నరిగెనని వచించె 191

వ. అంత. 192

క. శ్రీదర్శనాఖ్యుఁడను త
ద్భూదేవునియింట నన్న భుక్తుండగుచున్
వైదిక గేహము వెలువడి
యాదట నొకసరసిఁగాంచి యాతీరమునన్. 193

సీ. ఒకకాంతఁ బొడగని యొయ్యన నడిగిన
శ్రీదర్శనునకు నచ్చెలువవలికెఁ
బద్మగర్భతనూజఁ బద్మిష్మనే ముఖ
రాఖ్యుండు తోఁబుట్టెనన్న నాకు
మాతండ్రియును నేను నాతనివెదుకంగ
ధర బరిభ్రమియింపఁ దస్కరుండు
మాతండ్రిఁజంపి నెమ్మది తనసుతునకు
నీయఁగాఁ దలఁచిన నీల్గెనతఁడు
వాఁడునను వెళ్ళఁగొట్టిన వచ్చియిచట
తండ్రితోఁబుట్టు వని మదిఁ దలఁచితలఁచి
దుఃఖచింతావశమ్మునఁ దూలుచుండి
నిన్నుఁబొడగంటి సంతోష నిధియుబోలె 194

క. అనునంతముఖర కుండును
దనసోదరి వెదకికాంచి తండ్రిమరణ మ
వ్వనరుహాముఖ వినిపించిన
విని దుఃఖితుఁ డగుచు మాళవీయ పురమునన్. 195

వ. ప్రవేశించి యారాజునకుం దనమంత్రవిద్యను వాతరోగంబునడం
చిన నమ్మహీశ్వరుండు 196

ఆ. వె. అర్థరాజ్యమీయ నా శ్రీసుదర్శన
ద్విజుఁడు యౌవరాజ్య విభవమొంది
యుండునంత వైశ్యుఁడొక దూతఁబుత్తెంచె
జలధినోడయెక్కి చనదలంచి 197

క. శంసాపూర్వంబుగ ద్విజ
హంసుడు కలమెక్కి విట్సహానుగుఁడై యా
హంసద్వీపమునకుఁ జని
హంసాశ్రయుఁడైన యొక్కయతివరుఁగాంచెన్. 198

సీ. అయ్యతి వరుకృపహస్తి వక్త్రునిఁగాంచి
నుతియించి తద్వరోన్నత విభూతి
దండ్రి యీయఁగ శ్రీదర్శ నాఖ్యుఁడనఁగ
మంజరిఁబెండ్లాడి మహితలీల
నభ్రగయానుఁడై యాత్మపురమున
కేతెంచి పద్మేష్ట ప్రీతికూడి
భార్యలును దానును బ్రహ్మయానతిచేత
శ్రీదర్శనుఁడు యతిసిద్ధివడసి

ననుచుఁ గథచెప్పియేను నీయడవిలోన
వారిచరితంబు దలఁపుచు వచ్చివచ్చి
యలసిపడియుండి మిముగంటి ననుచుమ్రొక్క
...............మెచ్చి మృగాంకదత్తుడపుడు (?) 199

సీ. రాధా పురీ వర రమణుఁడు గ్రభటాఖ్యుఁ
డతనిభార్య మనోరమాభిధాన
యమ్మహీ పతియున్న యాస్థానమునకొక
వర్తకుండరుదెంచి నాట్యమాడ

తత్సుత శ్రీవనితాకృతి ధరియించి
నటియింప బతి భీమభటుడు గదిసి
క్రీడారణంబున గెడించి లాసికా
సుతుఁ జంపుటయు భూమిపతిఁదలంకి
కొడుకు బురము వెళ్లగొట్టి కనిష్ఠునిఁ
బ్రభువుఁ జేయ భీమభటుని హితుఁడు
శంఖదత్తుఁడనెడి సద్విజు డరుదేర
నన్యదేశమున కరుగు నపుడు. 200

ఆ. వణిజుఁడొకడు సింధువాహంబు దెచ్చిన
భీమభటుఁడు దానిఁ బ్రేమగొనిన
ధరపుపిన్న(?) కొడుకు నావాడునర్తకి
తనయుఁడనుచు బాహుదర్పమమర 201

క. భీమభటుమీఁద నడిచిన
భూమిపునకు వెఱచి జ్యేష్ఠపుత్రుఁడు నగరీ
సీమంబు వెడలి తురగము
నామిత్రుఁడు తోడరాగ నరిగి యొకడపన్ (?) 202

క. హారికంఠ కహకహారవ
మురవడి మ్రోయుటయు దురగమోర్వక పడినన్
దురగంబు విడిచి నిజపద
చరణంజని నీలకంఠసంయమి గాంచెన్, 203

వ. తదనుమతంబున స్నానార్థంబు గంగా ప్రవేశంబు చేసిన. 204

క. మిత్రుని మీనుమ్రింగిన
ధాత్రీవరసుతుడు శోకతప్తుండగుచున్
దత్త్రిపథగాంబులం దన
గాత్రంబును విడువఁదలఁప గంగయుఁ బలికెన్ 205

వ. ఈసాహసంబు వలవదు ప్రతిలోమానులోమోచ్చారణంబున స్వేచ్ఛాకృతి ప్రధానమగు మంత్రంబిచ్చెదం గొనుమని యుపదేశించినం గైకొని యమ్మహా నదివీడుకొని లాటదేశంబునకుం జని యుండు. 206

ఆ. ద్యూతమాడి వాసితోడుత దాద్యూత
మాడి గెలిచినట్టియర్థమెల్ల
తనధనంబుచేసి ధనదత్తుడను విప్రుఁ
డాత్మసఖుఁడుగాఁగ నాచరింప 207

సీ. ఆవిప్రు వరుడిట్టులనియెను శివదత్తు
డనెడు విప్రునకునే నాత్మజుఁడను
మాతల్లి కడుపాపమతి యత్త కలహించి
కోడలి నిలువెళ్ళఁగొట్టి యేద్చు
భయమును మాయా స పర్యయు నందక
కపటంబు లధిపతిఁ గల్లలాడు
బంధువర్గము నెల్ల ప్రతిదినంబునుదిట్టు
నెప్పుడు లేదని యింతిసొలయు

భార్యమారుగాఁగ (చంద్రప్రతిమ నా[1])
యదియునీవు వెళ్లుఁడనుచును దూఱు
నందు బడగలేక యరుదెంచి యిచ్చట
నిన్నుగంటి ద్యూతనిధికతాన 208

వ. అనినుతించిన. 209

క. ఆభీమభటుఁడు హితుఁడగు
నాభూసురుఁగూడి తిఱుగునంతట నదిలో
శాభర్యధిపతి తెచ్చిన
లాభమునకు దాశభటులు లౌల్యముమెఱయన్. 210

గీ. అట్టిమత్స్యంబు భేదింప నందులోన
శంఖదత్తుని బొడగాంచి సంతసమున
బ్రతికితెటువలెనన భీమభటున కనియె
మంత్రిపుత్రుఁడు దైవికమహిమఁ జేసి. 211

---

1. ప్రతిమయు నాకిచ్చి.

క. ఈమత్స్య గర్భమున నీ
యామిషమే భుక్తిగొనుచుఁ బ్రాణముతోడన్
భీమభట నిలిచి నానని
యా మిత్రుడు దానుగూడి యాపగకరుగన్. 212

ఉ. భూవరుఁడంతగాంచెఁ బరిపూర్ణ శుధాంశుముఖాంతరాళ శో
భావల మానలోచన విభావళిఁ జారుసహస్ర కన్యకా
భావవిలాస విభ్రమసభావలి నంచిత యానమొప్పహం
సావళిఁ గోమలాంగపరిహాసిత భాసికళాలతావళిన్. 213

క. భామినియుఁ జూచెనుద్భట
భీమభట ప్రకటకర విభీతరకటునిన్
కోమల దేహోత్కటునిన్
భీమభటుని మదనశాస్త్ర బృందార్భటునిన్. 214

వ. అంత 215

గీ. దానిచెలికత్తె గొనిపోవ త్వరితగతిని
నంతిపురిఁజొచ్చి యకాంత ననుభవించె
వేఁగుటయుఁ బుత్రివినుపింప వెలఁదితండ్రి
భీమభటునకుఁ తనకూతుఁ బెండ్లిజేసె. 216

ఉ. పుత్రులు లేమి లాటపతి పుత్రిమనోహరు రాజుచేయ న
క్షత్రియుడాత్మభూమికి నసంఖ్యబలంబుల తోడనేగి ని
క్షత్రముగాగ సోదరుల క్షాత్రతలికిన్ బెడ బాపి తానె యా
ధాత్రియునేలె భూజనులు తత్పరతంగొని యాడుచుండగన్. 217

వ. అంతనాతనిమంత్రి నగునేను నుదంక ఋషికి నపకారంజేసిననతఁడు
నన్ను గజంబవగు మని శపించె 218

ఆ. యట నుదంక శాపహతి హస్తినైయున్న
యేను భీమభటుని యింతి వలన
శాపముక్తివడసి చనుదెంచి నినుగంటి
చండశక్తియనెడు సచివవరుఁడ 219

చ. అనిన మృగాంకదత్తుఁడు ప్రియంబునఁబొంగె ప్రధానిపుత్రకుల్
తనుగొలువంగ శంకరుని దైవశిఖామణిగొల్చి సంస్మరిం
చిన జనుదెంతు నేననుచుఁ జివ్వనఖేచరుఁడేగె దత్తుఁడున్
వనరుహనేత్ర గోరి సచివప్రభులంగొని యేగె వీఁటికిన్. 220

వ. అంతనుజ్జయినీ పురాధీశ్వరుండు తనకూఁతురగు శశిప్రభయను దానిదెచ్చి మృగాంకదత్తునకు వివాహంబొనరించెనని ఋషీశ్వరుండు కథచెప్పి యన్నరవాహనదత్తునకు తనమంత్ర సామర్థ్యంబున ఖచ్చరుం డెత్తుకొనిపోయిన మదనమంచికం దెచ్చియిచ్చిన తనపురంబునకరిగి సుఖంబుండెనని వజ్రప్రభుండను విద్యాధరుండు వత్సేశ్వరునకుఁజెప్పి సుఖంబుండెనని బలీంద్రునకు నారదుండెఱింగించుటయును. 221

ఉ. గంధకరీంద్ర శిక్షణ శిఖండ మహోజ్వల పింఛమాలికా
బంధుర ! కుంట్లముక్ల పినభైరవపాత్ర మనోజ్ఞినీజగ
ద్బాంధవ ! తొండమాభిధ నృపాలకసన్నుతి పాత్ర పాత్రసా
గంధిక వేంకటాద్రిమణి కందరశాశ్వతనీలకంధరా. 222

క. భిల్లస్త్రీమందస్మిత
గల్లస్థల రచిత మకరికామృదువల్లీ
వేల్లితకపోల ! మహితబ
వల్లభ ! పినభైరవేంద్ర వరహృదయేశా. 223

ఉద్ధురమాల :
కుంభీసంభవ శుంభద్వాచా
రంభోజ్జృంభణగుంభద్విద్యా
సంభాసంభవ శంభరలక్ష్మీ
జంభృ (?) ద్భూషణ సంభృతవక్షా. 224

గద్య. ఇదియష్టభాషా కవితాప్రవీణ నవఘంట సురత్రాణ కూచనామాత్య పుత్రసుకవిమిత్ర వినయవిద్యావిధేయ యెఱ్ఱయనామధేయ ప్రణీతంబైన సకలనీతి కథానిధానంబునందు సర్వంబును పంచమాశ్వాసము.